

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీ మద్వాధూలకులతిలక శ్రీ మన్మహాచార్య శిష్యులును
శ్రీ గోవిందాచార్యస్వామి పుత్రులును నగు
**శ్రీ శ్రీనివాసాచార్యస్వామివారిచే రచింపబడిన**

# యతీన్ద్రమతదీపికా




**అనువాదకులు :**

శ్రీ. ఉ. వే. శ్రీమాన్
శ్రీభాష్యం వేంకట నరసింహ భాష్యకారాచార్యస్వామివారు





**ప్రకాశకులు :**

శ్రీమదుభయ వేదాంతాచార్యపీఠ సంస్థాపకులైన
శ్రీ శ్రీ శ్రీ త్రిదణ్డి శ్రీమన్నారాయణ రామానుజజీయస్వామివారు

**1975**

మూల్యం - రూ. **8-00**

# వి జ్ఞ ప్తి

ఈ గ్రంధము నిజముగ యతీంద్రులగు భగవద్రామానుజుల మతమును దీపికవలె ప్రకాశింపజేయునది యనుటలో సందేహములేదు. ఇందు న్యాయ ప్రకరణ గ్రంధములలోవలెనే మతము ప్రత్యక్ష - అనుమాన - శబ్ద ప్రమాణములను వేరు వేరు అవతారములను పేరుతో వివరించి ఆపైన అచిత్తుకాలము నిత్యవిభూతి, ధర్మభూతజ్ఞానములను జీవ - ఈశ్వర తత్వములను వివరించి చివరకు గుణనిరూపణముతో పది యవతారములుగా విభజించి వివరింపబడినవి. ఇది రామానుజ దర్శనమననుసరించి పదార్ధజ్ఞానమున కెంతయో యుపకరించును.

ఇంత సరళముగను సుబోధకముగను సమగ్రముగను శ్రీ రామానుజ దర్శన జ్ఞానమును అందజేయు గ్రంధము వేరొండులేదు. అందులకే సంస్కృత వేదాంతములో పరీక్షల నీయగోరు వారికిది ప్రప్రధమ పాఠ్యగ్రంధముగా శ్రీమదుభయ వేదాంత ఆచార్య పీఠము ద్వారా నిర్దేశింపబడినది. పరీక్షల నొసంగకున్నను ఈ దర్శనమున ప్రవేశము కలుగవలెనవిన నింతకు మించిన గ్రంధము వేరొండులేదు. అందుచే సంస్కృత భాషాభిజ్ఞానములేనివారికిని యీ దర్శనము స్వరూపములెస్సగ తెలియవలెనని దీనిని అంధ్రీకరింపగోరితిమి. కీ॥ శే॥ శ్రీ ఉ. వే. శ్రీమాన్ శ్రీభాష్యం భాష్యకారాచార్య స్వామివారు మా ప్రార్ధన నంగీకరించి అచిరకాలముననే దీనిని ఆవశ్యక విషయము విమర్శనతో నందరకును బోధకమగునటుల అనువదించి ప్రసాదించిరి. వారికి మన వైష్ణవలోకమెంతయో ఋణపడియున్నది. కాని వారు జీవించియుండగ దీనిని ముద్రించి వారికానందమునొసగూర్ప యత్నించితిమిగాని ముద్రణాలయ సౌకర్యములు నన్నగించుటచే నింత అలస్యమైనది.

తత్వజిజ్ఞాసులందరును దీనిని చదివి పదార్ధతత్వమును చక్కగ నెఱుంగుదురుగాక !

ప్ర కా శ కు లు.

# విషయానుక్రమము

శ్రీమతే రామానుజాయ నమః

# యతీన్ద్రమతదీపికా

## ప్రథమోవతారః

శ్లో॥ శ్రీ వేఙ్కటేశంకరిశైలనాథం
శ్రీ దేవరాజంఘటికాద్రిసింహమ్ ।
కృష్ణేనసాకంయతిరాజమీడే
స్వప్నేవదృష్టాన్మమదేశికేన్ద్రాన్ ॥

యతీశ్వరంప్రణమ్యాహం వేదాన్తార్యంమహాగురుం ।
కరోమిబాలబోధార్థం యతీన్ద్రమతదీపికామ్ ॥

శ్లో॥ శ్రీ శ్రీనివాసం శ్రితపారిజాతం
శ్రీ భూసమేతం కరుణప్రపూర్ణమ్
సర్వాత్మభూతం సకలార్తినాశం
కల్యాణమూర్తిం సతతం భజేహమ్ ॥

**తిరువేంగడాంబా శ్రీ శ్రీనివాసౌ మేపితరౌసదా**
**చింతయన్ అనుకుర్వేద్వ్యయతీంద్రమతదీపికామ్ ॥**

శ్రీమన్నారాయణఏవ చిదచిద్విశిష్టాద్వైతతత్త్వం, భక్తిప్రపత్తిభ్యాం ప్రసన్నస్సఏవోపాయః, అప్రాకృతదేశ విశిష్టస్సఏవప్రాప్య, ఇతివేదాన్తవాక్యైః ప్రతిపాదయతాం వ్యాసబోధాయనగుహదేవభారుచిబ్రహ్మనన్ది ద్రమిడాచార్య శ్రీ పరాఙ్కుశనాథయామునమునియతీశ్వరప్రభృతీనాం మతానుసారేణ బాలబోధనార్థం వేదాన్తానుసారిణీ యతీన్ద్రమతదీపికాఖ్యా శారీరక పరిభాషా మహాచార్య కృపావలమ్బినామయా యథామతి సఙ్గ్రహేణ ప్రకాశ్యతే.

**శ్రీ వేంకటేశుని, హస్తిగిరి నాథుఁడగు వరదరాజస్వామిని, ఘటికాద్రి నారసింహుని, శ్రీకృష్ణుని, యతిరాజేంద్రుఁడగు రామానుజా**

చార్యులను స్వప్నమున సాక్షాత్కరించిన యస్మదాచార్యులను వేదాంత దేశిక మహాగురువులను సాష్టాంగముగా నమస్కరించి బాలబోధార్థము యతీంద్రమతదీపిక యను గ్రంథమును రచించుచున్నాను.

జీవుఁడు ప్రకృతియును చిదచిత్పదార్థముల రెండిటితో అపృథక్సిద్ధముగా నిత్యయుక్తుఁడయియున్న శ్రీమన్నారాయణుఁడే (అద్వైత) తత్త్వము. భక్తిప్రపత్తులచేఁ బ్రసన్నుఁడయిన యాతఁడే మోక్షోపాయము. ప్రకృత్యతీతమగు శ్రీ వైకుంఠమనఁబడు పరమపదముననుండు నాతఁడే ప్రాప్యము. అని సకల వేదాంతములును బ్రతిపాదించుచున్నవి. ఇట్లని వ్యాస, బోధాయన, గుహదేవ, భారుచి, బ్రహ్మనంది, ద్రవిడార్య, పరాంకుశ, నాథ, యామునముని యతీంద్రాదుల మతము వారి మతము ననుసరించి యుపనిషదనుసారియగు నీయతీంద్రమతదీపిక యను శారీరక పరిభాషాగ్రంథమును ఆచార్యానుగ్రహము నాధారముగా జేసికొని సంగ్రహముగా యథాశక్తిగా రచింతును.

సర్వం పదార్థజాతం ప్రమాణప్రమేయభేదేన ద్విధా భిన్నం. ప్రమాణాని త్రీణ్యేవ. ప్రమేయం ద్వివిధం – ద్రవ్యాద్రవ్యభేదాత్. ద్రవ్యం ద్వివిధం – జడమజడం చేతి. జడం చ ద్వివిధం – ప్రకృతిః కాలశ్చేతి. ప్రకృతిశ్చతుర్వింశతి తత్త్వాత్మికా. కాలస్తూపాధిభేదేన త్రివిధః. అజడం తు ద్వివిధం – పరాక్ప్రత్యక్చేతి. పరాగపి ద్విధా – నిత్యవిభూతిర్ధర్మభూతజ్ఞానం చేతి. ప్రత్యగపి ద్వివిధః – బద్ధముక్తనిత్యభేదాత్. బద్ధోపి ద్వివిధః – బుభుక్షు ముముక్షుభేదాత్. బుభుక్షుర్ద్వివిధః. అర్థకామపరో ధర్మపరశ్చేతి. ధర్మపరో ద్వివిధః – దేవతాన్తరపరో భగవత్పరశ్చేతి. ముముక్షుర్ద్వివిధః – కైవల్యపరో మోక్షపరశ్చేతి. మోక్షపరో ద్వివిధః – భక్తః ప్రపన్నశ్చేతి. ప్రపన్నశ్చ ద్వివిధః – ఏకాన్తీ పరమైకాన్తీ చేతి. పరమైకాన్తీ ద్వివిధః – దృప్తార్తభేదాత్.

సకల పదార్థములును బ్రమాణములు ప్రమేయములు నని రెండు విధములు. అందుఁ బ్రమాణములు మూఁడు మాత్రమే. ద్రవ్యము అద్రవ్యము అని ప్రమేయములు రెండువిధములు. ద్రవ్యము (1) జడము (2) అజడము అని ద్వివిధము జడద్రవ్యము (1) ప్రకృతి (2) కాలము అని ద్వివిధము. ప్రకృతి ఇరువదినాల్గు తత్త్వముల రూపముననుండును.

అవి "ప్రకృతి, మహత్తు, అహంకారము, మనస్సు, శ్రోత్రము, త్వక్కు, చక్షుస్సు, జిహ్వ, ఘ్రాణము, వాక్పాదపాణి, పాయూపస్థములు, పంచ తన్మాత్రలు, పంచభూతములు" అనునవి.

కాలమనఁబడు రెండవ జడద్రవ్యము భూత భవిష్యద్వర్తమాన రూపమగు నుపాధిభేదముచేఁ ద్రివిధము. అజడద్రవ్యముకూడ పరాక్కు ప్రత్యక్కు అని ద్వివిధము. అజడమగు పరాగ్ద్రవ్యముకూడ నిత్య విభూతి, ధర్మభూతజ్ఞానము అనిద్వివిధము. అజడమగు ప్రత్యగ్ద్రవ్యము కూడ జీవుఁడు ఈశ్వరుఁడు అని ద్వివిధము. అందు జీవుఁడు బద్ధుఁడు ముక్తుఁడు నిత్యుఁడు నని మూఁడు విధములు. అందు బద్ధుఁడు బుభుక్షువు ముముక్షువు నని రెండువిధములు. బుభుక్షువు అర్థకామపరుఁడు ధర్మపరుఁడు నని రెండువిధములు. ధర్మపరుఁడును దేవతాంతరపరుఁడు భగవత్పరుఁడు నని రెండువిధములు. ముముక్షువుకూడ కైవల్యపరుఁడు మోక్షపరుఁడు నని రెండువిధములు. అందు మోక్షపరుఁడగు ముముక్షువు భక్తుఁడు, ప్రపన్నుఁడు అని రెండువిధములు. ప్రపన్నుఁడును ఐకాంతి పరమైకాంతి అని ద్వివిధము. పరమైకాంతియు దృప్తప్రపన్నుఁడు ఆర్తప్రపన్నుఁడు అని ద్వివిధము

పఞ్చధా౽వస్థిత ఈశ్వరః—పరవ్యూహవిభవాన్తర్యామ్యర్చావతారభేదాత్. పర ఏకధా. వ్యూహశ్చతుర్ధా—వాసుదేవ సఙ్కర్షణ ప్రద్యుమ్నానిరుద్ధభేదాత్. కేశవాదివ్యూహాన్తరం. మత్స్యాద్యవతారా విభవాః పునరనన్తాః అన్తర్యామీ ప్రతిశరీరమవస్థితః. అర్చావతారస్తు శ్రీరఙ్గాదిషు సకలమనుజనయనవిషయతాంగతో మూర్తివిశేషః.

ఈశ్వరుఁడును పరవ్యూహవిభవాంతర్యామ్యర్చావతార రూపమున నయిదు విధములుగా నుండును. పరుఁడొక్కవిధను. వ్యూహము వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ భేదములచే నాల్గువిధములు. కేశవాదులను వ్యూహభేదములే. మత్స్యకూర్మాదులు విభవములు, ఇవి యనంతములు, ప్రతి శరీరముననుండు నీశ్వరుఁడు అంతర్యామి యనఁ బడును. శ్రీరంగ, వేంకటాచల, హస్తిగిరి, యాదవాద్రి ఘటికాచలాదు

లందుండి సకల మానవులకును గోచరించు మూర్తి విశేషము అర్చ యనఁబడును.

అద్రవ్యంతు సత్త్వరజస్తమశ్శబ్దస్పర్శరూపరసగన్ధ సంయోగశక్తి భేదాద్దశైవ.

ఇంక నద్రవ్యము పదివిధములు. అవి సత్త్వరజస్తమస్సులు, శబ్దస్పర్శరూప రసగంధములు, సంయోగము, శక్తి అనఁబడునవి.

ఏవముద్దేశక్రమేణ పరీక్షా క్రియతే. తత్ర ప్రమాకరణం ప్రమాణం. ప్రమాణంలక్ష్యం. ప్రమాకరణత్వం లక్షణం. యథాఽవస్థితవ్యవహారానుగుణం జ్ఞానం ప్రమా. ప్రమాలక్ష్యం.

ఇట్లు పదార్థములను వరుసగా నామములతో నిర్దేశించి ఆవరుసనే వానికి అవ్యాప్త్యతి వ్యాప్త్యసంభవములనఁబడు దోషములులేని అసాధారణ ధర్మములనబడు లక్షణములనుజెప్పి ఆ లక్షణ విచారమనఁబడు పరీక్షయును జేయుదుము. మొదట నిర్దేశించిన క్రమమునఁబ్రమాణ మనగా నెట్టిదియో వివరింపఁబడును.

యథావస్థితవ్యవహారానుగుణజ్ఞానత్వం లక్షణం, జ్ఞానం ప్రమేత్యుక్తే శుక్తౌ రజతమిదం రజతమితి జ్ఞానేఽతివ్యాప్తిః — అతఉక్తం వ్యవహారానుగుణం జ్ఞానమితి. ఏవమపి తత్రైవాతివ్యాప్తిః — భ్రాన్తిదశాయామిదం రజతమితివ్యవహ్రియమాణత్వాత్. అతఉక్తంయథాఽవస్థితేతి. యథావస్థితపదేనసంశయాన్యథాజ్ఞానవిపరీతజ్ఞానవ్యావృత్తిః.

ప్రమాత్మక జ్ఞానమునకు కరణమగునది ప్రమాణమనఁబడును. ప్రమ భ్రమము అని జ్ఞానము రెండు విధములుగా నుండును. అందు ప్రమయనంబడు జ్ఞానమును గలిగించునది ప్రమాణమని భావము. ప్రమాణమనఁగా నెట్టిదియో లక్షణముచేఁ దెలిసికొందుము కావున ప్రమాణము లక్ష్యమగును. దానిం దెలియఁజేయునది లక్షణమగును. ప్రమాణము లక్ష్యమనఁగాఁలక్షణముచేఁ దెలియఁజేయఁబడునది. ప్రమాత్మకజ్ఞానకరణత్వము ప్రమాణలక్షము ఈ లక్షణవాక్యములోని ప్రమ

యనఁగా యధావస్థిత వ్యవహారానుగుణజ్ఞానము. యథావస్థిత వ్యవహారానుగుణజ్ఞానత్వము ప్రమాలక్షణమగును, యధావస్థిత వ్యవహారానుగుణజ్ఞానము ప్రమయని తాత్పర్యము. అనఁగా లక్ష్యము.

ఈ లక్షణవాక్యమునఁగల "యధావస్థిత వ్యవహారానుగుణ" అను విశేషణమును విడచి కేవలముగా "జ్ఞానముప్రమ" అనిన లక్షణము సరిపడదు. అపుడు భ్రమము కూడ జ్ఞానమే కావున దానియందతివ్యాప్తి వచ్చును. అనగా - అదికూడ ప్రమ కావలసివచ్చును, ముత్తెపుచిప్పను జూచి "ఇది రజతము" అను జ్ఞానము కలిగినపుడు దానిని భ్రమ మందురు. అది ప్రమకాదు. అదియు జ్ఞానమే కావున "జ్ఞానము ప్రమ" అనినచో నట్టి భ్రమముకూడ ప్రమాలక్షితమగుటచే నతివ్యాప్తియగును. కావున "జ్ఞానముప్రమ" యన్నచో లక్షణము సరిపడదు కావున "వ్యవహారానుగుణ" పదము చేర్పఁబడెను. శుక్తియందు రజతమను వ్యవహారము లోకమున లేదు. కావున నిది వ్యవహారానుగుణముకాదు. కావున భ్రమయందతివ్యాప్తి వారించునని యాశయము. కాని లోక సామాన్యవ్యవహారము భ్రాంతిస్థలమున అనఁగా శుక్తియందు రజతమను వ్యవహారము లేకున్నను భ్రాంతిగలవాడు మాత్రము శుక్తినిజూచి ఇది రజతమనియే వ్యవహరించును. కావున భ్రాంతిస్థలమునందలి జ్ఞానము కూడ వ్యవహారానుగుణజ్ఞానమే కావున మరల నతివ్యాప్తి వచ్చుచున్నది. దానిని వారించుటకై "యధావస్థిత" విశేషణముంజేర్చి "యధావస్థిత వ్యవహారానుగుణజ్ఞానముప్రమ" అని చెప్పఁబడెను. అవస్థితవస్తువు శుక్తికావున దాని నతిక్రమించిన రజతము అను వ్యవహారము యథావస్థితము కాఁజాలదు. లోకమున ఏవస్తువునకెట్టి వ్యవహారము కలదో అట్టిదియే యథావస్థిత వ్యవహారమగును. రజతమునుజూచి "ఇది రజతము" అను జ్ఞానమును బొందినచో నట్టి జ్ఞానమే యధావస్థిత వ్యవహారానుగుణ జ్ఞానమనఁబడును అదియే 'ప్రమ' యనఁబడును. "యధావస్థితమగు వ్యవహారము" అని యధావస్థిత పదమును వ్యవహారపదమునకు విశేషణముంజేయక "యధావస్థితం వ్యవహారానుగుణం జ్ఞానం" అని యథావస్థితపదమును జ్ఞానమునకు విశేషణముగాఁ గొంద

రన్వయింతురు యథావస్థితమనుటచే సంశయము అన్యథా జ్ఞానము విపరీత జ్ఞానము నివృత్తములయ్యెను.

ధర్మిగ్రహణేమిథోవిరుద్ధానేకవిశేషస్ఫురణం సంశయః-యథాఊర్ధ్వతా విశిష్టేస్థాణుర్వాపురుషోవేతిజ్ఞానం.

సంశయమనఁగా ధర్మినిగ్రహించునపుడు పరస్పర విరుద్ధములగు ననేక విషయములు (ధర్మములు) భాసించుట. ఒక పొడవుగానున్న వస్తువునుజూచి ఇది స్థాణువా లేక పురుషుఁడా యని పరస్పర విరుద్ధము లగు స్థాణుత్వ పురుషత్వములు అను విశేషములు స్ఫురించును. ఇదియే సంశయము. పొడవుగానున్న ఒక ధర్మివి చూడగా దానియందు స్థాణుత్వ పురుషత్వములు భాషించుచున్నవి. ఆ ధర్మములు రెండును పరస్పర విరుద్ధములు. అనఁగా నాధర్మి స్థాణువయినచో పురుషుఁడు కారాదు. పురుషుఁడయినచో స్థాణువుకారాదు. కావున స్థాణుత్వ పురుషత్వములు పరస్పర విరుద్ధములు - ఒకచోట కలసియుండని ధర్మములని భావము.

అన్యథాజ్ఞానంనామధర్మవిపర్యాసః-యథాకర్తృత్వేనభాసమానే ఆత్మని యుక్తిభిః కర్తృత్వస్య భ్రాన్తత్వోపపాదనం.

అన్యథా జ్ఞానమనఁగా ధర్మవిపర్యాసము అనఁగా నొకధర్మియందు ఆధర్మిని సరిగా తెలిసికొన్నను ధర్మమును విపరీతముగా గ్రహించుట అనఁగా దానియందు ఉన్న ధర్మమును లేదనుకొనుట లేని ధర్మమును ఉన్నదనుకొనుటయును, ఆత్మయందు కర్తృత్వము భాషించుచుండగా ఈయుక్తులచేఁగర్తృత్వము లేదనియు నది భ్రాంతిసిద్ధమనియుఁదలంచుట. ఇట ఆత్మ అనఁబడు ధర్మిని దెలిసికొనియు దానియందుఁగల కర్తృత్వ మనఁబడు ధర్మమును విపరీతముగా గ్రహించెను. గావున నిది యన్యథా జ్ఞానమనఁబడును ఒకవిధముగానున్న వస్తువు నింకొక విధముగ నున్న దనుకొనుటయేకదా యన్యథాజ్ఞానము. స్వర్గమోక్షాది సాధనానుష్ఠానము లను విధించు శాస్త్రము ఆత్మకు కర్తృత్వములేనిచో వ్యర్థమగునుగదా ! కావున నాత్మయందు కర్తృత్వము కలదనకతీరదు.

విపరీతజ్ఞానం నామధర్మివిపర్యాసః—యథావస్తునో వ స్త్వన్తరజ్ఞానం.

విపరీతజ్ఞానమనఁగా ధర్మివిపర్యాసము. ఒక వస్తువును ఇంకొక వస్తువను కొనుట ఇదియే భ్రమయనఁబడును. శుక్తినిచూచి రజతమనుకొనుట ధర్మివిపర్యాసము కావున విపరీతజ్ఞానమగుచున్నది.

ఈ మూఁడు జ్ఞానములును యథావస్థితములు కావు కనుక ప్రమాణలక్షణము వీనియందు అతివ్యాప్తముకాదు.

లక్షణస్య త్రీణిదూషణానిసన్తి — అవ్యాప్తిరతివ్యాప్తిరసమ్భవశ్చేతి లక్ష్యైకదేశేలక్షణస్యావర్తనమవ్యాప్తిః.

లక్షణమునకు అవ్యాప్తి అతివ్యాప్తి అసంభవము అని మూఁడు దోషములుండును. లక్ష్యములలో నొకచోట లక్షణము వర్తింపకపోవుట అవ్యాప్తియగును. ''జీవుఁడు గుణత్రయవశ్యుఁడు'' అని జీవలక్షణము చెప్పినచో నిత్యులును ముక్తులును గుణత్రయవశ్యులు కారు కనుక జీవులలో కొందఱియందీ లక్షణమవ్యాప్తమయ్యెను.

లక్ష్యాదన్యత్ర వర్తమానత్వమతివ్యాప్తిః.

లక్ష్యములందంతటను వర్తించుచు లక్ష్యము కాని వాని యందును వర్తించుట అతివ్యాప్తియగును. ''జీవుఁడు జ్ఞానగుణము కలవాఁడు'' అను జీవలక్షణమునకతివ్యాప్తి కలదు. జీవులందఱియందును జ్ఞానగుణము ఉన్నను జీవుడుకాని పరమాత్మయందును జ్ఞానగుణము కలదు కావున నతివ్యాప్తిదోషము సంభవించెను లక్ష్యముకాని దానియందు వర్తించుట అతివ్యాప్తియని చెప్పరాదు. అట్టి లక్షణము అసంభవదోషమునందును వర్తించును. కావున "లక్ష్యమునందంతటను ఉండి" అను దళమును చేర్చి లక్ష్యేతరమునందు వర్తించుట యని చెప్పవలయును. కానిచో అతివ్యాప్త్యసంభవదోషములు సంకీర్ణములు కావలసివచ్చును

లక్ష్యేత్వాప్యవర్తనమసమ్భవః — యథా చక్షుర్విషయోజీవ ఇత్యుక్తే అసమ్భవఏవ.

లక్ష్యములలో దేనియందును లక్షణము వర్తింపకపోవుట అసంభవమగును. "కంటికిఁగనఁబడువాఁడు జీవుడు" అను జీవలక్షణమున నసంభవము కలదు. ఏజీవుఁడును కంటికిఁగనబడడుగదా.

లక్ష్యోక్తదోషత్రయరాహిత్యాత్ప్రమాణలక్షణం సుస్థితం.

ఇట్టి దోషములు మూడింటిలో నెట్టిదియుఁ బ్రమాలక్షణమునలేదు కావున నిది సరియైన లక్షణమనఁదగును.

సాధకతమత్వం కరణం అతిశయితసాధకం సాధకతమం. యస్మిన్ సత్యవిలమ్బేనజ్ఞానముత్పద్యతే — తదతిశయితమిత్యుచ్యతే. తేన ప్రమాకరణం ప్రమాణమితిసిద్ధం. అనధిగతార్థగన్తృ ప్రమాణమిత్యాదికం తుతత్త్వాదిభిరేవ నిరస్తత్వాదనాదరణీయం.

ఇంకఁ బ్రమాకరణము ప్రమాణమనుచోటఁగల కరణ పదమున కర్థము చెప్పఁబడుచున్నది. కరణమనఁగా సాధకతమము, అతిశయితమగు సాధకము సాధకతమమగును. ఏసాధనమువలన అవిలంబముగా సాధ్యము (జ్ఞానము) జనియించునో యది యతిశయితమగును అనఁగాఁ బ్రమాణములవలన నవిలంబముగాఁ బ్రమాత్మకజ్ఞానము జనించును గావున నవి ప్రమాకరణములగునని భావము.

కొందఱు (మాయావాదులు) "అనధిగతార్థగంతృప్రమాణమ్" ఇత్యాది లక్షణములను జెప్పిరి కాని యవి కొందఱిచే (నైయాయికులచే) ఖండింపఁబడి యుండుటచే ననాదరణీయములు.

అది యెట్లనిన "ఇంతకుమున్ను తెలియఁబడని దానిని తెలియఁజేయునది ప్రమాణము" అని మాయావాదుల ప్రమాణ లక్షణము, స్మృతి, పూర్వమనుభవించిన దానిని తెలుపును గాన యిట్లనుటచే స్మృతియందు ప్రమాణలక్షణమతివ్యాప్తి చెందదు. అని వారి యాశయము. ధారావాహిక జ్ఞానమునందు ద్వితీయాది జ్ఞానములు పూర్వానుభూత విషయకములే యనియు నందువలన దానియందు అవ్యాప్తి వచ్చుననియు

శంకింపరాదు. పూర్వక్షణవర్తి జ్ఞానము ద్వితీయక్షణవర్తి కాజాలదు. అట్లే ద్వితీయ క్షణవర్తి జ్ఞానము తృతీయ క్షణవర్తి కాజాలదు. జ్ఞానమునకు విశేషణమగు కాలముకూడ నింద్రియగోచర మగుననియు విశేషణ భేదముచే విశిష్టమునకు భేదముకల్గును గావున ధారావాహిక జ్ఞానము నందలి ద్వితీయాది జ్ఞానములు భిన్నభిన్నములే కావున అనధిగతములే యగునని వారియాశయము - కాని యది సరికాదు. విశేషణమునకుఁ గూడ నింద్రియగోచరత్వ మంగీకార్యమన్నచో. "ఆకాశమున బలాక పక్షులు" అనుచోట బలాకములవలె నాకాశముకూడ చక్షురింద్రియగోచర మనవలసివచ్చును. వారి మతమున నాకాశము చక్షుర్విషయముకాదు. కనుక "అనధిగతార్థగంతృ ప్రమాణమ్" అను మాయావాదుల లక్షణము సరికాదు (రామానుజమతమున మాత్రము ఆకాశము ప్రత్యక్షవిషయమే యగును) ధారావాహిక జ్ఞానమొక్కటియే జ్ఞానముకాని మూడజ్ఞానములు కావు

తాని ప్రమాణాని ప్రత్యక్షానుమానశబ్దాఖ్యాని త్రీణి. తత్ర సాక్షాత్కారి ప్రమాకరణం ప్రత్యక్షం. అనుమానాదివ్యావృత్త్యర్థం సాక్షాత్కారీతి. దుష్టేన్ద్రియవ్యావృత్త్యర్థం ప్రమేతి.

ప్రత్యక్షము - అనుమానము - శబ్దము అని ప్రమాణములు మూఁడు మాత్రమే. అందు "సాక్షాత్కారి ప్రమాకరణము ప్రత్యక్షము" అని ప్రత్యక్ష లక్షణము ఇందు "సాక్షాత్కారి" యను పదము ప్రమా పదముతో నన్వయించును. అనఁగా సాక్షాత్కారియగు ప్రమాత్మకజ్ఞానమునకుఁగరణము ప్రత్యక్షము అని భావము. అనుమాన శబ్దములు సాక్షాత్కారి జ్ఞాన జనకములుకావు. ఇంద్రియదోషమువలనఁ గలుగు నన్యథా జ్ఞానము ప్రమాత్మకముకాదు, కావున "సాక్షాత్కారి" అను దళమువలన అనుమితియందును "ప్రమ" యనుదళమువలన నన్యథాజ్ఞానాదులందును అతివ్యాప్తి నివృత్తమయ్యెను, అనఁగా ననుమానాది ప్రమాణములును దుష్టేంద్రియములును బ్రత్యక్షప్రమాణ లక్షణమునకు విషయములుకావు.

ఇట సాక్షాత్కారిణియనఁగా నింద్రియ జన్యమగు ప్రమయని కొందఱు తలంచిరి. అది సరికాదు ముక్తులయొక్కయు నిత్యుల యొక్కయు ఈశ్వరుని యొక్కయు జ్ఞానము ఇంద్రియజన్యముకాదు. కావున దానియందు వ్యాప్తి సంభవించను. కావున లైంగికత్వ శాబ్దత్వ స్మృతిత్వరహితమగు జ్ఞానము సాక్షాత్కారియని తెలియనగుమ,

తచ్చ ప్రత్యక్షం ద్వివిధం - సవికల్పక నిర్వికల్పకభేదాత్. నిర్వికల్పకం నామగుణ సంస్థానాది విశిష్ట ప్రథమపిండ గ్రహణం. సవికల్పకంతు సప్రత్యవ మర్శగుణసంస్థానాది విశిష్టద్వితీయాదిపిండ గ్రహణం. ఉభయమప్యేత ద్విశిష్ట విషయమేవ - అవిశిష్టగ్రాహిణో జ్ఞానస్యానుపలమ్భాదనుపపత్తేశ్చ.

నిర్వికల్పకము సవికల్పకము అని ప్రత్యక్షము ద్వివిధము. గుణ సంస్థానాది విశిష్ట ప్రథమపిండ జ్ఞానము నిర్వికల్పకము. ప్రత్యవ మర్శ సహితమగు గుణసంస్థానాది విశిష్టద్వితీయాదిపిండ జ్ఞానము సవికల్ప కమునఁబడును. ఈరెండు విధములగు జ్ఞానములునుగూడ విశేషణము తోఁగూడిన విశేష్యమునే సంబంధించును. అనఁగా గోత్వాది విశిష్ట గోవ్యక్త్యాదికమే ప్రత్యక్షవిషయమగును. విశేషణ విశిష్టముకానివస్తువు జ్ఞానమున గోచరింపదు. అట్లు గోచరించుటకు ఉపపత్తియును లేదు. నిర్వికల్పక జ్ఞానమునను జాతి వ్యక్తులు (గోత్వము-గోవ్యక్తి) రెండును విషయములగును. జాతియనఁగా వస్తుసంస్థానమేకాని తద్భిన్నపదార్థము లేదని సిద్ధాంతము. అపుడు గోత్వవిరహితమగు అనఁగా సంస్థానరహిత మగు గోవ్యక్తి ఎట్లు భాసించును? సవికల్పక జ్ఞానమున విశేషణ విశేష్యములకు రెండిఁటికిని భావమును అందఱును అంగీకరించియే యున్నారు. అయినను ఈరెండింటికిని భేదములేకపోలేదు నిర్వికల్పక మున విశేషణమగు సంస్థానాదికము భాసించినను అదియే ప్రథమజ్ఞాన మగుటచే ఇట్టిదింకొకటి యుండెనను అనువృత్తిజ్ఞానము కలుగదు. సవికల్పకమున నట్లుకాక ప్రథమపిండ గ్రహణమున విషయమగు సంస్థానమే ఇందునుగలదని యనువృత్తిజ్ఞానమధికము.

నిర్వికల్పకజ్ఞానమున ఘటపటత్వాదులకు వైశిష్ట్యా నవగాహి జ్ఞానము మాత్రము కల్గునని కొందఱనిరి. కాని జాతివ్యక్తులు నియత

సంబంధులు (అపృథక్సిద్ధములు) అగుటచేతను ఏక సామగ్రీ వేద్యము లగుటచేతను పరస్పర సంబంధములేనివిగా భాసింపవు. సంస్థానరూపజాతి సహితముగా "నిది ఇట్టిది" అని విశేషణ విశిష్టమగుచునే అనగా పరస్పర సంబద్ధములుగనే నిర్వికల్పకమునందును భాసించును. సవికల్ప కమునందు ఆ సంస్థానమునకే అనేక వస్తునిష్ఠత్వమధికముగా ప్రతీయ మానమగుచుండును. సంస్థానమనబడు విశేషణ పదార్థము అనేక విశేష్యములందు (ధర్మియందు) ఉండుటచే అనేక వస్తువులకు విశేషణ మగుట మాత్రము ద్వితీయాది జ్ఞానములందు గోచరించును. కావున ద్వితీయాది జ్ఞానములు సవికల్పకము లనంబడును. సవికల్పక నిర్వి కల్పకముల రెంటను జాతి భాసించుచునే యుండును. సవికల్పకము నందనువృత్తి ధర్మముకూడ భాసించుట విశేషము దీనింబట్టి యను వృత్తియు జాతియు నొక్కటియని భ్రమింపరాదు. అనువృత్తి విశిష్ట సంస్థానము జాతియని తెలియనగును.

గ్రహణప్రకారస్తు, ఆత్మా మనసా సంయుజ్యతే – మన ఇన్ద్రియేణ – ఇన్ద్రియమర్థేన – ఇన్ద్రియాణాం ప్రాప్యకారిత్వనియమాత్ – అతో ఘటాది రూపాద్యర్థస్య చక్షురాదీన్ద్రియస్య చ సన్నికర్షేణ 'అయం ఘట' ఇతి చాక్షుషజ్ఞానం జాయతే. ఏవం స్పార్శన ప్రత్యక్షేఽపి.–

జ్ఞానము ఎట్లు కలుగుననగా – ఆత్మ మనస్సుతోడను మనస్సు ఇంద్రియముతోడను ఇంద్రియము ఘటపటాది విషయములతోడను సంయోగించును (సంబంధించును). అపుడు ఘటాదిజ్ఞానము కలుగును. ఇంద్రియములన్నియు "ప్రాప్యప్రకాశకారులు" అను నియమముగలదు. అనగా నింద్రియములు వస్తువులతో సంనికర్షమునుజెందియే యాసంబద్ధ వస్తువులను భాసింపజేయునని భావము. కావున ఘటాదివిషయములతో చక్షురాదీంద్రియములు సంనికర్షమును జెందినపుడే "ఇది ఘటము" ఇత్యాది జ్ఞానముజనించును. ఇట్లే త్వగింద్రియమునకును వాయ్వాది విషయములకును సన్నికర్షముకలిగి త్వాచప్రత్యక్షము జనించును. ఇతర ప్రత్యక్షములును ఇట్లే సంనికర్షజన్యములే.

త్వగింద్రియము, రసనేంద్రియమును తమతో సంయోగించిన వస్తువులనే ప్రకాశింపఁజేయుట స్పష్టమే. ఘ్రాణేంద్రియము గూడ దూరస్థగంధము నయినను వాయువశమున సమీపస్థమయి సంయుక్తమయినపుడే ప్రకాశింపఁజేయుచున్నది. చక్షురింద్రియమునకు మాత్రము సాక్షాత్తుగా విషయముతో సంయోగములేదు. అనఁగా చక్షురింద్రియము చంద్రాదులను సంయోగింపకయే ప్రకాశింపఁజేయును. అనగా చక్షురింద్రియము వృత్తిద్వారాగా విషయముతో సంబంధించునని తెలియనగును. శ్రోత్రమునకును ఉత్పన్నమగుశబ్దము వాయువశమున సమీపాగతమయి సంబద్ధమగును. కావున నింద్రియములు "ప్రాప్యప్రకాశకారుల" నుట సిద్ధించెను. కావున ఆత్మ, మన, ఇంద్రియ, అర్థముల సంబంధము చేతనే జ్ఞానము కలుగును.

ద్రవ్యగ్రహణే సంయోగస్సమ్బన్ధః. ద్రవ్యగతరూపాదిగ్రహణే సమవాయానఙ్గీకారాత్సం యుక్తాశ్రయణం సమ్బన్ధః,

ఇంద్రియము ద్రవ్యమును గ్రహించునపుడు వానికి సంయోగము సంబంధము. ద్రవ్యములయందలి రూపాదులను గ్రహించునపుడు సంయుక్తాశ్రయణము సంబంధము. సమవాయ సంబంధమును మనమంగీకరింపము.

నిర్వికల్పక సవికల్పక భిన్నం ప్రత్యక్షం ద్వివిధం – అర్వాచీనమనర్వాచీనంచేతి. అర్వాచీనం పునర్ద్వివిధం – ఇన్ద్రియసాపేక్షం తదనపేక్షంచేతి. తదనపేక్షం ద్వివిధం – స్వయంసిద్ధం దివ్యంచేతి. స్వయంసిద్ధం–యోగజన్యం. దివ్యం – భగవత్ప్రసాదజన్యం. అనర్వాచీనంతు ఇన్ద్రియానపేక్షం నిత్యముక్తేశ్వరజ్ఞానం, అనర్వాచీనం ప్రసఙ్గాదుక్తం. ఏవం సాక్షాత్కారి ప్రమాకరణం ప్రత్యక్షమితిసిద్ధం.

నిర్వికల్పకము సవికల్పకము అను భేదములతోనున్న యీప్రత్యక్షము అర్వాచీనము అనర్వాచీనము అని రెండువిధములు. అందు అర్వాచీనము ఇంద్రియసాపేక్షము ఇంద్రియనిరపేక్షము అనిద్వివిధము. ఇంద్రియానపేక్ష ప్రత్యక్షము స్వయంసిద్ధము దివ్యము అని ద్వివిధము.

స్వయంసిద్ధమనఁగా యోగశక్తివలనఁ గలిగినది. భగవదనుగ్రహ జన్యము దివ్యమనంబడును. అనర్వాచీన ప్రత్యక్షము ఇంద్రియ నిర పేక్షము. అది నిత్యులకును ముక్తులకును ఈశ్వరునికిని గలజ్ఞానము. ఇది అనఁగా అనర్వాచీనము ఇంద్రియ సాపేక్షము కాదు కావున నీయింద్రియ జన్య ప్రత్యక్ష నిరూపణమున ననావశ్యకమే యయినను ప్రత్యక్ష జ్ఞాన ప్రసంగవశమున వివరింపఁబడెను.

ఇట్లు "సాక్షాత్కారి ప్రమాకరణము ప్రత్యక్షము" అను లక్షణము సిద్ధించెను.

ననుయథావస్థితవ్యవహారానుగుణం జ్ఞానం ప్రమేత్యుక్తం. ఏవం చస్మృతేరపియథావస్థితవ్యవహారానుగుణజ్ఞానత్వేన ప్రామాణ్యాత్ స్మృతేరపి ప్రామాణ్యేన పరిగణనా. త్రీణ్యేవప్రమాణానీతికథం ప్రతిపాద్యత ఇతిచేత్. ఉచ్యతే స్మృతేః ప్రామాణ్యాఙ్గీకారేపి సంస్కారసాపేక్షత్వాత్, తస్య ప్రత్యక్షమూలత్వాత్, మూలభూతప్రత్యక్షేన్తర్భావఇతి నపృథక్ప్రమాణత్వకల్పనం. అతస్త్రీణ్యేవేతి సమ్భవతి.

"యథావస్థిత వ్యవహారానుగుణ జ్ఞానము ప్రమయనికదా చెప్పఁబడెను. స్మృతియును యథావస్థిత వ్యవహారానుగుణ జ్ఞానమేయగును. సదృశదర్శనాదులవలన యథావస్థిత వ్యవహారానుగుణముగనే స్మృతి కలుగును. అట్లు ప్రమాణసిద్ధము అంతియకాక స్మృతియుఁ బ్రమాణము లలోఁ బరిగణితమయియున్నది. కావున మూఁడే ప్రమాణములనుట యెట్లుకుదురును"? అని శంకింపరాదు స్మృతికిఁ బ్రామాణ్యము నంగీక రించినను అది ప్రత్యక్షముననే యంతర్భవించును. అనఁగాఁ బృథ క్ప్రమాణముకాదు. స్మృతికి అనుభవజనిత సంస్కారము మూలము. కనుక స్మృతి ప్రత్యక్షమూలకమగును మూలభూతమగు ప్రత్యక్షము ననే అంతర్భవించును. కావున స్మృతి వేరొక ప్రమాణము కాఁజాలదు. కావునఁ బ్రమాణములు మూఁడే యనుట సిద్ధించెను.

స్మృతిర్నామపూర్వానుభవజన్య సంస్కారమాత్రజన్యంజ్ఞానం. సంస్కారోద్బోధశ్చ * సదృశాదృష్టచిన్తాద్యా ఇత్యుక్తప్రకారేణక్వచిత్సదృశ దర్శనాత్

భవతి. క్వచిదదృష్టాత్. క్వచిచ్చిన్తయా. సదృశో యథా – దేవదత్తయజ్ఞదత్తయోస్సదృశయోః దేవదత్తదర్శనే యజ్ఞదత్తస్మృతిః. ద్వితీయో యథా – యాదృచ్ఛిక కాలాన్తరానుభూత శ్రీరఙ్గాదిదివ్యదేశస్మృతిః. తృతీయస్తు శ్రీవేఙ్కటేశస్య చిన్తనీయదివ్యమఙ్గళవిగ్రహస్మృతిః. సమ్యగనుభూతస్య సర్వస్య స్మృతివిషయత్వనియమః. క్వచిత్కాలదైర్ఘ్యాద్వ్యాధ్యాదినా వా సంస్కారస్య ప్రమోషాత్స్మృత్యభావః.

పూర్వానుభవజన్య సంస్కారమాత్రజన్యజ్ఞానము స్మృతియగును. ఒక వస్తువును అనుభవించినపుడు ఒక సంస్కారము జనించును. దాని వలననే మఱియొక సమయమున ఆవస్తువు జ్ఞానవిషయమగును. అట్టి జ్ఞానమే స్మృతియనిభావము. అట్టి జ్ఞానమునకు ఉద్బుద్ధమగు నాసంస్కారమే హేతువు. ఆ సంస్కారము ఉద్బుద్ధమగుటకు సదృశవస్తువు అదృష్టము చింత మున్నగునవి కారణములు. అదియే "సదృశాదృష్ట చింతాద్యాః స్మృతిబీజస్య బోధకాః" అని చెప్పఁబడెను. ఇందలి ఆద్య శబ్దముచే సాహచర్యము గ్రాహ్యము. కావున దానిచేతనుగూడ స్మృతి కలుగును. సమానాకారముగల దేవదత్తయజ్ఞదత్తులలో నొకరిని జూచిన నింకొకరు స్మరింపఁబడుదురు. అట్టి స్మృతి సాదృశ్యమువలనఁగల్గెను. అప్రయత్నముగా నొక్కొక్క సమయమున నొక్కొకవస్తువు స్మృతి విషయమగును. అట్టిది యదృష్టజన్యస్మృతియగును. కాలాంతరమునం జూచిన శ్రీరంగాది దివ్యదేశ స్మరణము ఇట్టిదే. చింతింపఁగా శ్రీ వేంకటేశుని దివ్యమంగళవిగ్రహ స్మరణముకలుగుట చింతాజన్య స్మృతి యగును. సహచరితులగు రామలక్ష్మణులలో నొకరినిజూడగా రెండవ వారు తలంపునకువచ్చుట సాహచర్యజన్య స్మృతియగును. బాగుగాఁ బూర్వమనుభవింపఁబడిన సర్వపదార్థమును స్మృతివిషయ మగునని నియమము. చాలకాలము గడచుటవలననో వ్యాధ్యాదులచేతనో అనుభవ జనిత సంస్కారము పోయినచో స్మృతి కలుగదు

యథాస్మృతేః ప్రత్యక్షేన్తర్భావః – ఏవం సోయం దేవదత్త ఇతి ప్రత్యభిజ్ఞాయా అపి ప్రత్యక్షేన్తర్భావః.

"ఆ దేవదత్తుడే యితడు" అను జ్ఞానమును ప్రత్యభిజ్ఞ యందురు, ఇదియును స్మృతివలెనే ప్రత్యక్షముననే యంతర్భవించును. (ఇదియుఁ బ్రత్యక్షమూలకమే కదా)

అన్యస్మతే అభావస్య భావాన్తరరూపత్వాత్తస్యాపి ప్రత్యక్షేన్త ర్భావః. ఘటప్రాగభావోనామ మృదేవ. ఘటధ్వంసశ్చకపాలమేవ.

అనుపలబ్ధియుఁ బ్రమాణాంతరముకాదు అనుపలబ్ధి ప్రమాణము వలన అభావము గోచరించునని కొందఱిమతము. కాని యభావము భావాంతర రూపమే యని మనమంగీకరించుటచే నది భాసించుటకు అనుపలబ్ధిప్రమాణ మనావశ్యకము అభావము భావాంతరరూపమెట్లగు ననగా – ఘటమునందలి పటాభావము ఘటరూపమేకాని భిన్నముకాదు. అపుడు ఘటము ప్రత్యక్షమయినట్లు ఘటరూపమేయగు పటాభావమును బ్రత్యక్షమేయగును. అనఁగా ఘటజ్ఞానమువలెనే ఘటమునందలి పటాభావజ్ఞానమును ప్రత్యక్షమేయగును కాన ననుపలబ్ధిప్రమాణముకాఁజాలదు. పటమున ఘటాభావము ఘటమునఁబటాభావమును క్రమముగా పటఘటస్వరూపములే కావున నన్యోన్యాభావమునకై యనుపలబ్ధి యంగీకార్యముకాలేదుగదా! అట్లే అత్యంతాభావమును భావాంతరరూపమే. భూతలముననున్న ఘటాత్యంతాభావము భూతలస్వరూపమే. అట్లే ఘటప్రాగభావము మృత్తేయగును ఘటధ్వంసము కపాలరూపము. అనఁగా ప్రాగభావ ప్రధ్వంసాభావములు అవస్థాంతరస్థిత ద్రవ్యములే యని భావము. భూతలమున ఘటచాక్షుష ప్రత్యక్షము చక్షురింద్రియ జన్యమే యగునుగదా. చక్షురింద్రియ సన్నికర్షలేనపుడు కలుగదుగదా! అట్లే భూతలమున ఘటాభావజ్ఞానముకూడ చక్షురింద్రియ సన్నికర్షమువలననే కదా కలుగును. చక్షురింద్రియ సన్నికర్షములేనపుడు కలుగదు. కావున నభావజ్ఞానముకూడ ప్రత్యక్షమేయనుట యుక్తముగానున్నది.

ఇచట నొకశంక కలుగుచున్నది. ఏదన, "గజాభావముగల యొకప్రదేశమున గజాభావమున్నను కారణములేనందున ననుభవింపక చైత్రుఁడు వేఱొకచోటికిఁ బోయినపుడు మైత్రునిచే నచట గజమును

జూచితివా యని ప్రశ్నింపఁబడి యచట గజాభావమును నిశ్చయించును. అందులకై యనుపలబ్ధి నంగీకరింపవలయును. ఆ గజాభావనిశ్చయము ప్రత్యక్షమనుటకు వలనుపడదు. ఆప్రదేశములకపుడింద్రియసంనికర్షము లేదుగదా!" కాని యీశంక సరికాదు. ఆ గజాభావమనుమీయమాన మగును. "స్మర్తవ్యమయియు గజముకలదిగా నాప్రదేశమిపుడు స్మరింపఁబడలేదు. కావున నా ప్రదేశము గజముగలదిగా నాచే ననుభూతము కాలేదు" అను ననుమానముచే నదిసిద్ధించుచున్నది. అనఁగా స్మరణము లేదు కావున ననుభవములేదు. అనుభవములేదు కావున విషయములేదు. కావున నభావజ్ఞానమునకై యనుపలబ్ధిప్రమాణ మనావశ్యకము

ప్రాయశః పూరుషేణానేన భవితవ్యమిత్యేతదూహః. సంశయ ఉక్తః. తయోరపి ప్రత్యక్షేన్తర్భావః. పుణ్యపురుషనిష్ఠాప్రతిభాపి ప్రత్యక్షేన్తర్గతా. *యథార్థం సర్వవిజ్ఞానమితి వేదవిదాంమతమిత్యుక్తత్వాత్.

"బహుశః ఈతఁడు పురుషుఁడు కావలయును" అనునది యూహయనఁబడును. "ఇది ఏమి పేరుగల చెట్టయియుండును?" అను అనిశ్చయజ్ఞానము సంశయమగును. ఈరెండును బ్రత్యక్షాంతర్భూతములే. పుణ్యపురుషునియందుండు ప్రతిభయుఁ బ్రత్యక్షమే. ప్రతిభయనఁగా భూతభావివస్తుసాక్షాత్కారము. అన్ని జ్ఞానములును యథార్థములే యని వేదాంతవేత్తల మతము కావున నీ జ్ఞానములు ప్రత్యక్షాంతర్భూతములే యగును

భ్రమాదిప్రత్యక్షాదిజ్ఞానం యథార్థమేవ. అఖ్యాత్యాత్మఖ్యాత్యనిర్వచనీయఖ్యాత్యన్యథాఖ్యాతివాదినో నిరస్య సత్ఖ్యాతిపక్ష స్వీకారాత్.

మనము అఖ్యాతి ఆత్మఖ్యాతి అనిర్వచనీయఖ్యాతి అన్యధాఖ్యాతి అసత్ఖ్యాతి వాదులను నిరసించి సత్ఖ్యాతిపక్షమును స్వీకరించినారము కావున భ్రమాది ప్రత్యక్షజ్ఞానముగూడ యథార్థమేయగును.

అఖ్యాతియనఁగా శుక్తియందు రజత జ్ఞానము కల్గుటయను భ్రమస్థలమున "ఇది రజతము" అను జ్ఞానమున ఇదమంశము మాత్రమే

ప్రతీయమానమగును గాని రజతాంశమునకుఁ బ్రతీతియే లేదనుట ఖ్యాతి యనఁగాఁ బ్రతీతియని యర్థము. అఖ్యాతియనఁగాఁ బ్రతీతియే లేకుండుట "ఇది రజతము" అనుచోట రజతాంశమునకుఁ బ్రతీతియే లేదనుటను అఖ్యాతియందురు. ఇది మీమాంసకుల మతము.

ఆత్మఖ్యాతి యనఁగా బుద్ధియొక్క భానము. ఆత్మయనఁగా బుద్ధి. బుద్ధియే విషయరూపముగా భాసించుటను ఆత్మఖ్యాతి యందురు "ఇది రజతము" అనుచోట బుద్ధియే రజతరూపమున భాసించుననియు రజత రూపవిషయాపేక్ష లేదనియు భావము. ఇది యోగాచారులనంబడు బౌద్ధుల మతము

అనిర్వచనీయ ఖ్యాతి యనఁగా శుక్తియందుఁగలుగు రజత భ్రాంతిలో విషయమగు రజతము సత్పదార్థమనికాని యసత్పదార్థమని కాని చెప్పుటకు వలనుపడక అనిర్వచనీయ మనఁబడును. అట్టి రజత ప్రతీతి అనిర్వచనీయఖ్యాతి యనఁబడును.. ఇది మాయావాదుల మతము.

అన్యథా ఖ్యాతియనఁగా ఒక వస్తువు ఇంకొక వస్తువురూపమున బాసించుట అనఁగా దేశాంతర కాలాంతరగత రజతమే శుక్తిరూప ముగా గ్రహింపఁబడుట. ఇది నైయాయిక మతము.

అసత్ఖ్యాతి యనఁగా అసత్తయిన రజతాదికముయొక్క భానము. శుక్తియందుకల్గు "ఇది రజతము" అను జ్ఞానమున అసత్తయిన రజతమే భాసించుటయని భావము. ఇది శూన్యవాదులయిన బౌద్ధులమతము. మేము ఈ అయిదు పక్షములను నిరసించి సత్ఖ్యాతిపక్షమును స్వీకరించి నారము.

సత్ఖ్యాతిర్నామజ్ఞానవిషయస్య సత్యత్వం. తర్హి భ్రమత్వం కథమితిచేత్. విషయ వ్యవహారబాధాద్భ్రమః. తదుపపాదయామః – పఞ్చీకరణ ప్రక్రియయా పృథివ్యాదిషు సర్వత్ర సర్వభూతానాం విద్యమానత్వాత్, తతఏవశుక్తికాయాం రజతాంశస్య విద్యమానత్వాత్, జ్ఞానవిషయస్య సత్యత్వం. తత్రరజతాంశస్య స్వల్పత్వాత్తద్వ్యవహార ఇతిజ్ఞానం భ్రమః. శుక్త్యంశభూయస్త్వజ్ఞానాద్భ్రమ నివృత్తిః.

సత్ఖ్యాతియనఁగా జ్ఞానవిషయమునకు సత్యత్వము. అనఁగా శుక్తి యందు రజతజ్ఞానము కల్గుచున్నదికదా! "ఇది రజతము" అను నీ భ్రమజ్ఞానమునందు విషయభూతమగు రజతము సత్యమేయని భావము. అట్లయినచో రజతశకలమునందుగల్గు "ఇది రజతము" అను ప్రమాత్మక జ్ఞానమునకును శుక్తియందుఁగల్గు "ఇది రజతము" అను భ్రమాత్మక జ్ఞానమునకును భేదమేలేకపోవలసివచ్చునని శంకింపరాదు. భ్రమయందు విషయమునకు వ్యవహారబాధకల్గును. వ్యవహారానుగుణము కానందున నిది భ్రమమయ్యెను. దూరమునుండి రజ్జువునుజూచి పాముఅని అనుకొని దగ్గరగాఁజూచి పాము కాదనియుఁ దాను భ్రాంతిజెందితిననియుఁ దెలిసి కొనును. ఇట్లు ఇది పాముకాదు రజ్జువు. అను వ్యవహారమే కల్గు చున్నది ఈ వ్యవహారమునకు అనుగుణము కానందున సర్పజ్ఞానము భ్రాంతిఅయ్యెను. అయినను సర్పాంశములు రజ్జువునందును నుండుటచే విషయము సత్యమేయగును. అయినను సర్పాంశములు రజ్జువునందల్ప ములగుటచే సర్పమను వ్యవహారముకలుగలేదు. అందుచే నది భ్రమ యయ్యెను. కాని పాము అనువిషయము అసత్యముకాదు. ఏవస్తువు నంశము లేవస్తువునందుండునో అదియే దానిపోలిక కలిగియుండును. కొన్నియంశములు లేనిచో దానికది సదృశమేకాదు కావున రజ్జువు నందును సర్పాంశములు కలవని యంగీకరింపవలయును. ఈవిషయము "తదేవ సదృశం యస్యయత్తద్ద్విత్యైకదేశకభాక్" అని చెప్పఁబడి యున్నది. పంచీకరణప్రక్రియచే నన్నిభూతములును ఇతర సర్వభూత ములతో నల్పపరిమాణముగాఁ గలసియున్నవి. కావుననే పార్థివమగు శుక్తితైజసమగు రజతముగా భాసించుటలో రజతము అసత్యముకాదు. విషయమగు రజతము సత్యమేయని సిద్ధాంతము.

స్వప్నాది జ్ఞానంతు సత్యమేవ — తత్తత్పురుషానుభావ్యతయాతత్తత్కా-లావసానాన్రథాదీన్ పరమపురుషస్సృజతీతిహిశ్రుత్యాఽవగమ్యతే.

స్వప్నాది జ్ఞానముకూడ సత్యమే "స్వప్నమందుఁగానవచ్చు పదార్థములు ఆవ్యక్తికే జాగ్రదవస్థయందుఁగానరావు. ఇతరులకెప్పుడును గానరావు. అట్టిది సత్యమనుట యెట్లుపొసఁగును" అని శంకింపరాదు.

స్వాప్నపదార్థములను ఆ వ్యక్తిమాత్రమే ఆకాలమునందు మాత్రమే అనుభవించుటకుఁదగినట్లు సర్వేశ్వరుఁడు సృజించును. సత్యసంకల్పుఁడు ఆశ్చర్యశక్తియుఁగాననట్టి పదార్థముల నాతఁడు సృజింపగలఁడు అట్లని శ్రుతియే చెప్పుచున్నది. "నతత్రరథాన రథయోగా నపన్థానోభవంతి అథరథాన్ రథయోగాన్ పథః సృజతే........సహికర్తా" ఇది శ్రుతి. రథములుకాని గుఱ్ఱములుకాని మార్గములుకాని లేకున్నను వానినన్నింటిని యాతఁడు సృజించును. అని యీ శ్రుత్యర్థము.

పీతశ్శంఖ ఇత్యాదౌ నయనవర్తి పిత్తద్రవ్యసంభిన్నానయన రశ్మయ శ్శంఖాదిభిస్సంయుజ్యన్తే — తత్రపిత్తగత పీతిమాభిభూతశ్శంఖగతః శుక్లిమా నగృహ్యతే — అతస్స్వర్ణానులిప్తశంఖవత్పీతశ్శంఖ ఇతి ప్రతీయతే. సూక్ష్మత్వా త్పీతిమాస్వనయన నిష్క్రాన్తతయా స్వేనైవగృహ్యతే.

"పీతశ్శంఖః" అనఁగా "శంఖము పచ్చగానున్నది" అను జ్ఞానముకూడ స త్య మే. ఇటఁ గన్నులయందలి పిత్తద్రవ్యముతో సంయుక్తములయిన నేత్రకిరణములు శంఖాదులతో సంయుక్తములగుట చేతఁ బిత్తద్రవ్యమునందలి పచ్చఁదనముచేఁ శంఖమునందలి తెలుపు తిరస్కృతమై కానరాదు. అందువలన బంగారుపూతపూసిన దానివలె శంఖము పచ్చగానున్నదను జ్ఞానము కలుగును. ఈ పచ్చదనము పిత్తోపహతునికేకాని యితరులకుఁ గానరాకుండుట యనుచితమే. ఏమన తన నయనములనుండి వెడలిన పచ్చఁదనము చాల స్వల్పమగుటచేఁ దన నయనములకు మాత్రమే గోచరించును గాని ఇతరులకుఁగానరాదు. దూరస్థశంఖమునందలి పిత్తద్రవ్యము పిత్తోపహత పురుషునికి మాత్ర మెట్లుకానవచ్చునని శంకింపరాదు. తన కంటినుండి వెడలిన పిత్తద్రవ్య మును దెలిసికొని అజ్ఞానమువలనఁగలిగిన సంస్కారము సహాయముగా నుండుటచే దూరముగానున్నను శంఖగతపిత్తద్రవ్యము తన నయన కిరణములచేఁ దెలిసికొనఁగలుగును. ఎట్లన—ఆకాశమున నతిదూరమున నున్నపక్షి అందఱకును గానరాకున్నను మొదటినుండియు అనగా దగ్గరగా నున్నప్పటినుండియు దూరముగాఁ బోవుచుండగాఁ జూచుచున్నవానికి మాత్రము కానవచ్చుచున్నట్లే శంఖగతపీతిమయుఁ గానవచ్చును.

జపాకుసుమసమీపవర్తి స్ఫటికమణిరపి రక్త ఇతి గృహ్యతే — తద్జ్ఞానం సత్యమేవ.

దాసనపూవునకు దగ్గరగానున్న స్ఫటికమణియు నెఱ్ఱగాఁ గాన్పించును. అదియు సత్యమే. స్ఫటికాది స్వచ్ఛద్రవ్యములతోఁ గూడిన జపాకుసుమప్రభ స్ఫుటతరముగాఁ గానవచ్చును. స్వచ్ఛద్రవ్యముకాని ఘటాదులయందు జపాకుసుమప్రభ పడినను గోచరింపదు.

మరీచికాయాం జలజ్ఞానమపి పఞ్చీకరణ ప్రక్రియయా పూర్వోక్తవదుపపద్యతే. పఞ్చీకరణ ప్రక్రియాత్వగ్రే ప్రపఞ్చ్యతే.

మరీచిక (ఎండమావులు) యందు "నీరు" అను బుద్ధియు పంచీకరణ ప్రక్రియచే సత్యమే తేజః పృథివీ పదార్థమగు మరీచికయందు జలద్రవ్యముగూడ పంచీకరణ ప్రక్రియచేనుండుట సత్యమేయగును. ఇంద్రియ దోషముచేఁ దేజః పృథివీ పదార్థములు గ్రహింపఁబడక అదృష్టవశమున జలద్రవ్యము మాత్రము గృహీతమగుచున్నది. అదృష్టము నొకదాని నంగీకరింపవలసియుండుట దోషముకాదు అయథార్థజ్ఞానము నంగీకరించినవారు కూడ అన్నిచోట్లను భ్రమము కలుగదు కావునఁ గొన్నిచోట్ల మాత్రమే కలుగుననుటకు అదృష్టము నంగీకరింపక తప్పదుగదా! పంచీకరణ ప్రక్రియ మున్ముందు వివరింపఁబడును. (అదృష్టము జ్ఞానరూపము)

దిగ్భ్రమోఽపి తథైవ — దిగ్దిగన్తరస్యావిద్యమానత్వాత్ అవచ్ఛేదకమన్తరేణ దిగితి ద్రవ్యాన్తరానఙ్గీకారాత్.

దిగ్భ్రమయు సత్యమే. ఒకదిక్కున నితరదిగంశములునుగలవుగాన ఒకదిక్కున నొకదిక్కు కానవచ్చుటయు సత్యమేగదా! యథార్థముగా దిక్కు అనునది ఒక్కటియే. దిగ్భేదము ఔపాధికము ఒక గ్రామము దానికిఁ దూర్పుననున్నవారికి పశ్చిమమనియు దానికిఁ బశ్చిమముగానున్నవారికిఁ దూర్పు అనియు వ్యవహరింపఁ బడుచున్నదికదా! అంతియకాక "దిక్కు" అను నొకపదార్థమునే యంగీకరింపరు. ఆవిషయము నాల్గవ యవతారమున వివరింపఁబడును.

అలాతచక్రాదౌతు శైఘ్ర్యాత్తత్తద్దేశ సంయుక్తతద్వస్తుగ్రహణమేవ-తదపి సత్యం.

కొరవి నొకదాని నతిశీఘ్రముగా గిరగిర త్రిప్పినచో నది చక్రాకారముగాఁ గాన్పించును. యదార్ధముగానందుఁ బ్రతిక్షణమునను నొక్కప్రదేశముననే యాకొరవియుండును గాని చక్రాకారముగా లేదుగదా! ఆ ప్రతీతియెట్టిది? అనఁగా నాకొరవి తిరుగుటలో నతివేగమువలన భ్రమణములకు మధ్యభాగము కానరాక యా యా ప్రదేశముననున్న యాయా వస్తువే చక్రాకారముగాఁ గాన్పించును. అంతరాలము కానరాకయే వర్తులాకారము ప్రతీతమగును. యధార్ధమగు చక్రమునందు నయినను అంతరాలము కానరాకుండుటయే చక్రాకార ప్రతీతికి మూలముకదా!

దర్పణాదిషు నిజముఖప్రతీతిరపి యథార్థా – దర్పణాదిప్రతిహతగతయో నాయనరశ్మయో దర్పణాదిగ్రహణపూర్వకం నిజముఖాదిగృహ్ణన్తీతి. తత్రాప్యతి శైఘ్ర్యాదన్తరాళాగ్రహణాత్తథా ప్రతీతిః.

అద్దము మున్నగు వానియందుఁ దనముఖము కానవచ్చుటయు యదార్ధమే. తన ముఖము తన కభిముఖముగా లేదుకదా! అట్లు కానవచ్చుట సత్యమెట్లగును అని శంకింపరాదు. నయన కిరణములు ఎదురుగానున్న దర్పణముచే నడ్డగింపఁబడి దర్పణాదులను ముందుగా గ్రహించి పిమ్మట స్వముఖాదులను గ్రహించును. అచటనుగూడ దర్పణ ముఖముల యంతరాలము కానరాకపోవుట నయనదర్శి గమనవేగము చేతనేయని గ్రహింపనగును.

ద్విచన్ద్రజ్ఞానాదావప్యఙ్గుళ్యవష్టమ్భతిమిరాదిభిర్నాయన తేజోగతిభేదేన సామగ్రీభేదాత్ సామగ్రీ ద్వయమన్యోన్య నిరపేక్షం ద్విచన్ద్రగ్రహణహేతుర్భవతి – సామగ్రీద్వయం పారమార్థికం – తేనద్విచన్ద్రజ్ఞానం భవతి.

కంటికి వ్రేలు అడ్డముగాఁ బెట్టినందువలనను తిమిరాది నేత్రరోగములవలనను ఒక చంద్రుఁడిద్దరుచంద్రులవలెఁ గానవచ్చును. అది

యెట్టిదనఁగా - వేళ్లు, తిమిరము మున్నగువానివలన నేత్రతేజస్సునకు గమనభేదము కలుగును. "నయనతేజోగతి భేదము" అను సామగ్రి భేదమువలన నారెండు విధములగు నయనతేజస్సులును అన్యోన్యనిర పేక్షముగా చంద్రద్వయజ్ఞానము కల్గించును. అచట సామగ్రిద్వయము యదార్థము కావున చంద్రద్వయజ్ఞానము కలుగును.

అతస్సర్వం విజ్ఞానం సత్యం సవిశేషవిషయం - నిర్విశేషవస్తునోఽగ్రహణాత్.

కావున సర్వజ్ఞానమును సత్యమే అది సవిశేషవిషయకము కూడను. నిర్విశేషవస్తువు జ్ఞానగోచరమేకాదు. ఇట్టి ప్రత్యక్షము ముందుగా భేదవిశిష్టమగుదానినే గ్రహించును. నిర్విశేషమగు వస్తువునకు రూపాదులుండవు కావున ఉభయవిధ ప్రత్యక్షమునుగూడ రూపాది విశేషరహిత వస్తువును గ్రహింపలేదు.

ఏవముభయవిధం ప్రత్యక్షం ప్రథమతో భేదమేవ గృహ్ణాతి. భేద ఇతి వ్యవహారేతు ప్రతియోగ్యపేక్షా - న తు స్వరూపేణేతి - తేనానవస్థాఽన్యోన్యాశ్రయదోషావపినాస్తి. ఉభయస్యాప్యపేక్షాఽనవస్థా. పరస్పరాపేక్షాఽన్యోన్యాశ్రయః.

జాతి యనఁగా వస్తుసంస్థానమే కాని వేరొకవస్తువు కాదని నిర్ణయింపఁబడినది అట్టి సంస్థానరూప జాతియే భేదము సంస్థానము-జాతి - భేదము అనునవి అభిన్నములు. సంస్థానముతోఁగూడిన వస్తువే జ్ఞానవిషయమగును గావున భేదవిశిష్టమునే ప్రత్యక్షముగ గ్రహించును

ఇట్లు జాతియే భేదమని యంగీకరింపక జాతికంటె భిన్నమయిన యన్యోన్యాభావరూపమగు నొకపదార్థమని యంగీకరించినచో భేదస్వరూపమును గ్రహించుటకు ("ఘటము పటముకంటె భిన్నము" అని) ప్రతియోగియగు పటాదికము అపేక్షితమగును అంతియకాక ఘటమునందుఁ గల భేదము ఘటముకంటె భిన్నమా లేక ఘటస్వరూపమా యను

ప్రశ్నమునందు సమాధానము దుర్లభము. భేదము ఘటస్వరూపమే యన్నచో ఘటము గ్రహింపఁబడగనే "ఘటము" అను వ్యవహారము వలెనే "అన్నింటికంటె ఘటము భిన్నము" అను వ్యవహారముకూడ రావలసియుండును. భేదము ఘటస్వరూపమే యనుటవలన భేదవ్యవహారమునకుఁ బ్రతియోగ్యపేక్ష కలదనుటకు వలనుపడదు. అంతియకాక భేదము ఘటస్వరూపమేయనుటవలన "ఘటము - భిన్నము" అను పదములు "హస్తము - కరము" అను పదములవలెనె పర్యాయపదములు కావలసివచ్చును. ఈచిక్కులవలన భేదము ఘటస్వరూపమనుటకు వలనుపడదు. భేదము ఘటముకంటె భిన్నమనినచో మొదటి భేదమునందు ఘటప్రతియోగికద్వితీయ భేదమును గల్పింపవలయును. ఈ ద్వితీయ భేదమునందు ప్రథమభేద ప్రతియోగిక తృతీయ భేదమును గల్పింపవలయును. ఇట్లనంతభేద కల్పనమువలన ననవస్థాదోషము పట్టును. అంతియకాక జాత్యాదిధర్మవిశిష్ట వస్తుగ్రహణము కల్గినంగాని భేదము గ్రాహ్యముకాదు. భేదము గృహీతముకానిదే జాత్యాది ధర్మవిశిష్టవస్తువు గ్రాహ్యముకాదు. ఇట్లన్యోన్యాశ్రయ దోషమునుబట్టును (ఘటమందు పటభేదము గ్రహింపఁబడనపుడు ఇది ఘటజాతీయము అని తెలియుటకే శక్యముకాదుగదా.)

కావున భేదము జాతికంటె భిన్నమనక జాతియే భేదమని యంగీకరించుట యుచితము. అపుడు "భేదవిశిష్టమునకే ప్రత్యక్షము" అని సిద్ధించును. జాతియే భేదమన్నచో భేదమునకుఁ బ్రతియోగ్యపేక్ష లేకపోవలసివచ్చుననిన నది దోషముకాదు. ప్రతి యోగ్యపేక్షలేకయే భేదము ఘటాదులయందు భాసించును. అది యిష్టమే. ఈ ఘటాది పదార్థమునకు "భిన్నము" అను వ్యవహారమునందుమాత్రము "పటముకంటె భిన్నము - మఠముకంటె భిన్నము" ఇత్యాదిగా పటమఠాది ప్రతియోగ్యపేక్షయుండును. కేవల స్వరూపబావమునందుఁ బ్రతియోగ్యపేక్షయుండదు. అందువలన ననవస్థాన్యోన్యాశ్రయ దోషములుండవు. "మున్ముందు దాని యపేక్ష వెన్వెనుక దానికి అవశ్యకమగుట" యనవస్థ యనఁబడును. అనగా నెన్నింటిని గల్పించినను జాలక యనంతమగు వానిని గల్పించుచుండవలసిన యవసరమగుట యనవస్థయని భావము.

**"రెండు వస్తువులలో నొకదాని యపేక్ష యింకొకదానికి ఉండుటను" అన్యోన్యాశ్రయమని యందురు.**

ననుదశమస్త్వమసీత్యత్రాపి ప్రత్యక్షం కింనస్యాదితిచేన్న-త్వమిత్యేతస్యప్రత్యక్షత్వేపిదశమోసీత్యేతస్యవాక్యజన్యత్వాత్. యది దశమోసీత్యేతస్య ప్రత్యక్ష విషయత్వం-తర్హి ధర్మవాంస్త్వమిత్యేతస్యాపి ప్రత్యక్షత్వంస్యాత్. అఙ్గీకారేఽతి ప్రసఙ్గాత్. అత ఏవ * తత్త్వమసీతి వాక్యస్యాపరోక్షజ్ఞానజనకత్వం. ఏతేన ప్రత్యక్ష ప్రమాకరణం ప్రత్యక్ష ప్రమాణం. ప్రమాచాత్ర చైతన్యమేవ. చైతన్యంచ త్రివిధం — అన్తఃకరణావచ్ఛిన్న చైతన్యం వృత్త్యవచ్ఛిన్నచైతన్యం విషయావచ్ఛిన్న చైతన్యంచేతి. యదా త్రయాణామైక్యం — తదాసాక్షాత్కారః. తదపి నిర్విశేష విషయమేవ. అభేదమేవ గృహ్ణాతీత్యాదికుదృష్టికల్పనానిరస్తా.

**"దశమస్త్వమసి" అను వాక్యార్థముకూడ ప్రత్యక్షముకాదా యని శంకింపరాదు. ఈ వాక్యములలోని "త్వమ్" అను దాని యర్థము ప్రత్యక్షమే యయినను "దశమోసి" అను పదముల యర్థజ్ఞానము వాక్యజన్యమేయగును. "దశమోసి" అను వాక్యార్థజ్ఞానము ప్రత్యక్షమే యన్నచో "ధర్మవాంస్త్వమసి" అను వాక్యార్థజ్ఞానముకూడ ప్రత్యక్షమనవలసివచ్చును. అది యంగీకార్యము కాదుకదా. కావుననే "తత్త్వమసి" అను వాక్యముగూడ అపరోక్షజ్ఞానమును గల్గింపదు**

**ఇట్లు చెప్పుటవలన "ప్రత్యక్షప్రమాకరణము ప్రత్యక్షప్రమాణము ప్రమయునాత్మచైతన్యమే. చైతన్యము, అంతఃకరణావచ్ఛిన్నచైతన్యము, అంతఃకరణ వృత్త్యవచ్ఛిన్న చైతన్యము, విషయావచ్ఛిన్న చైతన్యము, అని మువ్విధములు. ఎప్పుడీ మూడింటికిని ఐక్యముకలుగునో అపుడు సాక్షాత్కారమగును. అదియు నిర్విశేష విషయకమే. అభేదమునే గ్రహించును." ఇత్యాదికమగు కుదృష్టికల్పనము నిరస్తమయినట్లే యగును.**

**(అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమును ప్రమాతృచైతన్యమనియు, అంతఃకరణ వృత్త్యవచ్ఛిన్న చైతన్యమును ప్రమాణ చైతన్యమనియు,**

విషయావచ్ఛిన్నచైతన్యమును విషయచైతన్యమనియు వ్యవహరింతురు తటాకోదకము కాలువద్వారా వెడల కేదారమునఁబడి కేదారాకారముగాఁ బరిణమించినట్లే అంతఃకరణము ఇంద్రియముల ద్వారమున ఘటాది విషయదేశమునుబొంది ఘటాద్యాకారముగాఁ బరిణమించును. అట్టి పరిణామమునే వృత్తియందురు. ఘటాదివిషయావచ్ఛిన్నచైతన్యమును ఘటాద్యాకారముగాఁ బరిణమించిన యంతఃకరణవృత్త్యవచ్ఛిన్నచైతన్యమును ఒక ప్రదేశమునఁ గలసియుండుటచే నారెండు చైతన్యములును ఒక్కటియేయగును. అవిరెండును ఏకప్రదేశమున నుండుటచే నభిన్నములు. అయంఘటః = ఇది ఘటము ఇత్యాది ప్రత్యక్షస్థలమున ఘటాకారవృత్తి ఘటసంయోగి కావున ఘటావచ్ఛిన్నచైతన్య వృత్త్యవచ్ఛిన్న చైతన్యములు అభిన్నములగుటచే ఘటప్రత్యక్షముకల్గెను - అని మాయావాదుల మతము )

నిర్వికల్పకం నామజాత్యాదియోజనాహీనం వస్తుమాత్రావగాహి కించిదిదమితిజ్ఞానమితి నైయాయికానాం మతమపి.

"పేరు జాతి మున్నగువాని సంబంధములేని కేవల వస్తుగ్రాహి జ్ఞానము నిర్వికల్పకము" అను నైయాయికమతము నిరస్తమయ్యెను. నిర్వికల్పకమును సవిశేషవిషయకమేయనియు సవికల్పకమున నిర్వికల్పకమునందను భూతమగు విశేషమునకు అనువృత్తిజ్ఞానము మాత్రము అధికమనియు నిర్విశేషమునకు గ్రహణమే యసంభావ్యమనియు నిరూపింపఁబడియే యున్నదిగదా। గుణసంస్థానాది విశిష్ట ప్రథమపిండ గ్రహణమే నిర్వికల్పక మనఁబడునుగదా।

నను కాణాదం పాణినీయంచ సర్వశాస్త్రోపకారకమిత్యుక్తత్వాత్ కథం గౌతమమతనిరాస ఇతిచేత్. ఉచ్యతే — నకార్త్స్న్యేనాన్యమతనిరాసః క్రియతే — యావదిహాయుక్తియుక్తం — తావత్స్వీక్రియతే — పరికల్పిత తటాకోపజీవనవత్. నఖలు తటాకస్థపఙ్కోఽపిస్వీక్రియతే. అతఃపరమాణుకారణత్వం, వేదపౌరుషేయత్వం, ఈశ్వరానుమానికత్వం, జీవవిభుత్వం, సామాన్య విశేష సమవాయానాం పదార్థత్వేనస్వీకారః. ఉపమానాదేఃప్రమాణత్వకల్పనం,

సఙ్ఖ్యాపరిమాణపృథ_క్త్వ పరత్వా పరత్వ గురుత్వ ద్రవత్వాదీనాం పృథగ్గుణత్వ కల్పనం, దిశోపిద్రవ్యత్వకల్పన, మిత్యాది సూత్రకారాది విరుద్ధప్రక్రియా నాస్మాభిస్స్వీక్రియతే - అవిరుద్ధానిస్వీక్రియన్తే ఇతినవిరోధః.

" కాణాదం పాణినీయంచ సర్వశాస్త్రోపకారకమ్ " అని చెప్పఁబడి యుండఁగా సర్వశాస్త్రోపకారకమగు గౌతమముని మతమును మాత్రము నిరసించుట యెట్లనిశంకింపరాదు. మేము సంపూర్ణముగా వారిమతమును నిరసింపలేదు. దానియందెంతవరకు యుక్తియుక్తమో అంతవరకును గ్రహింతుము. ఇతరమును త్యజింతుము పరకల్పిత తటాకమునందలి జలమును బరిగ్రహింతుముకాని యందలి పంకమునుగూడ గ్రహింపము కదా ! అందువలన జగత్తునకుఁ బరమాణుకారణత్వము, వేదము పురుష నిర్మితమనుట, ఈశ్వరుఁడు అనుమాన ప్రమాణసిద్ధుఁడనుట జీవుఁడు విభు పదార్థమనుట సామాన్యము, సమవాయము, విశేషము, అనువానిని బ్రత్యేకపదార్థములని గ్రహించుట, ఉపమానాదులు వేరుగాఁ బ్రమాణము లనుట, సంఖ్య, పరిమాణము, పృధ_క్త్వము, పరత్వాపరత్వములు, గురుత్వము, ద్రవత్వము, మున్నగువానికి వేరుగా గుణత్వాంగీకారము, దిక్కును ద్రవ్యమనుట మున్నగు సూత్రకార విరుద్ధ ప్రక్రియను మేమంగీకరింపము. కావున నిది విరుద్ధముకాదు.

వేదవాక్యము పౌరుషేయమనియును మానప్రమాణముచే గొందఱు సాధింపఁబూనుదురు. అది యిట్లు - "వేదవాక్యముకావున, అస్మదాదుల వాక్యమువలెనే" - అని యనుమానమును వారు చూపుదురు. కాని యీయనుమానము సరికాదు. ఈ హేతువున కనుగ్రాహకమగు ననుకూల తర్కములేదు. అనఁగా వాక్యత్వమున్నను సక_ర్తృకత్వము లేకపోవచ్చునను. శంకకు సకర్తృకము కానిచో వాక్యమేకాదు అనురీతి ననుకూలతర్కము లేదు. అనఁగా వాక్యమయినంత మాత్రమున సక_ర్తృకము కావలయునను నియమములేదని భావము. కావున నీహేతువుచే ననుమానము సిద్ధింపదు. ''వాచా విరూపనిత్యయా'' అను శ్రుతి విరోధమునుబట్టి యీ హేతువు కాలాత్యయాపదిష్టమును అగు చున్నది. కావున వేదము పౌరుషేయముకాదు. కర్తయెవ్వరో తెలియఁ

బడకపోవుటచేతఁగూడ వేదము అపౌరుషేయమగును. "జీర్ణకూపాదుల కర్త తెలియబడనంతమాత్రమున నవి యకర్తృకములనరాదుగదా అట్లే వేదముల విషయమునను కర్త తెలియబడనంత మాత్రముననఁగర్త లేదనుట సరికాద"ని శంకింపరాదు. ఉపదేశపారంపర్యముచేఁ గర్త తెలియఁబడ వలసియుండఁగాఁ దెలియఁబడలేదు కావున వేదము అపౌరుషేయమే యగును. పరమర్షులు వేదమ పౌరుషేయమని చెప్పుచుండుటయు దీనికి సమర్థకము. "సర్వవేదములను భగవంతుఁడే సృజించియుండగా మన్వాదులు దానివి గప్పిపుచ్చిర"నుట యయుక్తము. మహాత్ములును సత్యనిష్ఠులును అగు ఋషులు భగవంతునింగూడ నపలాపముచేయుదు రనుట సంభవింపదు. కావున వేదములు అపౌరుషేయములని సిద్ధించెను.

ఈశ్వరుఁడు శబ్దప్రమాణవేద్యుండని స్థాపింపఁబడుటచే ననుమాన వేద్యుఁడనుట యంగీకరింపము. మిగిలిన జీవవిభుత్వము జీవప్రకరణ మున ఖండింపఁబడుచు.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం ప్రత్యక్షనిరూపణంనామ ప్రథమోఽవతారః.

ఇది ప్రత్యక్షనిరూపణ మనఁబడు ప్రథమావతారము.



## ద్వితీయోఽవతారః

అథానుమానం నిరూప్యతే - వ్యాప్యస్యవ్యాప్యత్వానుసన్ధానాత్ వ్యాపకవిశేషప్రమితిరనుమితిః. తత్కరణమనుమానం. వ్యాప్యస్య - ధూమస్య అగ్నివ్యాప్యత్వానుసన్ధానాద్వ్యాపక విశేషప్రమితిః - వహ్ని ప్రమితిః. అనధికదేశకాలనియతం వ్యాప్యం. అన్యూనదేశకాలవృత్తివ్యాపకం. తదేవమవినాభూతం వ్యాప్యం - తత్ప్రతిసమ్బన్ధి వ్యాపకమితితేన నిరుపాధికతయానియత సమ్బన్ధో వ్యాప్తిరిత్యుక్తంభవతి. సేయం యత్రధూమస్తత్రవహ్నిరితి వ్యాప్తిర్భూయోదర్శనేన గృహ్యతే.

ఇంక ననుమానప్రమాణము నిరూపింపఁబడుచున్నది. వ్యాప్యమగు వస్తువునకు వ్యాప్యత్వముగలదని తెలిసికొనుట వలన వ్యాప్యక విశేషమును దెలిసికొనుట యనుమితియగును, అట్టి యనుమితికి కరణమగునది యనుమానమగును. ధూమమునకు వహ్నివ్యాప్యత్వము గలదని తెలిసికొనుటవలన వ్యాపకమగు వహ్నిని ఊహించుట యనుమితి యగుననిభావము. అనధికదేశకాలములందు నియమితముగానుండునది వ్యాప్యమనియు అన్యూనదేశకాలములయందుండునది వ్యాపకమనియు గ్రాహ్యము. వ్యాపకముతో అవినాభూతమగునది అనఁగా వ్యాపకమును విడచియుండనిది వ్యాప్యమనియు దానికిఁ బ్రతిసంబంధియగునది వ్యాపకమనియు తేలినది.

(ఒక హేతువుచే నొకసాధ్యము నూహించుట అనుమితియగును. అందు హేతువు వ్యాప్యము సాధ్యము వ్యాపకమును అగును. ధూమముచే నగ్నినూహించుట దీనికుదాహరణము గదా. ఇందు ధూమము హేతువు. అది వ్యాప్యము. వహ్ని సాధ్యము. అది వ్యాపకము. సాధ్యము ఉన్నచోట్లకంటె నధికదేశమున నుండక సాధ్యము ఉన్నచోట్ల మాత్రమే యుండునది వ్యాప్యమగును. ధూమమను హేతువు సాధ్యమగు నగ్నియున్నచోట్లనేయుండును. అగ్నిలేని చోట యుండదు. కావ నది వ్యాప్యమగుచున్నది. సాధ్యమగు వహ్ని

హేతువగు ధూమము ఉన్నచోట్ల తప్పక ఉండును. అంతియకాక ధూమములేని అయోగోలకమునందును ఉండును. కాన నగ్నివ్యాపక మగుచున్నది. కావున నధికదేశవృత్తి వ్యాపకమనియు నల్పదేశవృత్తి వ్యాప్యమనియుఁజెప్పఁబడును. కనుకనే ధూమమున్నచో నగ్నియుండు నని యూహింపఁబడుచున్నది.)

నిరుపాధికముగానున్న నియతసంబంధము వ్యాప్తియగును. "ఎచట ధూమమున్నచో నచట వహ్నిగలదు." అనురీతిగల యీవ్యాప్తి లోకమునఁదఱచుగాఁ జూచుటవలనఁ దెలియఁబడుచున్నది. అగ్నిధూమ ములను పలుసార్లుచూచుటవలన "అగ్నియున్నచోటనే ధూమముండును. అగ్నిలేనిచోట ధూమముండదు. కావున ధూమమున్నచో నగ్ని యుండును" అని వ్యాప్తి తెలియును.

వ్యాప్తిర్ద్వివిధా – అన్వయ వ్యతిరేక భేదాత్. సాధనవిధౌ సాధ్యవిధి రూపేణ ప్రవృత్తావ్యాప్తిరన్వయవ్యాప్తిః – యథాయోయోధూమవాన్–సనోఽగ్ని మానితి. సాధ్యనిషేధే సాధననిషేధరూపేణ ప్రవృత్తావ్యతిరేక వ్యాప్తిః – యథాయోఽనగ్నిః – సనిర్ధూమఇతి.

ఈవ్యాప్తి అన్వయవ్యాప్తియనియు వ్యతిరేక వ్యాప్తియనియు, రెండు విధములు. సాధనస్థితివలన సాధ్యస్థితిరూపమయిన వ్యాప్తి యన్వయవ్యాప్తియగును. "ఏదేది ధూమముకలదియో నదియెల్ల నగ్ని కలది" అనురీతి నదియుండును. సాధ్యనిషేధము కలుగగా సాధన నిషేధరూపమగు "ఏదియగ్నిలేనిదో నదియెల్ల పొగలేనిది" అనురీతి గలది వ్యతిరేకవ్యాప్తియగును (ఇట "ధూమములేనిదియెల్ల నగ్ని లేనిది" అనురీతిగలది వ్యతిరేకవ్యాప్తియని భ్రమపడరాదు)

సేయముభయవిధావ్యాప్తిరుపాధిసమ్భవేదుష్టా. సాధ్యవ్యాపకత్వేసతి సాధనావ్యాపక ఉపాధిః. యథావహ్నినాధూమే సాధ్యమానేఆర్ద్రేన్ధన సంయోగ ఉపాధిః. మైత్రీతనయత్వేనశ్యామత్వే సాధ్యమానేశాకపాకజత్వముపాధిః.

ఈరెండు విధములగు వ్యాప్తియు "నుపాధి" గలదగుచో దోషయుక్తమగును. అనఁగా నట్టివ్యాప్తి సరియయినదికాదనియు దాని వలన సరియగు ననుమితి కలుగదనియు తెలియనగును. సాధ్యవ్యాపక మయి సాధనావ్యాపకమగునది యుపాధియగును "ఇది యగ్నికలది కావున ధూమముకలదగును" అను ననుమితియందు ఆర్ద్రేంధన సంయోగము ఉపాధియగును. ఎచ్చటనెచ్చట ధూమముండునో యచ్చటనచ్చట నెల్ల నార్ద్రేంధన సంయోగముండును. కావున నిది సాధ్యవ్యాపక మయ్యెను. సాధనమగునగ్ని యున్న చోట్లనెల్ల నార్ద్రేంధన సంయోగము ఉండదు. అనఁగా నయోగోళకమునందు అగ్నియున్నను ఆర్ద్రేంధన సంయోగములేదు కదా, కావున నార్ద్రేంధన సంయోగమునకు సాధనా వ్యాపకత్వమును గలదు. కావున (ధూమవాన్-వహ్నేః) "వహ్ని యున్నదికావున ధూమముగలది" అను ననుమానమున నార్ద్రేంధన సంయోగము ఉపాధియగుచున్నది. కావున నీహేతువు ఉపాధిదుష్ట మయ్యెను. ఇట్లే "వీఁడు మైత్రీతనయుఁడు కావున నల్లనివాఁడు" అను ననుమానమున శాకపాకజత్వ ముపాధియగును. శ్యామత్వమునకు శాక పాకజత్వము వ్యాపకమేయగుచు మైత్రీతనయత్వమునకు అవ్యాపకమగు చున్నందున నిది యుపాధియయ్యెను

సచోపాధిర్ద్వివిధః - నిశ్చితశ్శఙ్కితశ్చేతి. నిశ్చితోయథా—విప్రతిపన్నా సేవాదుఃఖహేతుః - సేవాత్వాత్ - రాజసేవావదిత్యత్రపాపారబ్ధత్వముపాధిః— అయంచేశ్వర సేవాయాంనాస్తీతి నిశ్చయాత్. శఙ్కితోయథా - విప్రతిపన్నో జీవః ఏతచ్ఛరీరావసానేముక్తిమాన్ - నిష్పన్నసమాధిత్వాత్—శుకాదివదిత్యత్ర కర్మాత్యన్తపరిక్షయః - సచనిష్పన్నసమాధౌ విప్రతిపన్నేజీవే అస్తినాస్తీతి సన్దిగ్ధత్వాచ్ఛఙ్కితోపాధిః. అతోనిరుపాధిక సమ్బన్ధవద్వ్యాప్యమితిసిద్ధం.

నిశ్చితము, శంకితము, అని ఆయుపాధి రెండు విధములు. ఉదా.... "సేవ దుఃఖహేతువు. సేవకావున. రాజసేవ వలె" అనుచోటఁ బాపారబ్ధత్వము ఉపాధియగును. పాపారబ్ధత్వము దుఃఖహేతుత్వమునకు వ్యాపకమగుచు సేవకు అవ్యాపకమయినది కావున నుపాధియయ్యెను. ఈపాపారబ్ధత్వము ఈశ్వరసేవయందు "లేదు" అను నిశ్చయముకలది

కావున విశ్చితోపాధియగును. "జీవుఁడీ శరీరావసానమున ముక్తిఁ బొందును. నిష్పన్న సమాధి కావున. శుభాదులవలె." అను స్థలమున కర్మాత్యంత పరిక్షయము ఉపాధియగును. నిష్పన్న సమాధియగు జీవుని యందుఁగర్మాత్యంత పరిక్షయము ఉన్నదో లేదో నిశ్చయములేదు కావున నిది శంకితోపాధియగును. కావున నిరుపాధిక సంబంధవత్తు వ్యాప్య మగునని సిద్ధించెను.

వ్యాప్యం – సాధనం – లిఙ్గమిత్యనర్థాన్తరం. తస్యద్వే రూపే అను మిత్యఙ్గభూతే – వ్యాప్తిః పక్షధర్మతాచేతి. పఞ్చరూపాణ్యపిసన్తి – తానిచపక్ష ధర్మత్వం, సపక్షేస త్త్వం, విపక్షాద్వ్యావృత్తిః, అబాధితవిషయత్వం, అసత్ప్రతి పక్షత్వం, చేతి. సిషాధయిషితధర్మ విశిష్టో ధర్మీపక్షః. యథాఽగ్నిమత్త్వాది సాధనేపర్వతాదిః. సిషాధయిషితధర్మసజాతీయవాన్ సపక్షః – యథామహాన సాదిః. సాధ్యతజ్జాతీయశూన్యో విపక్షః – యథామహాహ్రదాదిః. ప్రబల ప్రమాణేనపక్షేనిశ్చిత సాధ్యాభావవ త్త్వం బాధితవిషయత్వం – యథామహాహ్ర దోఽగ్నిమానిత్యాదిః. తదభావవ త్త్వమ బాధితవిషయత్వం. సమబలతయా ప్రతీయమాన ప్రమాణోపరోధాభావోఽ సత్ప్రతిపక్షత్వం.

వ్యాప్యము సాధనమగును లింగమన్నను సాధనమే. లింగ సాధనశబ్దములు పర్యాయపదములని భావము. అట్టి సాధనమునకు అనుమిత్యంగభూతములయిన వ్యాప్తి, పక్షధర్మత, యను రెండు రూపములుగలవు. (1) పక్షమునందుండుట (2) సపక్షమునందుండుట (3) విపక్షములేకుండుట (4) అబాధితవిషయత్వము (5) అసత్ప్రతి పక్షత్వము అను నయిదు రూపములును గలవు. సాధింపఁదలంచిన ధర్మముతోఁగూడిన ధర్మిపక్షమనఁబడును. సాధింపఁదలంచిన ధర్మ మనఁగా "పర్వతో వహ్నిమాన్" ఇత్యాదులందు వహ్న్యాదికము. దానితో గూడిన ధర్మియనఁగా పర్వతాదికము. అది పక్షమనంబడును. పర్వతమునందు వహ్నిని సాధింపఁదలచినపుడు పక్షము పర్వతము అట్టి వహ్ని ప్రసిద్ధముగాగల మహానసాదికము సపక్షము అగును. "సిసాధ యిషిత సజాతీయధర్మవాన్ సపక్షః" అనఁగా సాధింపఁదలంచిన వహ్నికి సజాతీయమగు వహ్నిగల మహానసాదికము సపక్షము.

సాధ్యముగాని దాని సజాతీయముగాని లేనిది విపక్షము. వహ్నియను సాధ్యములేని హ్రదము విపక్షమగును. ప్రబలమగు ప్రమాణముచే పక్షమునందు నిశ్చయముగా సాధ్యములేకుండుట బాధితవిషయత్వము. హ్రదమువందగ్నిని సాధింపఁదలంచునపుడు అందగ్నిలేకుండుట ప్రబల మగు ప్రత్యక్ష ప్రమాణసిద్ధము కావున నది బాధితవిషయత్వమగును. అట్టిది కాకుండుట అబాధితవిషయత్వ మగును సమబలములుగాఁగాన వచ్చు రెండు ప్రమాణములయొక్క ఉపరోధము లేకుండుట అసత్ప్రతి పక్షత్వము. వ్యాప్యము ఇట్టి పంచరూపములు గలదియు నగును.

ఏవం భూతం వ్యాప్యం ద్వివిధం - అన్వయ వ్యతిరేకి కేవలాన్వయి భేదాత్. పూర్వోక్త పఞ్చరూపోపపన్నం వ్యాప్యమన్వయ వ్యతిరేకి. యథా - పర్వతోఽగ్నిమాన్ - ధూమవత్త్వాత్ - యోయోధూమవాన్ససోగ్నిమాన్—యథా మహానసః - యోఽనగ్నిసనిర్ధూమః - యథాహ్రదఇతి.

ఈ వ్యాప్యము అన్వయ వ్యతిరేకియనియు కేవలాన్వయియనియు మరల రెండు విధములు. వెనుక చెప్పిన అయిదు రూపములుగల వ్యాప్యము "అన్వయవ్యతిరేకి" యగును. ఎట్లన (పర్వతోవహ్నిమాన్ ధూమాత్ యోయోధూమవాన్ ససోఽగ్నిమాన్ యథామహానసః యోనగ్నిస్సనిర్ధూమః యథామహాహ్రదః") ధూమమున్నది కావునఁ పర్వతము వహ్నిగలది. ధూమముగలదియెల్ల వహ్నిగలదియగును. వంటయింటివలె. అగ్నిలేనిది పొగలేనిదియగును. మహాహ్రదమువలె. ఇందు పంచరూపములుగల వ్యాప్యము ధూమమగును. కావున నిది యన్వయవ్యతిరేకి యగును. ఇట పక్షమగు పర్వతమునను సపక్షమగు మహానసమునను ధూమముగలదు. విపక్షమగు మహాహ్రదమున ధూమములేదు. పర్వతమున నగ్నిలేదని ప్రబల ప్రమాణాంతరము సూచింపలేదు గాన నబాధితవిషయత్వమునుగలదు. సమబల ప్రమా ణాంతర విరోధములేదు. కావున నసత్ప్రతిపక్షత్వమునుగలదు ఇట్లిది పంచరూపోపన్నమగు లింగము.

తాదృశమేవ విపక్షరహితం వ్యాప్యం కేవలాన్వయి. యథా బ్రహ్మశబ్ద వాచ్యం – వస్తుత్వాత్ – ఘటవత్. విపక్షాభావాత్ కేవలాన్వయిచతూరూపోప పన్నం. కేవలవ్యతిరేకిణిసాధ్యాప్రసిద్ధేస్తద్వ్యతిరేకవ్యాప్తిర్దుర్గ్రహా అతఃకేవల వ్యతిరేకినిరాసః. కేవలాన్వయి అన్వయ వ్యతిరేకిచాత్యన్తాతీన్ద్రియార్థగోచరం నిరస్తం.

విపక్షరహితమగు వ్యాప్యము కేవలాన్వయి యగును. ఎట్లన "బ్రహ్మశబ్దవాచ్యము, వస్తువుకావున ఘటమువలె." ఇట విపక్షము ఉండదు. శబ్దవాచ్యముకానిది ఎచటను ఉండదు కావున అగ్న్యనుమాన మునందు హ్రదమువలె ఇట విపక్షముకానరాదు. కావున నిట నాల్గు రూపములేయుండును. విపక్షాసత్వమున కుదాహరణము లభ్యముకదా కేవల వ్యతిరేకియను ఒకభేదము సంభవింపదు. కేవల వ్యతిరేకియందు సాధ్యము అప్రసిద్ధము కావున వ్యతిరేకవ్యాప్తి లభింపదు. కావున కేవల వ్యతిరేకియను భేదముండదు.

తదేతదనుమానంస్వార్థం పరార్థంచేతి ద్వివిధం విభజ్యకేచిదాహుః. సర్వేషామనుమానానాం స్వప్రతిసన్ధానాదిబలేన ప్రవృత్తతయాస్వ వ్యవహార మాత్రహేతుత్వమితి స్వార్థానుమానమేవేత్యపరే.

ఈ యనుమానము స్వార్థము పదార్థము అని రెండు విధములని కొందఱు చెప్పుదురు. అనుమానములన్నియు తనయొక్క వ్యాప్తిజ్ఞానా దులవలననే ప్రవర్తించుటవలన స్వవ్యవహారమాత్ర హేతువులగును. కాన స్వార్థానుమానమేకాని పరార్థానుమానములేదని మఱికొందఱందురు.

(స్వార్థానుమానము - తాను తఱచుగాఁజూచుటచేత వహ్ని ధూమములకు వ్యాప్తినిగ్రహించి పర్వతసమీపమునకుఁ బోయినపుడచట నగ్ని గలదా లేదా యని సంశయించి ధూమమునుచూచి వ్యాప్తినిస్మరించి పర్వతమున వహ్న్యనుమితిని గావించును. ఇట్లు తన వ్యాప్తిజ్ఞానము తనకు మాత్రమే వహ్నినిశ్చయమును గల్గించుట స్వార్థానుమానమగును.

**పరార్థానుమానము—తాను ధూమమువలన వహ్నిని అనుమానించి ఇతరులకుఁ దెలియుటకయి పంచావయవ వాక్యమును బ్రయోగించి బోధించుట పరార్థానుమాన మనంబడును. ఇందుఁబంచావయవవాక్య ప్రయోగముచే నితరునికిని అగ్నిప్రతిపత్తి కల్గును.)**

తదిదమనుమానబోధకవాక్యం ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయనిగమనరూప పఞ్చావయవసంయుక్తం. తత్ర పక్షవచనం ప్రతిజ్ఞా – యథాఽగ్నిమానితి. లిఙ్గవచనం హేతుః – యథాధూమవత్త్వాదితి. వ్యాప్తినిర్దేశపూర్వకం దృష్టాన్తవచనముదాహరణం, తద్ద్వివిధం – అన్వయవ్యతిరేకభేదాత్. యోయో ధూమవాన్సోఽగ్నిమానిత్యన్వయోదాహరణం. యోఽనగ్నిస్సన్నిర్ధూమఇతి వ్యతిరేకోదాహరణం. దృష్టాన్తావష్టమ్భేనవ్యాప్తతయాపక్షేహేతూపన్యాసవాక్య ముపనయః. సోఽపిద్వివిధః – అన్వయవ్యతిరేకభేదాత్. తథాధూమవానిత్యన్వ యోపనయః. అయంచనతథానిర్ధూమఇతి వ్యతిరేకోపనయః. హేతుపూర్వకం పక్షేసాధ్యోపసంహార వాక్యంనిగమనం. ఏతదపి ద్వివిధం – యథాతస్మాదగ్ని మానితి. అయంనిరగ్నిర్నభవతీతి. ఏవం పఞ్చావయవవాదినో నైయాయికాః. ప్రతిజ్ఞాహేతూదాహరణరూప త్ర్యవయవవాదినో మీమాంసకాః. ఉదాహర ణోపనయరూపావయవద్వయవాదినస్సౌగతాః. అస్మాకం త్వనియమః – క్వచి త్పఞ్చావయవాః. క్వచిత్త్రయోఽవయవాః. క్వచిద్ద్వావవయవౌ – ఉదాహర ణోపనయాభ్యామేవ వ్యాప్యత్వ పక్షధర్మత్వయో స్సిద్ధత్వాత్తావతైవానుమిత్యుప పత్తేః. మృదుమధ్యమకఠోరధియాం విస్తరసఙ్గ్రహాభ్యాం వ్యవహార ఉపపద్యత ఇత్యనియమఏవ. ఏవం పఞ్చావయవయుక్తస్సద్ధేతురేవవహ్న్యనుమాపకః. సద్ధేతువిరుద్ధత్వాత్ ధూమసదృశధూళీపటలాన్నవహ్న్యనుమితిః.

**ఈ యనుమాన బోధకవాక్యము ప్రతిజ్ఞ హేతువు, ఉదాహరణము ఉపనయనము, నిగమనము అను నయిదవయవములతోఁ గూడి యుండును. అందు (1) "పర్వతము వహ్నికలది" అను సాధ్యము కలదిగాపక్షమును జెప్పువాక్యము ప్రతిజ్ఞయగును. (2) "ధూమముకలది కనుక" అనురీతిని లింగమునుజెప్పుట హేతువగును. (3) వ్యాప్తిని నిర్దేశించుచు దృష్టాంతమును జూపుట యుదాహరణమగును. అది యన్వయి – వ్యతిరేకి – యని రెండువిధములు. "ధూమముగలదెల్ల**

నగ్నికలదగును - మహానసమువలె" ననునది యన్వయోదాహరణము. "మహాహ్రదమువలె నగ్నిలేనిదియెల్లఁ బొగలేకయుండును" అనునది వ్యతిరేకోదాహరణము. దృష్టాంతమును జూపుచుఁ బక్షమునందు హేతువునుపసంహరించు వాక్యము ఉపనయమగును. ఇదియు నన్వయ వ్యతిరేక భేదముచే రెండు విధములు - "అట్లే ఇదియు ధూమము గలది" యనుట యన్వయోపనయము. "అట్లే ఇదియు నిర్ధూమము కాదు" అనుట వ్యతిరేకోపనయము. హేతుపూర్వకముగాఁ బక్షమునందు సాధ్యము నుపసంహరించుచుఁ జెప్పిన వాక్యము నిగమనవాక్యము. ఇదియు నట్లే రెండువిధములు. "ఆ కారణముచే నిది యగ్నికలది" యనుట యన్వయనిగమనము. "అందుచే నిది యగ్నిరహితముకాదు" అను వాక్యము వ్యతిరేకనిగమన వాక్యము. ఇట్లు నైయాయికులు పంచావయవయుక్తమగు వాక్యమే పరిపూర్ణోపదేశమని యందురు. (1) పర్వతోవహ్నిమాన్ (2) ధూమాత్ (3) యోయోధూమవాన్ ససవహ్నిమాన్ యథామహానసః (4) తథాయంధూమవాన్ (5) తస్మాదయం వహ్నిమాన్ - ఇది సంస్కృత పంచావయవ వాక్యము దీనినే న్యాయమందురు.

ప్రతిజ్ఞాహేతూదాహరణములను మూఁడే యవయవములని మీమాంసకుల మతము. ఉదాహరణము ఉపనయము అను రెండే అవయవములని బౌద్ధులు పలుకుదురు. మా మతమున నవయవముల సంఖ్యానియమములేదు. కొన్నియెడల వాక్యము పంచావయవము. కొన్నియెడల త్ర్యవయవము కొన్నియెడల ద్వ్యవయవమును గూడ నుండును. ఉదాహరణము ఉపనయము అను రెండిటితోడనే వ్యాప్తిపక్షధర్మములు సిద్ధించును గావున నంతమాత్రముచేతనే యనుమితి యుపపన్నమగుటచేతను ద్వ్యవయవమనుటయుఁగుదురుచున్నది. సూక్ష్మబుద్ధులకు సంగ్రహముగను మందబుద్ధులకు విస్తరముగను వ్యవహారము సంభవించునుగాన నవయవ సంఖ్యానియమము లేకుండుటయు నుచితమే యగును. ఇట్లు పంచావయవ సంయుక్తమగు సద్ధేతువు మాత్రమే వహ్న్యనుమాపకమగును. "సద్ధేతువ" నుటచేఁ బొగవలెఁగానవచ్చు ధూళిసమూహము వలన నగ్న్యనుమితి సంభవింపదు.

అన్యే హేతువదవభాసమానా హేత్వాభాసాః. తేచాసిద్ధవిరుద్ధానైకాన్తిక ప్రకరణ సమకాలాత్యయాపదిష్ట భేదాత్పఞ్చ ప్రకారాః. తత్రాసిద్ధస్త్రివిధః – స్వరూపాసిద్ధ ఆశ్రయాసిద్ధో వ్యాప్యత్వాసిద్ధశ్చేతి. స్వరూపాసిద్ధోయథా—నిత్యో జీవః – చాక్షుషత్వాత్ – ఘటవత్. ఆశ్రయాసిద్ధస్తు – వ్యోమారవిందంసురభి– అరవిన్దత్వాత్ – సరోజారవిన్దవత్. వ్యోమారవిన్దమాశ్రయః – సచాసిద్ధః. వ్యాప్యత్వాసిద్ధోద్వివిధః – ఏకోవ్యాప్తిగ్రాహక ప్రమాణాభావాత్. అపరస్తు ఉపాధిసద్భావాత్. ఆద్యోయథా – యత్సత్ – తత్క్షణికమితి – క్షణికత్వసత్త్వయోర్వ్యాప్తిగ్రాహక ప్రమాణాసిద్ధేః. ద్వితీయోయథా – అగ్నీషోమీయహింసా అధర్మసాధనా – హింసాత్వాత్ – క్రతుబాహ్యహింసావదితి. అత్రనిషిద్ధత్వ ముపాధిః – అతోహింసాత్వ హేతుస్సోపాధికః.

యథార్థముగా హేతువులుకాకయు హేతువులవలెఁ గానవచ్చునని హేత్వాభాసములనఁబడునని కొన్నికలవు. అవి అసిద్ధము, విరుద్ధము, అనైకాంతికము. ప్రకరణసమము, కాలాత్యయాపదిష్టము అని అయిదు విధములు. అందు అసిద్ధము స్వరూపాసిద్ధము ఆశ్రయాసిద్ధము వ్యాప్యత్వాసిద్ధము అని మువ్విధములు. ఘటమువలె జీవుఁడనిత్యుఁడు. చక్షుర్విషయుఁడు కావున (జీవః అనిత్యః - చాక్షుషత్వాత్ - ఘటవత్) అనునది స్వరూపాసిద్ధమున కుదాహరణము. ఇట జీవునియందు చాక్షుషత్వమనఁబడు హేతుస్వరూపము సిద్ధింపలేదు కావున నీహేతువు స్వరూపాసిద్ధమగును. "అరవిందము కావునఁ దటాకారవిందమువలె వ్యోమారవిందము పరిమళయుక్తము" (వ్యోమారవిందం సురభి. అరవిందత్వాత్. సరోజారవిందవత్) ఇది యాశ్రయాసిద్ధమున కుదాహరణము. అరవిందత్వమనఁబడు హేతువునకాశ్రయమగు వ్యోమారవిందము అసిద్ధముకావున నీహేతువు ఆశ్రయాసిద్ధమయ్యెను. వ్యాప్యత్వాసిద్ధము రెండువిధములు. వ్యాప్తిగ్రాహకప్రమాణములేనందున నొకచో వ్యాప్యత్వాసిద్ధము కాననగును మఱియొకచో 'నుపాధి' యుక్తమగుటచే వ్యాప్యత్వాసిద్ధమగును. ఏది సత్పదార్థమో యది క్షణికము. అనుచోట మొదటి వ్యాప్యత్వాసిద్ధముగలదు. (యత్ సత్ తత్ క్షణికమ్) ఇట క్షణికత్వసత్త్వములకు వ్యాప్తిగ్రాహకమగు ప్రమాణములేదు. ఇది క్షణికము - సత్తుకావున అను నీయనుమానమున "యత్రయత్ర సత్త్వం

తత్రతత్ర క్షణికత్వం" అను వ్యాప్తి యప్రసిద్ధము. కాన నిది వ్యాప్యత్వా సిద్ధమగును "క్రతుబాహ్యహింసవలె హింస కావున నగ్నీషోమీయ హింసయు నధర్మసాధకయగును" (అగ్నీషోమీయహింసా అధర్మ సాధికా - హింసాత్వాత్ - క్రతుబాహ్యహింసావత్). ఇట హేతువు ఉపాధిగ్రస్తము. ఇందు "నిషేధ్యము" అను నుపాధిగలదు. ఈ నిషేధ్యత్వము సాధ్యమగు నధర్మసాధకత్వమునకు వ్యాపకమును సాధనమగు హింసాత్వమునకు అవ్యాపకమును అగును కావున నుపాధి యయ్యెను. కావున నుపాధిగ్రస్తవ్యాప్యత్వాసిద్ధమునకిదియుదాహరణము.

విపరీత వ్యాప్తో హేతుర్విరుద్ధః-తద్యథా-ప్రకృతిర్నిత్యా-కృతకత్వాత్-కాలవత్. కృతకత్వహేతుస్సాధ్యాభావ వ్యాప్తః, సవ్యభిచారో౽అనైకాన్తికః. సచద్వివిధః - సాధారణో౽సాధారణశ్చేతి. పక్ష సపక్ష విపక్షవృత్తిస్సాధారణానైకాంతికః - యథాశబ్దోనిత్యః - ప్రమేయత్వాత్ - కాలవత్. అసాధారణస్తు సపక్ష విపక్షాద్వ్యావృత్తః - యథాభూర్నిత్యా - గన్ధవత్త్వాత్. ప్రకరణ సమస్తు సాధ్యవిపరీత సాధకహేత్వన్తరవాన్ - యథా ఈశ్వరో నిత్యః - అనిత్యధర్మ రహితత్వాత్, ఈశ్వరోననిత్యః - నిత్యధర్మరహితత్వా, దితి. అయమేవ సత్ప్రతిపక్షః. కాలాత్యయాపదిష్టో యథా-అగ్నిరనుష్ణః పదార్థత్వాత్-జలవత్. అయంచ ప్రత్యక్షేణైవోష్ణత్వావధారణాద్బాధితః.

సాధ్యవిపరీత వ్యాప్తిగల హేతువు విరుద్ధమనఁబడును. కృతకము కావున కాలమువలె ప్రకృతి నిత్యము (ప్రకృతిః నిత్యా - కృతకత్వాత్-కాలవత్) ఇట కృతకత్వము అను హేతువు సాధ్యాభావవ్యాప్తము. ఇట సాధ్యము నిత్యత్వము. నిత్యత్వాభావము సాధ్యాభావము. దానికి వ్యాప్తము కృతకత్వము అనఁగా నిత్యత్వమునకు హేతువుగాఁజెప్పఁబడిన కృతకత్వము నిత్యత్వాభావమునకు హేతువగుచున్నది. కావున నిది విరుద్ధము. అనైకాంతికమనఁగా వ్యభిచారయుక్తము. అది సాధారణము అసాధారణము అని ద్వివిధము. పక్షమునను సపక్షమునను విపక్షమునను గూడ నుండునది. సాధారణానైకాంతికము ప్రమేయమగుటవలన కాలమువలె శబ్దము నిత్యము (శబ్దోనిత్యః-ప్రమేయత్వాత్-

కాలవత్.) ఇటఁ బ్రమేయత్వమను హేతువు పక్షమగు శబ్దమునను సపక్షమగు కాలమునను విపక్షమగు ఘటాదులయందును నుండును కావున నిది సాధారణానైకాంతిక హేతువున కుదాహరణమయ్యెను. సపక్షమునను విపక్షముననుగూడ నుండనిది యసాధారణానైకాంతికము గంధవతి కావున వ్యోమమువలె భూమి నిత్యము (భూమిర్నిత్యా - గంధవత్త్వాత్- వ్యోమవత్) ఇట సపక్షమగు వ్యోమమునందును విపక్షమగు శబ్దాదుల యందునుగూడ గంధవత్త్వములేదు కావున నీహేతువు అసాధారణానైకాంతికమయ్యెను. సాధ్యవిపరీత సాధక హేత్వంతరముకలది ప్రకరణసమమనఁబడును. నిత్యధర్మరహితుఁడగుటవలన నీశ్వరుడు అనిత్యుఁడు అను ప్రయోగమునకు అనిత్యధర్మహితుఁ డగుటవలన నీశ్వరుఁడు నిత్యుఁడు అనురీతిని ప్రయోగాంతరముగలదు. సాధ్యమగు ననిత్యత్వమునకు విపరీతమగు నిత్యత్వమును సాధించు అనిత్యధర్మరాహిత్యము అను హేత్వంతరము కలదగుటచే నిది సత్ప్రతిపక్షమను నామాంతరముగల ప్రకరణసమమను హేత్వాభాసమయ్యెను. ప్రకరణమనఁగాఁ బక్షము. దానితో సమముకావున నీహేతువు ప్రకరణసమమయ్యెను. అనఁగా పక్షము సందిగ్ధసాధ్యక మయినట్లే యీహేతువును సాధ్యసాధనసమర్థమగునో కాదోయని సందిగ్ధముగానుండును కావున నీహేతువు ప్రకరణసమమనఁబడెను. ఏహేతువునకు సంబంధించినపక్షము సాధ్యాభావము కలదగునో యాహేతువు కాలాత్యయాపదిష్టమగును. ఉదా: పదార్థము కావున జలమువలె నగ్ని చల్లనిది. (అగ్నిరనుష్ణః-పదార్థత్వాత్-జలవత్) అనుచోట అగ్నిచల్లనిది కాదని ప్రత్యక్షప్రమాణసిద్ధమగుటచే నిట పక్షము సాధ్యాభావవత్తు అయినది. కాన నీహేతువు కాలాత్యయాపదిష్టము. దీనిని బాధయనియునందురు.

ఏవమనుమానే నిరూపితే ఉపమానాదేరనుమానాదావన్తర్భావః. యథా- అతిదేశ వాక్యార్థంస్మరన్ యదాగోసాదృశ్యవిశిష్టపిండంపశ్యతి-తదాతద్వాక్యార్థస్మరణ సహకృతగోసాదృశ్య విశిష్టపిండజ్ఞానంజాయతే. తదుపమానమిత్యుచ్యతే. స్మరణరూపత్వాత్ప్రత్యక్షేఽన్తర్భావః. వ్యాప్తిగ్రహాపేక్షత్వాదనుమానేఽన్తర్భావః. వాక్యజన్యత్వాచ్ఛబ్దేఽన్తర్భావ ఊహ్యః.

ఇట్లనుమానము నిరూపితమయ్యెను ఉపమానాదులను అనుమాన ప్రమాణాదులందే యంతర్భవించును. ఉపమాన మనఁగా అతిదేశ వాక్యార్థస్మరణ సహకారముగల సాదృశ్యవిశిష్టపిండజ్ఞానము.

తాను గవయమృగము నెఱుంగకున్నను గవయమునెఱింగియున్న యొక యాటవికునివలన "గవయము గోవువలెనుండును" అని తెలిసికొని యడవికిఁబోయి ఆరణ్యకుఁడు చెప్పిన గవయము గోసదృశము అను వాక్యమును దలంచుకొనుచు గోవువంటి యొక జంతువునుజూచి ఇది గోసదృశమృగము అని దెలిసికొనును. అతి దేశవాక్యార్థస్మరణముతోఁగూడిన యీగోసదృశపిండజ్ఞానమే యుపమాన మనంబడును. ఈ యుపమానమువలన "నిది గవయము" అను జ్ఞానము జనించును. దీనికే యుపమితి యందురు. ఉపమానమీ యుపమితికి కరణమని యాశయము. "గవయము గోవువలెనుండును" అను నారణ్యకుని వాక్యమును అతిదేశ వాక్యమని చెప్పుదురు. ఈ యతిదేశ వాక్యములు మూఁడు విధములుగా నుండును. "గోసదృశము గవయము" అను వాక్యము సాధర్మ్యాతిదేశవాక్యము. "అశ్వము గోవువలె రెండుగా చీలియున్న డెక్కలుగలది కాదు" అను వాక్యము వైధర్మ్యాతిదేశ వాక్యము. "పొడవగు కంఠముగలదియు వ్రేలాడు పెదవిగలదియు ముండ్లకొమ్మలను తినునదియు క్రమేలకము" ఇది అసాధారణధర్మాతిదేశవాక్యము. ఇట్టి యతిదేశ వాక్యార్థస్మరణముగలవ్యక్తి ఆయాసాదృశ్యాదులుగల మృగములనుజూచి ఇది గవయము ఇది యశ్వము ఇది క్రమేళకము అని తెలిసికొనును - ఇది యేయుపమితి ఈ యుపమితి కరణమగు నుపమానము అనుమానాదులలో నంతర్భవించును ఇది స్మరణరూపము కావునఁ బ్రత్యక్షమున నంతర్భవించును "ఏది గోసదృశమో యది గవయము" అను వ్యాప్తిజ్ఞానము నపేక్షించును గావున ననుమానమునందును అంతర్భవించును. "గోసదృశము గవయము" అను వాక్యమువలనఁ గలుగునది కావున శబ్దమునందును నంతర్భవించును.

అర్థాపత్తిర్యథా — దివా అభుఞ్జానస్య పురుషస్య పీనత్వదర్శనాద్రాత్రి భోజనం కల్ప్యతే. ఏతస్యానుమానేఽన్తర్భావః.

అర్థాపత్తియుఁ బ్రమాణాంతరము కాదు. అది యనుమానముననే యంతర్భవించును. ఒక పురుషుఁడు బలిసియుండెను. కాని పగటి భోజనము చేయఁడు అట్టివానిఁజూచి ఇతడు రాత్రియందు భోజనము చేయుచుండునని యూహించును. ఇది యర్థాపత్తియందురు. రాత్రి భోజనముచేయనిదే పగలు భోజనము చేయనివానికి బలిసియుండుట కుదురదుగావున రాత్రిభోజన మూహింపఁబడును. ఈ యర్థాపత్తియు ననుమానముననే యంతర్భవించును. పగలు భోజనముచేయకయు బలిసియుండుట అను హేతువుచే రాత్రిభోజనమును సాధించుట అనుమానమే యగునుగదా - (దేవదత్తః రాత్రిభోజీ-దివాఅభుంజానత్వేసతి పీనత్వాత్)

తర్కో నామ వ్యాప్యాఙ్గీకారేణ వ్యాపకానిష్టప్రసఞ్జనం. తద్యథా — పర్వతో వహ్నిమాన్ — ధూమవత్త్వాదిత్యనుమానే ధూమోఽస్తు — వహ్నిర్మాస్త్విత్యుక్తే — యది వహ్నిర్న స్యాత్ — తర్హి ధూమోఽపి న స్యాదితి. ఏతస్య ప్రమాణానుగ్రాహకత్వం.

"వ్యాప్యము నంగీకరించి వ్యాపకమునకుఁ బ్రసక్తినితెచ్చుట" తర్కమగును. "యది వహ్నిర్న స్యాత్ తర్హి ధూమోపి న స్యాత్" అనునది యుదాహరణము. ఇట వహ్న్యభావము ధూమాభావమునకు వ్యాప్యము. వహ్న్యభావము నంగీకరించి దానిమూలమున వ్యాపకమగు ధూమాభావమునకుఁ బ్రసక్తి చెప్పఁబడెను. కావుననిది తర్కము.

ధూమముచే నగ్ని ననుమానించునపుడు "ధూమమున్నను నగ్నిలేకపోవచ్చును" అను శంకకు సమాధానముగా "అగ్నిలేనిచో ధూమమును ఉండదు." అట్లయినచో నగ్నిధూమములకుఁగార్యకారణ భావమేయుండదు అనురీతిగలవాక్యము తర్కమగును ఇది యనుమానమునకు సాహాయ్యకారి యగును.

తర్కానుగృహీత ప్రమాణపూర్వక తత్త్వావధారణం నిశ్చయః. వీతరాగకథావాదః. పక్షద్వయసాధనవతీ విజిగీషుకథాజల్పః. స్వపక్షస్థాపనాహీనావితణ్డా. అవివక్షితశబ్దార్థారోపణం ఛలం. స్వవ్యాహతదూషణం జాతిః. అసదుత్తరం జాతిరితివా. పరాజయహేతుర్నిగ్రహస్థానం. ఇత్యేతేషామనుమానాఙ్గత్వాదనుమానేన్తర్భావః. క్వచిత్క్వచిన్నైయాయిక మతానుసారేణైవ వ్యవహారః - అతోనవిరోధః. ఇత్యనుమానం నిరూపితం.

తర్కసహకృతమగు ప్రమాణముచే తత్త్వమును నిష్కర్ష చేయుట నిశ్చయమనంబడుమ.

వీతరాగులకథ వాదమనంబడును. వీతరాగులు అనఁగా రాగబద్ధులుకాక ప్రమాణతర్కముల నవలంబించి తత్త్వనిర్ణయము చేయువారు. పరస్పర విరుద్ధముగా వాదించు నిద్దరి వ్యవహారము కథయనంబడును. కాఁగా - రాగబద్ధులు కాక ప్రమాణతర్కముల నవలంబించి తత్త్వనిర్ణయమునకై పరస్పర విరుద్ధముగా వాదించు నిద్దరి వ్యవహారము "వాద" మనఁబడును. ఆకథ వాదము జల్పము వితండ యని మువ్విధములు. అందు వీతరాగకథ వాదమని వివరింపఁబడెను. పక్షద్వయమునందును సాధనసంపత్తి గల్గి జయార్థులగు వారికథ జల్పమగును. ఒకరు స్వపక్షసాధనముగల్గియుండ రెండవవాది తనపక్షమును స్థాపించుకొనక పరపక్షదూషణము మాత్రము చేయుట "వితండ" యగును.

(స్వపక్షసాధనము పరపక్షదూషణము, సాధన సమర్థనము, దూషణసమర్థనము, శబ్దదోషవర్జనము, అను నయిదును వాదమునకంగములు, ఇవి ప్రమాణజ్ఞులకుఁ గర్తవ్యములు. ఛల, జాతి, నిగ్రహములు. మాత్రము వర్జనీయములు,) వక్త యభిప్రాయమునకు విరుద్ధముగా నాతని శబ్దమున కర్థమును గల్పించి దానియందు దోషము నారోపించుట "ఛల" మనంబడును. "ఇతఁడు నవకంబళుఁడు" అని నవ శబ్దమును నూతనార్థకముగా వక్త ప్రయోగింపఁగా ప్రతివాది తద్విరుద్ధ

ముగా నవశబ్దమునకు నవసంఖ్యయని యర్థమును గల్పించి దానిపై దోషారోపణముచేయుట దీనికుదాహరణము. ప్రతివాదిపై చేసిన దోషారోపము తనకును వర్తించుట జాతియనఁబడును. లేదా - అసదుత్తరము అనగా స్వవ్యాఘాతకత్వము జాతియనియు ననవచ్చును. పరాజయ హేతువును నిగ్రహస్థాన మందురు. ఇవియన్నియు ననుమానాంగములు కావున ననుమానమునందే యంతర్భవించును. జాతి 24 విధములు. నిగ్రహము 22 విధములు. అ భేదములు గ్రంథాంతరములనుండి గ్రాహ్యములు

కొన్నికొన్నిచోట్ల నైయాయికమతము ననుసరించి చెప్పఁబడినది. అది దోషముకాదు. అవిరుద్ధముగానున్నచో నైయాయికాదుల మతము ననుగ్రహింతమని చెప్పియున్నారము — ఇట్లనుమాన ప్రమాణము నిరూపితము.

ఇతి యతీన్ద్రమతదీపికాయామనుమాననిరూపణంనామ ద్వితీయోఽవతారః.

ఇది యనుమాన నిరూపణమనంబడు ద్వితీయావతారము.



# తృతీయోవతారః

అనుమానేని రూపితే అన్తరం శబ్దో నిరూప్యతే—అనాప్తానుక్తవాక్యజనిత విజ్ఞానంయత్ – తత్కారణంశబ్దప్రమాణం. అనాప్తానుక్తేత్యుక్త్వాద్వేదస్య పౌరుషేయత్వ నిరాసః.

**ఇంక శబ్దప్రమాణమును నిరూపితము. అనాప్తానుక్త వాక్యజనిత తదర్థవిజ్ఞానము శాబ్దజ్ఞాన మగును. అట్టి జ్ఞానమునకుఁ గరణము శబ్ద ప్రమాణము. ఆప్తులుకానివారిచేఁ బలుకఁబడని వాక్యమువలనఁగలిగిన యర్థజ్ఞానము శాబ్దజ్ఞానమని భావము. "అనాప్తానుక్తము" అనుటకు బదులు "ఆప్తోక్తము" అని చెప్పలేదు. అట్లు చెప్పినచో వేదము ఆప్తోక్తమనవలసివచ్చును. అట్లున్నచో నది పౌరుషేయమనవలయును. అది యసమ్మతము. అందులకై అనాప్తానుక్తమని చెప్పఁబడెను. వేదము ఆప్తునిచేఁగాని యనాప్తునిచేఁగాని యుక్తమేకాదు కనుక అనాప్తానుక్తమగు వాక్యమగును. కావున నది శబ్దప్రమాణమగుటకు బాధకములేదు.**

కారణ దోషబాధక ప్రత్యయాభావవద్వావాక్యం. సర్గాదౌభగవాన్ చతుర్ముఖాయ పూర్వపూర్వ క్రమవిశిష్టాన్ వేదాన్ స్మృత్వా ఉపదిశతితికృత్వా వేదస్య నిత్యత్వమ పౌరుషేయత్వంచ సిద్ధమితి కారణదోషబాధక ప్రత్యయాభావశ్చ. నను వేదవాక్యానాం మీమాంసకైః కార్యపరతయైవ ప్రామాణ్య స్వీకారాత్, సిద్ధబ్రహ్మపరవాక్యానాం వ్యుత్పత్త్యసమ్భవా, చ్చకథం ప్రామాణ్య మితిచేత్. ఉచ్యతే – సిద్ధబ్రహ్మపరవాక్యానామపి ఉపాసనరూప కార్యాన్వయ స్వీకారాత్.

**లేదా కరణదోషబాధక ప్రత్యయశూన్య వాక్యము శబ్దప్రమాణము అనియయినను లక్షణము కావచ్చును. వేదము అపౌరుషేయము కావున పురుషుని ఇంద్రియ దోషములు దానికి సంభవింపవు. వేదవాక్యము బాధకమను జ్ఞానమును కలుగదు. కావున వేదవాక్యమునకు లక్షణము**

పరిపడును. ఇంద్రియముల దోషములేనిదియు ఈవాక్యము బాధించునది అను జ్ఞానములేనిదియు నగువాక్యము శబ్దప్రమాణమని తాత్పర్యము. సృష్టి ప్రారంభమున శ్రీమన్నారాయణుండు చతుర్ముఖునకు అనాది సిద్ధములయి వచ్చుచున్న వేదములను స్మరించి యుపదేశించెను'' అని చెప్పఁబడుటచే వేదము నిత్యమనియు అపౌరుషేయమనియు సిద్ధించుటచే కరణదోషబాధక ప్రత్యయములు వేదవాక్యమునకు సంభవింపవు. వ్యాసాది మహామునులకు సూక్ష్మదృష్టి గలవారికిని వేదవాక్యముల యర్థము తెలియకపోవుటకాని సందిగ్ధముగా నుండుటకాని సంభవింపదు కావున అప్రామాణ్యము వేదవాక్యమునకు సంభవింపదు.

ఒకఁడు "గామానయ" అను వాక్యమును బ్రయోగింపఁగా నింకొకఁడు గోవునుదెచ్చును. మరల నాతఁడు "గాంనయ అని ప్రయోగింపగా గోవును దీసికొనిపోవును. మరల నాతఁడు ''అశ్వమానయ'' అని ప్రయోగింప నశ్వమును దెచ్చును. ఈ వాక్యములను వినుచు గవానయన గోనయనాశ్వానయనములనంబడు కార్యములఁ జూచుచున్న బాలుఁడు ఆవాక్యములకును వానిలోని పదములకును అర్థబోధకశక్తిని ఊహించును. కావునఁ గార్యబోధకశబ్దములు అనఁగా కుర్యాత్, కురు. కర్తవ్యమ్ మున్నగు శబ్దములు మాత్రమే శబ్దశక్తిస్ఫోరకములయి తత్తత్పదార్థబోధకములగును. అని మీమాంసకుల మతము. కావున నట్టివాక్యములే ప్రమాణములగును కార్యరూపముకానిదియు సిద్ధపదార్థమును అగు బ్రహ్మను బోధించు వేదశబ్దములవలన వ్యుత్పత్తి సంభవింపదు. కావున వేదవాక్యములకుఁ బ్రామాణ్యమెట్లని శంకింపరాదు. కార్యము అనఁగాఁ గ్రియానిష్పాద్యముకాని సిద్ధబ్రహ్మమునే వేదవాక్యములు బోధించుచున్నను ''ఆత్మావా అరే ద్రష్టవ్యః'' ఇత్యాదిగా నుపాసన క్రియ నిష్పాద్యముగా విధింపబడుచున్నందున నుపాసనములో కర్మగా నన్వయించునట్టి బ్రహ్మపదమునకును వ్యుత్పత్తి సంభవించును. కావున వేదవాక్యములకుఁ బ్రామాణ్యము సంభవించును గోవు అశ్వము మున్నగునవి సిద్ధవస్తువులే అయినను నయ, అనయ, మున్నగు క్రియలతోఁగూడి బోధవిషయములగునట్లె ''ఆత్మావా అరే ద్రష్టవ్యః'' ఇత్యాది వాక్యములలో ''నిదిధ్యాసితవ్యః'' అను ఉపాసనారూపక్రియతో

వన్వయించుచున్న బ్రహ్మశబ్దార్థము బోధవిషయమగును. కావున వేద వాక్యములు ప్రమాణములేయగునని భావము. కార్యపరవాక్యములే ప్రమాణములు అను మీమాంసక మతము ననుసరించి పైసమాధానము చెప్పఁబడెను. కాని సిద్ధవస్తు బోధక వాక్యములకును బోధకత్వము కలదనియు వేదముననేకాక లోకముునను సిద్ధవస్తు పరవాక్యములు బోధకములగుచున్నవనియు సమాధానాంతరము చెప్పఁబడుచున్నది.

పితాతేసుఖమాస్తే ఇతి లౌకికసిద్ధ పరవాక్యస్యాపి బోధకత్వదర్శనాత్, బాలానాం లోకేమాతాపితృ ప్రభృతిభిరమ్బాతాతమాతుల చన్ద్రాదీనఙ్గుళ్యానిర్దిశ్య తదభిధాయినశ్శబ్దాన్ ప్రయుఞ్జానైఃక్రమేణ బహుశశ్శిక్షితానాంతదర్థ వ్యుత్పత్తి దర్శనాత్, వేదేపిపరినిష్పన్నేప్యర్థే శబ్దస్య బోధకత్వం సమ్భవతీతినాప్రామాణ్య శఙ్కావకాశః.

"పితాతేసుఖమాస్తే" (మీతండ్రి సుఖముగానున్నాడు. మున్నగు వాక్యములు కార్యాన్వితములుకావు. "సుఖముగానున్నాఁడు అను సిద్ధ విషయమునే బోధించును. అయినను ఈవాక్యము అర్థబోధకమగుట లోకమునఁ గానవచ్చుచున్నది.

ఒకఁడు "మీతండ్రి సుఖముగానున్నాఁడని దేవదత్తునికిఁదెలుపు మని" యజ్ఞదత్తునికి హస్తచేష్టాదులతో సూచింపఁగా నాతఁడు దేవదత్తుని కడకుఁబోయి "పితాతే సుఖమాస్తే" యని ప్రయోగించును ఇది యంతయు మొదటినుండియుఁ జూచుచున్నబాలుఁడు "పితాతేసుఖమాస్తే" అనువాక్యము నర్థమును హస్తసంజ్ఞాదులచే నెఱింగియుండుటచే దీని యర్థమిది యని గ్రహించును. కావున లోకమున సిద్ధపరవాక్యములును అర్థబోధములగుట చూచుచున్నాము ఇట్లు యాదృచ్ఛికముగాఁబ్రయుక్త మగు శబ్దము నర్థమును దెలిసికొనుటయేకాక బుద్ధిపూర్వకముగాఁ గూడ సిద్ధవస్తుపరవాక్యములకు అర్థబోధకత్వము లోకమునఁ గానవచ్చు చున్నది లోకమునఁదల్లి తండ్రి మున్నగువారు తమ పిల్లలకు ఆయా వస్తువులను జేతితోఁజూపి అమ్మ, నాన్న, చందమామ, ఆవు, మున్నగు శబ్దములతో బోధింతురు. ఇట్లు పలుసార్లు బోధించుటవలన నా బాలురు

ఆయామాటల యర్థమును దెలిసికొందురు. అపుడు ఆవుఏది? అమ్మఏది? అని ప్రశ్నించినచో ఆయావ్యక్తులను వారు చూపుచుందురు. కావున వారికి ఆపదముల యర్థము తెలిసినట్లేకదా. అవియన్నియు సిద్ధవస్తువులను బోధించు శబ్దములేకదా! కావున వేదమునను సిద్ధవస్తుపరవాక్యములకు వ్యుత్పత్తి సంభవింపదనుటయు, అందుచే నవి యప్రమాణములనుటయు సమంజసముకాదు.

తర్హి అభిచారాది ప్రతిపాదకాంశస్యకథం ప్రామాణ్యమితినశఙ్కనీయం—తస్యదృష్టఫలప్రదర్శనేన అదృష్ట స్వర్గాదిఫలక సాధనాదౌ ప్రవృత్తి ప్రయోజకత్వాత్. యూపాదిత్య వాక్యంతు ఆదిత్యవద్యూప ప్రకాశనపరం. అతః కృత్స్నస్య వేదస్య ప్రామాణ్యం.

సరే - అర్థబోధకమగునని యంగీకరించినను అభిచారాది హింసాబోధకములగుచున్న "శ్యేనేనాభిచరన్యజేత" ఇత్యాది వాక్యములు ప్రమాణములగునాయని శంకింపరాదు. శ్యేనయాగాదుల ప్రయోజనము (శత్రువధాదికము) ప్రత్యక్షము కావున అదిచూచి అదృష్టఫలకములగు స్వర్గాది ఫలసాధనములయిన యజ్ఞాదులయందును మానవులను ప్రవర్తించునట్లు ప్రోత్సహించును గావున శ్యేనయాగాది ప్రతిపాదక వేదవాక్యములును ప్రమాణములేయగును. కావున వేదమంతయును ప్రమాణమేయగును.

సవేదఃకర్మబ్రహ్మప్రతిపాదక పూర్వోత్తరభాగాభ్యాం ద్విధాభిన్నః. ఆరాధనకర్మ ప్రతిపాదకం పూర్వకాణ్డం. ఆరాధ్యబ్రహ్మ ప్రతిపాదక ముత్తరకాణ్డం. అతఉభయోర్మీమాంసయోరప్యైక శాస్త్ర్యం.

వేదమనఁగా నిష్టప్రాప్తికిని అనిష్టనివృత్తికిని అలౌకికమగు నుపాయములను బోధించునదియని భావము (అలౌకికోపాయం వేదయతీతివేదః అని వ్యుత్పత్తి) అట్టివేదము పూర్వభాగము ఉత్తరభాగము అని రెండు భాగములుగా నున్నది. అందుఁబూర్వభాగము కర్మ ప్రతిపాదకము. అనఁగా భగవదారాధన రూపమగు కర్మను బోధించునది. ఉత్తరభాగము బ్రహ్మప్రతిపాదకము. అనఁగా నారాధ్యుఁడగు బ్రహ్మను

బోధించునది. ఈ పూర్వోత్తర మీమాంసలు రెండును ఒకే శాస్త్రము. వేదమున రెండుభాగములును ధర్మమునే ప్రతిపాదించుచున్నవి కావున ఇది యంతయు నొక్కశాస్త్రమేయగును. ధర్మమనఁగా నలౌకికమగు శ్రేయస్సాధనముగదా - అధర్మము సిద్ధము సాధ్యము నని ద్వివిధము. సాధ్యమగు క్రియారూపమయిన యాగాది ధర్మములను బూర్వభాగము ప్రతిపాదించును. సిద్ధమగు పరబ్రహ్మరూపమగు ధర్మమును ఉత్తర భాగము ప్రతిపాదించుచున్నది. "తేవదన్తి మహాత్మానం కృష్ణం ధర్మం సనాతనమ్" ఇత్యాదులలో సిద్ధవస్తువును ధర్మమనుట ప్రసిద్ధము.

భాగద్వయాత్మకో ఋగ్యజుస్సామాథర్వణరూపేణ చతుర్ధాఽవస్థితః. పునరనన్త ప్రకారశ్చ. ఋగాదిబహుప్రకారో వేదః మన్త్రార్థవాదవిధిరూపేణ త్రివిధః. అనుష్ఠేయార్థ ప్రకాశకో మన్త్రః. విధ్యధీన ప్రవృత్త్యుత్తమ్భక వాక్యవిశేషోఽర్థవాదః. హితానుశాసనరూప వాక్యమిహవిధిః.

ఈ భాగద్వయాత్మకవేదము ఋగ్యజుస్సామాధర్వ రూపముగా నాల్గువిధములు. ఇంకను అనంతప్రకారములు గలదియు నగుచున్నది. (వృత్తబద్ధములగు మంత్రములు ఋక్కులు గీతిబద్ధములగు మంత్రములు సామములు, వృత్తగీతి భిన్నములగు మంత్రములు యజుస్సులు. వీనితో సంమిశ్రిత మధర్వవేదము) ఋగ్యజురాది బహువిధములగు వేదము-మంత్రము, విధి, అర్థవాదము, అని మువ్విధములు. ఆచరింపఁదగిన విషయమును బోధించునది మంత్రభాగము అనఁగా బ్రయోగ ముతోఁగూడిన యర్థమును బోధించునది. విధిసిద్ధమయిన ప్రవృత్తిని, నిషేధసిద్ధమయిన నివృత్తిని, ప్రోత్సాహపఱచునది యర్థవాదము. అనఁగా ప్రాశస్త్యమునుగాని నిందనమునుగాని చేయునది యర్థవాదము. ''వాయుర్వైక్షేపిష్ఠాదేవతా'' అనునది ''వాయవ్యం శ్వేతమాలభేతభూత కామః'' అనువాక్యముచే విధింపఁబడిన శ్వేతపశ్వాలంభనమును స్తుతించును "ఋత్విగ్భ్యోరజతంనదేయమ్'' అను దానిచే నిషేధింపఁ బడిన రజతదానమును "సోరోదీత్" అను వాక్యము నిందించును. కనుక నివి యర్థవాదము లనఁబడును. గుణవాదము, అనువాదము, భూతార్థ వాదము అనియర్థవాదము మరల త్రివిధము. పరకృతి, పురాకల్పము,

అనునవియుఁ దద్విశేషములే. హితమును అను శాసించువాక్యము విధియనంబడును.

సచ త్రివిధః అపూర్వపరిసఙ్ఖ్యానియమ భేదాత్. తేపునర్నిత్యనైమిత్తిక కామ్యభేదాత్ బహువిధాః. * వ్రీహీన్ప్రోక్షతీత్య పూర్వవిధిః. మనోమయ త్వాద్యుపాసన విధిర్విశిష్టవిధిః. *ఇమామగృభ్ణన్రశనామితివిధిః పరిసఙ్ఖ్యావిధిః. గుర్వభిగమనాది విధిర్నియమ విధిః. సన్ధ్యోపాసనాది విధిర్నిత్య విధిః. జాతేష్ట్యాది విధిర్నైమిత్తిక విధిః. జ్యోతిష్టోమాదివిధిః. కామ్యవిధిః.

అది అపూర్వవిధి పరసంఖ్యావిధి, నియమవిధి యని త్రివిధము ఆవిధులు నిత్యవిధి నైమిత్తికవిధి కామ్యవిధి మున్నగు భేదములతో బహువిధములు. దృష్టప్రయోజనముగాగాని యదృష్టప్రయోజనముగాఁ గాని ఏకాలమునందును ప్రాప్తింపనిదానిని ప్రాప్తింపఁజేయువిధి యపూర్వ విధియగును "వ్రీహీన్ప్రోక్షతి" యనునది దీనికుదాహరణము. ఇట వ్రీహులకుఁ బ్రోక్షణము విధింపఁబడినది. ఈ ప్రోక్షణమునకు వినియోగముతప్ప ఎట్లును ప్రాప్తిలేదు. కావున నిది యపూర్వవిధియగును. మనోమయత్వాద్యుపాసనవిధి విశిష్టవిధియగును (ఇదియు నపూర్వ విధియేయగును. సామాన్యరూపముగాఁ బ్రాప్తించినను విశేషరూప ముతోఁ బ్రాప్తిలేనిదేయగును.) పలుచోట్ల ఒక్కసారియే ప్రాప్తించు చుండ నొక్కచోటనే ప్రాప్తింపఁజేయుట పరిసంఖ్యావిధి యగును. "ఇమామగృభ్ణన్" అను మంత్రము సర్వసామాన్యముగా రశనాగ్రహణ మున నుపయుక్తమగుట లింగమువలననే ప్రాప్తించుచున్నది. కాని ఈ మంత్రమును అశ్వరశనాగ్రహణమునందే వినియుక్తమగునట్లు "అశ్వాభిధానీమాదత్తే" అనునది విధించుచున్నది. గార్ధభాశ్వాదిరశనా గ్రహణాదులందు ప్రాప్తించుచుండగా నొక్కయశ్వరశనాగ్రహణమునందే యీమంత్రమునకు వినియోగమును విధించుటచే నిది పరిసంఖ్యావిధి యగును. ఒక పక్షమున ప్రాప్తించుటయు, నొకపక్షమునఁ బ్రాప్తింపక పోవుటయు గలదానికి నియమముగా కర్తవ్యమగునట్లు విధించుట నియమ విధియగును. "సగురుమేవాభిగచ్ఛేత్" అని గుర్వభిగమనమును విధించుట నియమవిధి కుదాహరణము. సంధ్యోపాసనాది విధులు

నిత్యవిధులగును జాతకర్మాదివిధి నైమిత్తికవిధి యగును. జ్యోతిష్టో మాదివిధి కామ్యవిధి యగును.

ఏవం విధ్యర్థవాదమన్త్రాత్మకస్య వేదస్యచ్ఛన్దః, కల్పః, శిక్షా, నిరుక్తం, జ్యోతిషం, వ్యాకరణ, మిత్యేతాన్యఙ్గాని. ఛన్దోఽనుష్టుప్ త్రిష్టుబాది ప్రతిపాదన రూపం. శ్రౌతస్మార్త ప్రయోగ ప్రతిపాదన పరః కల్పః. శిక్షావర్ణనిర్ణయాత్మికా. నిరుక్తమ ర్థావ్రాకర్షప్రతిపాదకం. జ్యోతిషమధ్యయనతదర్థానుష్ఠానకాలనిర్ణ యాత్మకం. వ్యాకరణంతు సుశబ్దస్వరాదిసమర్థనపరం. ఏవం సాఙ్గస్య వేదస్య ప్రామాణ్యం సిద్ధం.

ఈ రీతిని విధ్యర్థవాద మంత్రాత్మకమగు వేదమునకు ఛందస్సు కల్పము, శిక్ష, నిరుక్తము, జ్యోతిషము, వ్యాకరణము అను నారును అంగములు, అనుష్టుప్, త్రిష్టుప్ మున్నగు ఛందస్సులను బోధించు శాస్త్రము ఛందము. శ్రౌతస్మార్తకర్మల ప్రయోగపద్ధతిందెల్పు శాస్త్రము కల్పము వర్ణాత్మకము శిక్ష. అర్థమును బ్రతిపాదించునది నిరుక్తము. అధ్యయనకాలమును దదర్థముల నాచరించు కాలమును నిర్ణయించు శాస్త్రము జ్యోతిషము. శబ్దము స్వరము మున్నగు వానిని సమర్థించునది వ్యాకరణము.

ఇట్లు సాంగమగు వేదమునకుఁ బ్రామాణ్యము సిద్ధించెను.

అథశ్రుత్యవిరుద్ధాచార వ్యవహార ప్రాయశ్చిత్తాది ప్రతిపాదికాఆప్త ప్రణీతాస్మృతిః ప్రమాణం. హిరణ్యగర్భాదీనామాప్తత్వేపి గుణత్రయవశ్యత్వ సమ్భవాత్ తత్కర్తృకయోగకాపిలాదిస్మృతీనాం మన్వాదిస్మృత్యవిరుద్ధాంశ ఏవ ప్రామాణ్యం. తత్త్వవిపర్యాసాది విరుద్ధాంశేన ప్రమాణం. వేదోప బృంహణరూపేతిహాస పురాణయోరపి ప్రామాణ్యం స్వతస్సిద్ధం.

శ్రుతికి అవిరుద్ధముగా నాచార వ్యవహార ప్రాయశ్చిత్తాదులను బోధించు నాప్తప్రణీతమగు స్మృతియుఁ బ్రమాణము. హిరణ్య గర్భాదు లును ఆప్తులేయయినను వారు గుణత్రయవశ్యులగుటచే వారురచియించిన యోగస్మృతియుఁ గపిలుని సాంఖ్యస్మృతియు మున్నగునవి సంపూర్ణ

ముగాఁ బ్రమాణములుకావు. మన్వాది స్మృతులకు అవిరుద్ధాంశము మాత్రమే వీనియందుఁ బ్రమాణము. తత్త్వవిరుద్ధమగుటచేత మన్వాది స్మృతి విరుద్ధాంశము అప్రమాణమేయగును. వేదోప బృంహణరూపము లయిన ఇతిహాస పురాణములకును బ్రామాణ్యము స్వతసిద్ధమే. అనఁగా నందుఁజెప్పఁబడినవి శ్రుత్యవిరుద్ధములేయనియు వానికి మూలభూత ముగుశ్రుతి యనుమానప్రమాణ లభ్యమనియుఁ దాత్పర్యము.

తత్ర భారత రామాయణయోః క్వచిత్క్వచిద్విరోధభానేపి తత్త్వాంశేవేదాన్తవాక్యవదవిరోధో నేయః.

సకలవేద వేదార్థములనెఱింగి తమ యోగమాహాత్మ్యముచే వేద తత్త్వార్థసాక్షాత్కారమును బొందిన ఋషుల వాక్యములచే తామెఱింగిన వేదవాక్యార్థములను వ్యక్తీకరించుట ఉపబృంహణమనఁబడును. బహు వేదశాఖలందొక్కరీతి ననుగతముగానుండు వేదవాక్యార్థము అల్పభాగ మును దెలిసినవారికి (ఏకైక శాఖామాత్రజ్ఞులకు) దురవగమము కావున నిశ్చయజ్ఞానమునకై యుపబృంహణము ఆవశ్యకముకదా! అందు భారతరామాయణములలో నొక్కచోట విరోధమున్నట్లు కానవచ్చినను తత్త్వాంశమునందు వేదవాక్యమునకునువలెనే అవిరోధమే కలదని తెలియనగును.

స్కాన్దాది పఞ్చక ప్రతిపాదక పురాణేష్వపి సాత్త్విక రాజసతామసభేద భిన్నేషు తత్త్వాంశే విరోధాద్విరుద్ధాంశేన ప్రమాణం. అన్యత్సర్వం ప్రమాణం. పాశుపతాద్యాగమోపి తథైవ.

పురాణములు - సర్గము ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అను నయిదు విషయములను ప్రతిపాదించును అవి సాత్త్వికములు రాజసములు తామసములు అని త్రివిధములు. వానికిని దత్త్వాంశమున విరోధములేదు. అయినను వానిలోఁదత్త్వవిరుద్ధాంశము అప్రమాణము. అవిరుద్ధాంశము ప్రమాణము. వానిలో విష్ణు, నారద, భాగవత, గారుడ, పద్మ, వరాహ పురాణములు ఆరును సాత్త్వికములు.

బ్రహ్మాండ బ్రహ్మకైవర్త మార్కండేయ భవిష్య వామన బ్రహ్మ పురాణములారును రాజసములు. మత్స్య కూర్మ లింగ శైవ స్కాంద ఆగ్నేయ పురాణములు ఆరును తామసములు. ఈ భాగము పద్మ పురాణోక్తము.

సాత్త్విక పురాణములందు విష్ణుమాహాత్మ్యమును రాజసములందు బ్రహ్మసరస్వతీ పితాదుల మాహాత్మ్యమును తామసములందు అగ్ని శివ మాహాత్మ్యములును అధికముగా బ్రతిపాదింపబడునని మత్స్యపురాణమునఁజెప్పఁబడెను. (కొందఱు శ్రుత్యవిరుద్ధములు కావున సాత్త్విక పురాణములే యుపాదేయములనియు శ్రుతివిరుద్ధములు కావున రాజస తామస పురాణములు అనుపాదేయములనియుఁ జెప్పుదురు) సంసార వర్ధనమునకు భగవత్ప్రేరితులయి పితామహాదులు రచించుటచే సాత్త్వికేతర పురాణముల ప్రమాణములనియు సాత్త్వికపరిగ్రాహ్యములు కావనియు వారి యాశయము. పశుపతి కపిలాది ప్రోక్త పాశుపత సాంఖ్యాద్యాగమము వేదావిరుద్ధాంశమున ఉపాదేయములును విరుద్ధాంశమున అనుపాదేయములు అగును.

ఆగమదివ్యతన్త్ర తన్త్రాన్తర సిద్ధాన్తభేదభిన్నస్య, శ్రీపాఞ్చరాత్రాగమస్య క్వచిదపివేద విరోధాభావాత్ కార్త్స్న్యేన ప్రామాణ్యం. ఏవం వైఖానసాగమోపి. ధర్మశాస్త్రాణ్యపితథైవ. శాణ్డిల్య పరాశర భారద్వాజ వసిష్ఠ హారీతాదయోధర్మశాస్త్ర ప్రణేతారః. శిల్పాయుర్వేద గాన్ధర్వాదికమపియుక్తాంశేతథైవ. శిల్పోనామకక్ష్యాది గోపుర ప్రాకారాదినిర్మాణ ప్రతిపాదకః. ఆయుర్వేదోవైద్యం. గాన్ధర్వోగానాది నిరూపకః. భరతాగమోనృత్తాది విధాయకః. పునశ్చతుష్షష్టికళారూపేషు శాస్త్రేషురర్థోపాయ పురుషార్థోపయుక్తాని ప్రమాణాని. వకుళాభరణాదిసూరి శ్రీసూక్తయఃకార్త్స్న్యేన ప్రమాణతరాః. శ్రీమద్రామానుజాచార్య ప్రభృతిభిః ప్రణీతాః శ్రీభాష్యాది ప్రబన్ధాః ప్రమాణతమాః.

ఆగమము దివ్యతంత్రము ఇత్యాదిభేదభిన్నమగు శ్రీ పాంచరాత్రాగమమునకు ఎచ్చటను వేదవిరోధములేదు. కావున గ్రంధమంతయుఁ బ్రమాణమే. వైఖానసాగమమును అట్లే అంతయుఁబ్రమాణమే.

ఈ రెండాగమములును సాక్షాద్భగవదుక్తములగుటచేఁ బూర్ణప్రమాణములు. ధర్మశాస్త్రములును అట్లే ప్రమాణములు. శాండిల్య పారాశర భరద్వాజ వసిష్ఠ హారీతాదులు ధర్మశాస్త్రములను రచించినవారు. శిల్పము ఆయుర్వేదము గాంధర్వము నాట్యశాస్త్రము మున్నగునవియు నుపయుక్తాంశమునఁ బ్రమాణములు. శిల్పమనఁగా దేవాలయ నిర్మాణమునకు భూమి కర్షణాది గోపుర ప్రాకార నిర్మాణాది విధానమునఁదెల్పు శాస్త్రము. ఆయుర్వేదమనఁగా వైద్యశాస్త్రము. గాంధర్వమనఁగా సంగీత శాస్త్రము. భరతశాస్త్రమనఁగా నృత్యాది బోధకము. అట్లే చతుష్షష్టి కళలలోను తత్త్వోపాయ పురుషార్థములకు ఉపయుక్తమగు నంశములు ప్రమాణములు. పరకాలభరణాది దివ్యసూరుల శ్రీసూక్తులు (ద్రావిడ ప్రబంధములు) సంపూర్ణముగా నత్యంత ప్రమాణములు. శ్రుతి స్మృత్యాదులకంటెను బ్రమాణములని భావము శ్రీ భగవద్రామానుజాచార్యులు, యామునాచార్యులు, మున్నగువారు అనుగ్రహించిన శ్రీభాష్యాది గ్రంధములు అంతకంటెను బ్రమాణతమములు.

పురుషస్వాతన్త్ర్యాధీన రచనావిశేష విశిష్టం పౌరుషేయం, ఏతేన కావ్యనాటకాలఙ్కారాదికమపి వ్యాఖ్యాతంస్యాత్. ఏవ మాప్తేనోచ్చారితాన్యాకాఙ్క్షాయోగ్యతాసత్తిమల్లౌకిక వాక్యాన్యపి ప్రమాణాని – యథానద్యాస్తీరే పఞ్చ ఫలానిసన్తీత్యాదీని.

పురుషుని స్వేచ్ఛానుసారముగా రచింపఁబడిన గ్రంధములు పౌరుషేయములు ఆకాంక్ష, యోగ్యత సన్నిధి అనునవిగల లౌకిక వాక్యములును బ్రమాణములు. "నదియొడ్డున నయిదు పండ్లు గలవు" ఇత్యాది వాక్యములు అట్టివే.

ఏవం వైదిక లౌకిక వాక్యసాధారణం వాక్యం ద్వివిధం – ముఖ్యవృత్తి గౌణవృత్తి భేదాత్. ముఖ్యవృత్తిరభిధావృత్తిః యథాసింహశబ్దస్య మృగేన్ద్రే. సాఽభిధావృత్తిః యోగరూఢ్యాదిభేదేన బహువిధా. ముఖ్యార్థబాధేసతితదాసన్నవృత్తిరుపచారః. సచద్వివిధః – లక్షణాగౌణభేదాత్. ప్రథమోయథా – గఙ్గాయాం ఘోష ఇత్యత్రాధికరణస్య బాధాత్తీరేలక్షణా. ద్వితీయోయథా – సింహో దేవదత్త ఇత్యత్రదేవదత్తే శౌర్యాదిగుణయోగాత్.

వైదిక లౌకిక సాధారణమయిన యీ శబ్దము ద్వివిధమగు వృత్తిచే నర్థబోధకమగును. ఆవృత్తులు ముఖ్యవృత్తి గౌణవృత్తియని రెండు విధములు. "సింహము" అను శబ్దము ముఖ్యవృత్తిచే సింహమును బోధించును. అదియే యభిధావృత్తి యనంబడును. అది యోగము, రూఢి, యోగరూఢి అను భేదముల వలన త్రివిధము. "పాచకుఁడు" అను రీతిని అవయవార్థనిరూపితమగు శక్తి యోగమనియు "మణి" యన్నగురీతిని సముదాయార్థ నిరూపితమగుశక్తి రూఢియనియు (పంకజము మున్నగు రీతిని) తెలియనగును.

ముఖ్యార్థము బాధితమగునపుడు ముఖ్యార్థముతో సంబంధముగల యర్థమునుబోధించు వృత్తియౌపచారిక (గౌణ) వృత్తియగును. లక్షణ, గౌణి, యని అది రెండు విధములు. "గంగాయాం ఘోషః" అనుచోట "గంగయందు గొల్లపల్లె" అని యర్థమగుచున్నది. కాని గంగయందు అనఁగా గంగాప్రవాహమునందు గొల్లపల్లెయుండుట కుదురదు. కనుక "గంగాయాం" అనుపదమునకు గంగయందు అను నర్థము బాధితమయ్యెను. అపుడు గంగాపదమునకు గంగాసామీప్య సంబంధముగల "గంగాతీరమున" అను నర్థమును బోధించు వృత్తియే లక్షణావృత్తి యనఁబడును అపుడు గంగాతీరమున గొల్లపల్లె అను అబాధితమగునర్థము సంభవించును అట్లే "దేవదత్తుఁడు సింహము" అనుచోట దేవదత్తుఁడు సింహమగుట సంభవింపదు కావున "సింహము" అను పదమునకు ముఖ్యార్థము బాధితమయ్యెను. అపుడు "సింహము" అను పదమునకు "సింహమువంటి శౌర్యాదిగుణములు గలవాఁడు" అను నర్థము సంభవించును. అట్టి యర్థమును బోధించువృత్తియే గౌణవృత్తి యగును. సాదృశ్య ప్రయోజకములయిన శౌర్యాది గుణములనుబట్టి వర్తించిన వృత్తి కావున గౌణవృత్తియయ్యెను.

ఏవం వైదిక లౌకక రూపం సర్వం వాక్యజాతం సవిశేషవిషయకం. భేదవిషయకం చ.

లౌకికములును వైదికములును అని ద్వివిధములుగానున్న సమస్త వాక్యములును సవిశేషవస్తువునే బోధించును. అట్లు భేదమునే ప్రతిపాదించును. శబ్దము పదము వాక్యము అని ద్వివిధము. పదమునను ప్రకృతి ప్రత్యయము అని రెండు భాగములుగలవు "పాచకః" అను పదమున పచ్ ధాతువు ణ్వుల్ ప్రత్యయమును గలవు అందు ధాతువునకు పచనము, ప్రత్యయమునకుఁ గర్తయు నర్థములు. ఆ రెండును గూడి "పచనకర్తా" అను అర్థమును బోధించును. పాచక శబ్దమువలన పచనకర్తృత్వము అను విశేషముతో (ధర్మముతో) గూడిన యర్థమే బోధితమగుచున్నది. ఇట్లు ఒక్క పదమే సవిశేషమగు నర్థమును బోధించునపుడు పదసముదాయ రూపమగు వాక్యము సవిశేషవస్తు బోధకమనుటలో సంశయములేదు. విశేషము - విశిష్టము అను రెండంశములును భిన్నములు కావున భేదము అవర్జనీయముగాఁ బ్రతిపాదితమగును. సవిశేష విషయకము అనుటతోడనే భేదవిషయకమనియు నవగతమగుచున్నది. పచనము, తత్కర్తయను రెండంశములును భిన్నములేకదా :

శరీరవాచక శబ్దానాం యథాశరీరిణి పర్యవసానం - ఏవం భగవచ్ఛరీర భూతబ్రహ్మరుద్రాగ్నీన్ద్రాది చిద్వాచకశబ్దానాం. తథాతచ్ఛరీర భూతప్రకృతి కాలాకాశప్రాణాద్య చిద్వాచకశబ్దానాం, చ శరీరిణి పరమాత్మని నారాయణే పర్యవసాన ముపపాదయన్త్యాచార్యాః. వేదాన్తజ్ఞానాద్వ్యుత్పత్తిః పూర్వత ఇత్యుక్తం.

లోకమున శబ్దములు శరీర వాచకములుగానున్నను శరీరిపర్యంతమును బోధించును. దేవోయం, మనుష్యోయం, ఇత్యాదులలో దేవ మనుష్యాది శబ్దములు దేహాది శరీరాంతర్గత జీవవాచకములుకావు దేవ మనుష్యాది శరీరవాచకములే. కేవల జీవులు అన్నిశరీరములయందును ఒక్కరీతినే యుందురు వారికి భేదకమేమియునులేదు. అందరు జీవులును జ్ఞానస్వరూపులే కావున నాశబ్దములు శరీరవాచకములని తెలియఁబడుచున్నది. దేవత్వ మనుష్యత్వములు శరీర ధర్మములే. అయినను "దేవాః సుఖినః" మనుష్యాః దుఃఖినః ఇత్యాది వ్యవహారము

వలన సుఖదుఃఖములు శరీరధర్మములు కావు కనుక దేవమనుష్యాది శబ్దములు కేవల శరీరవాచకములు కాక శరీరవిశిష్ట శరీరిపర్యంతాభిధానముగలవని నిశ్చయింపవలయును. శరీరికి (ఆత్మకి) శరీరము అపృథక్సిద్ధ విశేషణము కనుక "దేవోహం - మనుష్యోహం" ఇత్యాది వ్యవహారములు కుదురుచున్నవి. కావున శరీరవాచకశబ్దములకు శరీరి పర్యంతాభిధానము సమ్మతము. సముచితమును. అట్లే భగవచ్ఛరీర భూతులయిన బ్రహ్మరుద్రాగ్నీంద్రాది చిత్పదార్థములను జెప్పు శబ్దములకును అట్లే భగవచ్ఛరీర భూతములగు ప్రకృతి కాలాకాశ ప్రాణాద్య చిత్పదార్థవాచక శబ్దములకును శరీరియు పరమాత్మయునగు శ్రీమన్నారాయణుని యందే పర్యవసానము. అని పూర్వాచార్యులు ఉపపాదించుచున్నారు. ఇట్లు వేదాంత జ్ఞానమువలననే శబ్దముల యర్థజ్ఞానము పూర్ణము అగుచున్నది. అనఁగా శబ్దములకు పరమాత్మ పర్యంతవాచకత్వము ముఖ్యమని తెలియఁబడును. కావుననే (వేదాన్త జ్ఞానాత్ వ్యుత్పత్తిః పూర్యతే) వేదాంత జ్ఞానమువలన వ్యుత్పత్తి పూర్ణముగా తెలియును అని చెప్పఁబడియున్నది. వ్యాకరణ వ్యవహారాదుల వలన శబ్దార్థజ్ఞానము సమగ్రముగాఁ గలుగదు. బాహ్యపదార్థమే తెలియఁబడును. వేదాంత జ్ఞానమువలన పదముల సంపూర్ణార్థమగు సర్వశరీరక పరమాత్మబోధకత్వము తెలియునని భావము.

నారాయణస్య సర్వశబ్దవాచ్యత్వం సర్వశరీరకత్వ మిత్యాదికంతూప రీశ్వర పరిచ్ఛేదే ప్రతిపాదయామః.

నారాయణుఁడు సర్వశబ్దవాచ్యుఁడనియు, సర్వశరీరకుండనియు నీశ్వర నిరూపణమున నుపపాదింతుము. సర్వశబ్దములకును శరీరి పర్యంతాభిధానముకలదని చెప్పితిమి. సర్వశరీరములకును నారాయణుఁడే శరీరి (ఆత్మ) కదా ! కావున సర్వశబ్దములును శరీరియగు నారాయణునే బోధించుననుట యుపపన్నమేయగును.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం శబ్దనిరూపణం నామ తృతీయోవతారః.

ఇది శబ్దనిరూపణమను తృతీయావతారము.

——— × ———

## చతుర్థోవతారః

ప్రమాణనిరూపణానన్తరం ప్రమేయం నిరూప్యతే ప్రకర్షేణ మేయం. ప్రమేయం తచ్చద్వివిధం – ద్రవ్యాద్రవ్యభేదాత్. ఉపాదానం ద్రవ్యం. అవస్థాశ్రయ ఉపాదానం.

**ప్రమాణములను నిరూపించిన యనంతరము ప్రమేయము నిరూపింపబడుచున్నది. ప్రకర్షముగా మేయమగునది ప్రమేయము. ప్రమాణగ్రాహ్యము ప్రమేయమగును.**

**ద్రవ్యము అద్రవ్యము అని ప్రమేయము ద్వివిధము. ద్రవ్యముపాదానమగును. అవస్థాశ్రయము ఉపాదానమగును. ఘటమునకు మట్టి యుపాదానము. మట్టి పిండ కపాలాద్యవస్థాభేదముల కాశ్రయమగుచున్నది. కావున నది యుపాదానమునవస్థాశ్రయమునగును. కావున ద్రవ్యమగును. గుణాశ్రయము ద్రవ్యమని ద్రవ్యలక్షణము కావచ్చును.**

నను ద్రవ్యగుణ కర్మసామాన్యేత్యాదినా మతాన్తరే షోఢాపరిగణనాత్ కథం ద్రవ్యాద్రవ్యభేదేన ద్విధా సమర్థనమితిచేత్. ఉచ్యతే – ఉత్క్షేపణాపక్షేపణాకుఞ్చనప్రసారణగమనభేదాత్ కర్మపఞ్చధా వ్యవస్థిత మితికల్పనే గౌరవాత్, చలనాత్మకం కర్మేత్యేకస్యైవోపపత్తేః, తస్యాపి సంయోగమాదాయోపపత్తేః.

**నైయాయికాదులు ద్రవ్యము గుణము కర్మము సామాన్యము విశేషము సమవాయము అభావము అని ఏడు పదార్థముల నంగీకరించి యుండగా మీరు ద్రవ్యము అద్రవ్యము అని రెండే పదార్థముల నంగీకరించుట యెట్లని శంకింపరాదు. కర్మాది పదార్థములను పృథక్పదార్థములుగా నంగీకరింప నక్కరలేదు ఎట్లన –**

**కర్మ అను పదార్థము నంగీకరించి దానిని ఉత్క్షేపణము (మీదికిఁ ద్రోయుట) అవక్షేపణము (క్రిందికిఁ ద్రోయుట) ఆకుంచనము**

(ముడుచుకొనుట) ప్రసారము (చాచుట) గమనము (పోవుట) అవి పంచ విధమని వారంగీకరించిరి. కాని అది యనావశ్యకమయిన గౌరవము (పెంపుదల). దానిని అంతను ఒక్కవిధముగాఁ జల స్వరూపము కర్మఅనియే చెప్పవచ్చును. అట్లురాక చలనములోని దిగ్భేదముచేఁ బంచవిధత్వము నొప్పినచో దశదిక్కులనుబట్టి పదివిధములు కర్మ'' అనియుఁ జెప్పవలసి వచ్చును కనుక చలనాత్మకము కర్మ అనుట యుచితముకదా! అదియు సంయోగము అన్నను సరిపోవుచుండఁగా కర్మయని వేరొకపదార్ధము నంగీకరింప నక్కరలేదు.

కర్మవలన సంయోగము జనించునుకదా! ఆకర్మకుఁ గారణము ప్రయత్నము, లేదా అదృష్టము. సంయోగమునకుఁ బ్రయత్నాదృష్టాదులే కారణమనవచ్చునుగదా। ప్రయత్నమువలనఁగర్మ. కర్మవలన సంయోగము. అని మధ్యభాగమునఁ గర్మను గల్గించుటయే వ్యర్థకము. కావున గర్మపదార్ధము సంయోగముచే గతార్ధము కావునఁ బ్రత్యేక పదార్ధముగా నంగీకరింపఁబనిలేదు.

సంస్థానమేవజాతిరితి సంస్థానాతిరేకి సామాన్యానఙ్గీకారాత్.

సామాన్యము అనఁగా జాతి. ఇదియు నొక పదార్థాంతరముగా నితరులంగీకరించిరి. అనేక వస్తువులందుండు ధర్మమును అనఁగా గోత్వఘటత్వాదులను జాతియందురు. కాని మన మతమున నవయవ సంనివేశమే (సంస్థానమే) జాతియనియు దానికంటె భిన్నమగు జాతియను పదార్ధము లేదనియు సిద్ధాంతమగుటచే సామాన్యము పృథక్పదార్ధము కాదు.

సమవాయే సమవాయాఙ్గీకారేఽనవస్థానా, త్తస్యాపి సంయుక్తవిశేషణతా మాదాయోపపత్తేః.

సమవాయమును వేరొక పదార్ధముకాదు ఘటఘటత్వాదుల సంబంధము సమవాయమని సప్తపదార్ధవాదుల యభిప్రాయము. కాని

యది సరికాదు. అపృథక్ వస్తువులగు ఘటఘటత్వాదులకంటె భిన్నమగు సమవాయమను సంబంధ మెచ్చటను గానరాదు. "ఘటము ఘటత్వ విశిష్టము" అను ప్రతీతివలన సమవాయ సంబంధ మంగీకరింత మన్నచో సమవాయవిశిష్టము అను ప్రతీతి వలన సమవాయమునకు మరియొక సమవాయము దానికింకొక సమవాయము అనురీతి ననేకసమవాయముల నంగీకరించుటయను ననవస్థాదోషము పట్టును. కావున సంయుక్త విశేషణత్వమే సమవాయమనంబడును గాని యదియొక పృథక్పదార్థముకాదు.

జీవేశ్వరయో రణుత్వ విభుత్వాదివిభాజక ధర్మాన్తరేణ విశేష ఇతి కించిత్వాదాఙ్గీకారే గౌరవం, చ కర్మసామాన్య విశేషసమవాయానాం పృథక్త్వేనా నఙ్గీకారాత్ ద్రవ్యమద్రవ్యమితి ద్విధా విభాగ ఉపపద్యతే. ఏతేన అభావస్సప్తమ పదార్థ ఇత్యపినిరస్తం.

నిత్య పదార్థములకు పరస్పరభేదమును దెల్పు ధర్మము విశేషమనునది యొక పదార్థముకలదని సప్తపదార్థవాదుల మతము జీవుఁడు ఈశ్వరుఁడు అను నిత్యపదార్థముల భేదకముగా విశేషము నొక్కదాని నంగీకరింప నక్కరలేదు. వానియందుగల అణుత్వము విభుత్వము మున్నగునవియే వానికి భేదకములగుచుండ వేరుగా విశేషమును దానిని భేదకముగా నంగీకరింపనక్కరలేదు. సమానాకారములయి అనఁగా అణువులయియున్న జీవులలోఁ బరస్పర భేదకము విశేషము తప్ప వేరొక్కటిలేదని తలంపరాదు. అట్టివానికి దేశకాలాద్యుపాధికృత భేదము కలదు కావున విశేషము నంగీకరింప నక్కరలేదు. అనావశ్యకమగు విశేషము నంగీకరించుట గౌరవదోషయుక్తమగును.

ఇట్లు కర్మసామాన్య సమవాయ విశేషములను బృథక్పదార్థములుగా నంగీకరింపనందున ద్రవ్యము అద్రవ్యము అని రెండు విధముల విభాగము ఉపపన్నమేయగును. ఇట్లనుటచే నభావమును సప్తమపదార్థముగా నంగీకరించుటయు నిరస్తమేయగును.

అభావస్యభావాన్తరరూపత్వాత్ ప్రాగభావోనామపూర్వావస్థా, ధ్వంస ఉత్తరావస్థా. అత్యన్తాన్యోన్యాభావౌచ ధర్మ్యన్తరగతవిశేష స్వరూపావితి. ఏతస్య ప్రత్యక్షేణ్యర్థాపి ఉక్తః.

అభావము వేరొకభావ పదార్థరూపమేకాని ప్రత్యేకపదార్థముకాదు. భూతలముననున్న ఘటాభావము భూతలరూపమేకాని వేరుకాదు. భావము అభావమెట్లగునని శంకింపరాదు. భావపదార్థము తనయొక్క అభావరూపముకాదు. కాని మరియొక భావపదార్థయొక్క అభావరూపమగుటలో విరోధములేదు భూతలము ఘటాభావరూపమని చెప్పితిమే కాని భూతలాభావ స్వరూపమని చెప్పలేదు కదా! అభావము భావ స్వరూపమనుట మీకును గొన్నిచోట్ల సమ్మతమే. ఘటా భావాభావము ఘటరూపమేయని మీరును అనుచున్నారు. కావున నభావము భావాంతర రూపమనుట సమంజసమే. ప్రాగభావము ఆవస్తువుయొక్క పూర్వావస్థాపరంపరయే అట్లే ప్రధ్వంసాభావము ఉత్తరావస్థాపరంపరయగును. అత్యంతాభావమును అన్యోన్యాభావమును భావాంతర (ధర్మ్యంతర) రూపములే. (భూతలమునఁగల ఘటాత్యంతాభావము భూతలస్వరూపము. ఘటమందలి పటాభావము ఘటస్వరూపము. పటమందలి ఘటాభావము పటస్వరూపమును.) అభావము భావాంతరరూపము కావున భావమువలె నభావమును ప్రత్యక్షమేయగునని చెప్పియున్నాము.

ఉపాదానం ద్రవ్యమిత్యుక్తం - గుణాశ్రయో ద్రవ్యమిత్యపి సామాన్య లక్షణం సమ్భవతి.

ఉపాదానము ద్రవ్యమని చెప్పితిమి. గుణాశ్రయము ద్రవ్యము అని సామాన్య లక్షణము. (అవస్థాశ్రయత్వము ప్రకృతియందు సుప్రసిద్ధము కాలము ఒక్కటియేయయినను ఉపాధి సంబంధముచే క్షణ కలాకాష్ఠాదిభేదమును బొందును గావున నవస్థాశ్రయమగుచున్నది. జ్ఞానము సంకోచ వికాసములనంబడు నవస్థల కాశ్రయమగును జీవునికి శరీరద్వారా బాల్యాద్యవస్థాశ్రయత్వము కలదు. ఈశ్వరునికి స్థూల సూక్ష్మావస్థలంజెందు ప్రకృతిద్వారమున నవస్థాశ్రయత్వముగలదు శుద్ధ

సత్త్వమునకు అవస్థాశ్రయత్వము ప్రసిద్ధమే. కావున నవస్థాశ్రయత్వము ద్రవ్యలక్షణమగుట యుపపన్నమే.

తాని చ ద్రవ్యాణి షట్ — ప్రకృతి కాలశుద్ధసత్త్వధర్మభూతజ్ఞాన జీవేశ్వర భేదాత్. తత్ర జడాజడయోః ద్వయోరపి లక్షణముచ్యతే — అమిశ్రసత్త్వ రహితం జడమితి. తద్ద్వివిధం — ప్రకృతి కాలభేదాత్. తత్రసత్త్వరజస్తమో రూపగుణత్రయాశ్రయః ప్రకృతిః. సా నిత్యాక్షరావిద్యామాయాదిశబ్దవాచ్యా.

ద్రవ్యములు — జడములు అజడములు నని ద్వివిధములు. ద్రవ్యములు — ప్రకృతి, కాలము, శుద్ధసత్త్వము, ధర్మభూతజ్ఞానము, జీవుఁడు, ఈశ్వరుఁడు అని ఆరు విధములు. అందు అమిశ్రసత్త్వ రహితము జడమగును. (ప్రకృతి కాలము జడములు. మిగిలిన నాల్గు ద్రవ్యములును అజడములు.) అజడము ప్రకృతి కాలము అని ద్వివిధము. సత్త్వము, రజస్సు, తమము, అనుగుణత్రయమున కాశ్రయమగు ద్రవ్యము ప్రకృతి యనంబడును. బద్ధజీవులకు జ్ఞానానందములను గప్పిపుచ్చునదియు విపరీత జ్ఞానమును గల్గించునదియు నీప్రకృతియే. ఇది ఈశ్వరునికిఁ గ్రీడాసాధనము. ఇది నిత్య, అక్షర, అవిద్య, మాయ, అను శబ్దములచే వ్యవహరింపఁబడును. ఇది నిత్య కావున అక్షర యనఁబడుచున్నది. జ్ఞానవిరోధి కావున అవిద్యయనియు విచిత్ర సృష్టికారిణి కావున మాయయనియుఁ జెప్పఁబడుట తగియున్నది.

తస్యాః భగవత్సఙ్కల్పాధీనగుణ వైషమ్యాత్ కార్యోన్ముఖావస్థా అవ్యక్తశబ్దేనోచ్యతే. తస్మాత్ మహానుత్పద్యతే. సమహాన్ సాత్త్విక రాజస తామస భేదాత్త్రిధాస్థితః. మహతోఽహఙ్కార ఉత్పద్యతే. సోఽపిసాత్త్వికా హఙ్కారో రాజసాహఙ్కారస్తామసాహఙ్కారశ్చేతి త్రివిధో భవతి. ఏతేషాం త్రయాణాం వైకారికతైజసోభూతాదిరితి నామాన్తరాణ్యపివదన్తి. తేషువైకారిక ఇతిప్రసిద్ధాత్తైజస సంజ్ఞిక రాజసాహఙ్కార సహకృతాత్సాత్త్వికాహఙ్కారాదేకా దశేన్ద్రియాణిజాయన్తే. సాత్త్వికాహఙ్కారోపాదానద్రవ్యకమిన్ద్రియమితీన్ద్రియ లక్షణం. ఇన్ద్రియం ద్వివిధం — జ్ఞానేన్ద్రియం కర్మేన్ద్రియంచేతి. జ్ఞానప్రసరణ శక్తమిన్ద్రియం జ్ఞానేన్ద్రియం. తత్షోఢా — మనశ్శ్రోత్రచక్షుర్ఘ్రాణరసనత్వ

నాఖ్యాని. సుఖాద్యుపకరణమిన్ద్రియం మనః. తచ్చ హృదయప్రదేశవర్తి. బుద్ధ్యహఙ్కార చిత్తాదిశబ్దవాచ్యం. బన్ధమోక్షహేతుభూతం చ. శబ్దాది పఞ్చకే శబ్దమాత్రగ్రహణశక్త మిన్ద్రియం శ్రోత్రేన్ద్రియం. శ్రవణకుహరవర్తి. సర్పాదేస్తు నయనవర్తి. రూపమాత్రగ్రహణశక్త మిన్ద్రియంచక్షుః. నయనవర్తి గన్ధమాత్రగ్రహణశక్త మిన్ద్రియం ఘ్రాణేన్ద్రియం. నాసాగ్రవర్తి. గజాదేః కరాగ్రవర్తి. రసమాత్రగ్రహణశక్త మిన్ద్రియం రసనేన్ద్రియం. జిహ్వాగ్రవర్తి స్పర్శమాత్రగ్రహణశక్త మిన్ద్రియం త్వగిన్ద్రియం. సర్వశరీరవర్తి. నఖదన్త కేశాదిషు ప్రాణమాన్ద్యతారతమ్యాత్ స్పర్శానుపలమ్భః. శ్రోత్రాదీన్ద్రియాణాం భౌతికత్వ ప్రతిపాదనం భూతాప్యాయితత్వే నౌపచారికం. ఏతేషాం విషయ సమ్బన్ధః క్వచిత్సంయోగః-క్వచిత్సం యుక్తాశ్రయణమితి వృద్ధసమ్ప్రదాయః.

ఈ ప్రకృతియందలి గుణములు భగవత్సంకల్పము వలన వైషమ్యమునుబొంది సృష్ట్యనుకూలమగు నవస్థంబొందును. అట్టి యవస్థయే యవ్యక్తమనంబడును. దానినుండి మహత్తు జనించును. ఆమహత్తు సాత్త్వికము రాజసము తామసము అని మూఁడు విధములు. గుణత్రయాశ్రయమగు నవ్యక్తమునందు సత్త్వాదిగుణోన్మేషమువలన సాత్త్వికాదిమహత్తు జనించునని భావము. ఈమహత్తును బుద్ధియనియు నందురు. మహత్తునుండి యహంకారము జనించును. అదియు సాత్త్విక రాజస తామస భేదముచే ముత్త్రివిధములు (దేహాత్మాభిమానాదులు దీనివలననే కలుగును) సాత్త్వికాహంకారమునకు వైకారిక మనియు తామసాహంకారమునకు భూతాది యనియు నామాంతరములు గలవు. వానిలో రాజసాహంకార సాహాయ్యముతోఁగూడిన సాత్త్వికాహంకారము నుండి జ్ఞానేంద్రియము లయిదును గర్మేంద్రియము లయిదును మనస్సు అనఁబడు పదునొకండవ ఇంద్రియమును జనించును. సాత్త్వికాహంకార ముపాదానముగాగల ద్రవ్యము ఇంద్రియము అని యింద్రియలక్షణము. (ఇంద్రియములు జన్మించుటకు రాజసాహంకారము సహకారి కారణము మాత్రమేకాని ఉపాదానముకాదని తెలియనగును) జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు నని యింద్రియములు రెండువిధములు. జ్ఞానమును బ్రసరింపఁజేయు సామర్థ్యముగల యింద్రియములు జ్ఞానేంద్రియములు.

అవి మనస్సు, చెవి, కన్ను, ముక్కు, నాలుక, త్వక్కు అని ఆరు విధములు. తలంపు (స్మృతి) మున్నగువానికి ముఖ్యసాధనము మనస్సు. అది హృదయప్రదేశమున నుండును. దానిని బుద్ధియనియు నహంకారమనియుఁ జిత్తమనియు వ్యవహరింతురు. (అధ్యవసాయము అభిమానము చింత అనువృత్తి భేదమువలన మనస్సునకు బుద్ధ్యాదిసంజ్ఞలు కలుగును) జీవుని బంధమోక్షములకు ఇది హేతువు. (మనస్సువలె ఇతరేంద్రియములును హృదయప్రదేశముననే యుండును. ఆ యా స్థానాంతరములందును వానికి వృత్తిసంభవించును. అనఁగా హృదయమునందే యుండియు ఆయానాడులద్వారా ఆయాప్రదేశములందు సంచరించుటవలన జ్ఞానములు జనించునని గ్రహింపఁదగును ) శబ్దమును మాత్రము గ్రహించు శక్తిగలది శ్రోత్రేంద్రియము. అది మానవులకు చెవియందుండును. పాములకుఁ గండ్లయందుండును. రూపమును మాత్రము గ్రహించు శక్తిగలది చక్షురింద్రియము. అది యన్నిజీవులకును గంటియందుండును. గంధమును మాత్రము గ్రహించు శక్తిగలది ఘ్రాణేంద్రియము. అది ముక్కుననుండును. రసమును మాత్రము గ్రహించుశక్తిగలది రసనేంద్రియము. ఇది నాలుకయందుండును. స్పర్శమును మాత్రము గ్రహించు శక్తిగలది త్వగింద్రియము. ఇది శరీరమంతటను నుండును. నఖ దంత కేశములయందు త్వగింద్రియము వర్తించియున్నను అచట దానిశక్తి తగ్గియున్నందున స్పర్శజ్ఞానము కలుగలేదు. ఇంద్రియములు భౌతికములని కొందరనుచున్నారు. భూతములు వీని కాప్యాయనమును గల్గించుటనుబట్టి యౌపచారికముగా భౌతికములనుట తటస్థించెనే కాని యదార్థముగా నవి భౌతికములుకావు. ఇందిర్త్రియములు విషయములతో సంబంధించినపుడు జ్ఞానము కలుగును కదా ! ఆ సంబంధము ఘటాదులందు సంయోగమును ఘటరూపాదులందు సంయుక్తాశ్రయణమును అగునని పెద్దల యాశయము.

ఉచ్చారణాదిష్వన్యతమక్రియాశక్తత్వం కర్మేన్ద్రియ సామాన్యలక్షణం. తచ్చవాక్పాణిపాదపాయూపస్థభేదాత్ పఞ్చధాఽవస్థితం. వర్ణోచ్చారణ కరణ

మిన్ద్రియంవాక్. సాచహృత్కణ్ఠజిహ్వామూలతాలుదన్తోష్ఠనాసామూర్ధరూపస్థా-
నాష్టకవర్తినీ. మూకాదిష్వదృష్టవిరహాత్తదభావః. శిల్పకరణమిన్ద్రియంపాణిః
సచ మనుష్యాదీనామఙ్గుళ్యగ్రవర్తీ. సఞ్చరణకరణమిన్ద్రియం పాదః. సచ
మనుష్యాదినాం చరణవర్తీ. భుజగపతగాదీనాం ఉరఃపక్షాదివర్తీ. మలాదిత్యాగ
కరణమిన్ద్రియం పాయుః. సచతత్తదవయవవర్తీ. ఆనన్దవిశేషకరణమిన్ద్రియ
ముపస్థః. సచమేహనాదివర్తీ.

"ఉచ్చారణాది క్రియలలో నొక క్రియయందు శక్తిగలది కర్మేంద్రియము" అని కర్మేంద్రియలక్షణము. వాక్కు, పాణి, పాదము పాయువు ఉపస్థ - అని అది యయిదువిధములు. వర్ణముల నుచ్చరించుటకు ముఖ్యసాధనమగు నింద్రియము వాక్కు. అది హృదయముననుకంఠముననుజిహ్వామూలముననుతాలువునందును దంతములయందును. ఓష్ఠములందును. నాసికయందును మూర్ధస్థానముననుఉండును. ఈ స్థానములు ఎనిమిది. మూగాదులందదృష్టము లేనందున నీయింద్రియము లేదు. శిల్పాదులకు ముఖ్యసాధనమగు నింద్రియము పాణి. అది మనుష్యాదులకు వ్రేళ్ళు మున్నగువానియందును. ఏనుగులు మున్నగు వానికి నాసికయందును (తుండమునందును) ఉండును. సంచరణమునకు (నడచుటకు) ముఖ్యసాధనమగు నింద్రియము పాదము, అది మనుష్యాదులకు పాదములందును పాములకు రొమ్ములయందును పక్షులు మున్నగు వానికి రెక్కలు మున్నగు వానియందును నుండును. మలమును విసర్జించుటకు ముఖ్యసాధనముపాయువు. అది యాయా యవయవములయందు నుండును. ఆనందవిశేష ముఖ్యసాధనమగు నింద్రియము ఉపస్థము. అది పురుషచిహ్న స్త్రీచిహ్నములగు నవయవముల యందుండును.

ఏతానీన్ద్రియాణ్యణూని. పరకాయప్రవేశలోకాన్తరగమనాదిషు జీవేన
సహగచ్ఛన్తి. ఇన్ద్రియాణాం ముక్తిదశాయామప్రాకృతదేశగమనాసమ్భవాది
హైవయావత్ప్రళయం స్థితిః. కరణవిధురైరన్యైః పరిగ్రహో వా. కర్మేన్ద్రియా
ణాం శరీరనాశాన్నాశ ఇతిపక్షస్తు భాష్యవిరోధేనహేయః, ఏతేన పరు

షేన్ద్రియ స్త్రీన్ద్రియైకేన్ద్రియవాదః. త్వగిన్ద్రియైకస్వీకార, ఇత్యాదివిమతపక్షా నిరస్తాః.

**ఇంద్రియములు అణుపదార్థములు. కావున నవి మనకు కానరావు. జీవుఁడు పరకాయ ప్రవేశము కావించినపుడును లోకాంతరములకుఁ బోయినపుడును వానితోఁగలసి యింద్రియములును బోవును. జీవుఁడు మోక్షమునకుఁ బోయినపుడు మాత్రము అవి అప్రాకృతదేశమునకుఁ బోఁజాలవు కనుక ప్రళయము వరకును ఇచ్చటనే ఉండిపోవును.** ఇంద్రియము లేనివారెవ్వరయినను నితరులు పరిగ్రహించుటయు సంభవించును. కర్మేంద్రియములు **మాత్రము** శరీరముతోడనే నశించునను నభిప్రాయము భాష్యవిరుద్ధము (భాష్యమునఁ గర్మేంద్రియములు శరీరముతో నశించినను వానికింద్రియత్వము లేకపోలేదని మాత్రమే చెప్పఁబడినట్లు సమన్వయించి కర్మేంద్రియములు శరీరముతోఁగూడ నశించుననియే దానిభావముగాఁ గూడఁ జెప్పవచ్చును. కనుకనే వేదాంతదీపమునఁ గర్మేంద్రియములు జీవునితోఁగలసి వెళ్ళవనియే చెప్పఁబడెను.) స్త్రీంద్రియము పురుషేంద్రియములను భేదమును కొందరంగీకరించిరి. అది సరికాదు. "పంచేంద్రియములు లేవనియు నొక్కయింద్రియమే మనస్సువలె వృత్తిభేదముచే రూపాదులను గ్రహించున"నియు మరికొందఱి యభిప్రాయము. అదియు సరికాదు. అట్లే త్వగింద్రియమొక్కటియే యింద్రియమనియు దానిచేతనే సర్వజ్ఞానములును గల్గుననియుఁజెప్పెడి మతమును సరికాదు.

రాజసాహఙ్కార సహకృతాద్భూతాది సంజ్ఞకతామసాహఙ్కారాచ్ఛబ్దాది పఞ్చతన్మాత్రాణి, ఆకాశాది పఞ్చభూతాని. ఉత్పద్యన్తే. భూతానామవ్యవహిత సూక్ష్మావస్థాపన్నం ద్రవ్యం తన్మాత్రం. తదేవ భూతోపాదానం విశిష్ట శబ్దాది విషయాధికరణం భూతం. తన్మాత్రాణిశబ్ద తన్మాత్రం స్పర్శతన్మాత్రం రూపతన్మాత్రం రసతన్మాత్రం గన్ధతన్మాత్రమితిపఞ్చ. భూతానిచతథా – ఆకాశం వాయుస్తేజ ఆపః పృథివీతి భేదాత్. తత్ర తామసాహఙ్కారాకాశయోర్మధ్యమావస్థా విశిష్టం ద్రవ్యం శబ్దతన్మాత్రం. క్షీర దధ్నోరన్తరాళ పరిణామవత్. తస్మాదాకాశః. అస్పర్శవత్త్వేసతి విశిష్ట శబ్దాధారత్వం,

శ్రోత్రగ్రాహ్యయకత్వ, మవకాశప్రదత్వ, మిత్యాద్యాకాశలక్షణం. సచశబ్దమాత్ర గుణకః. నీలంనభ ఇతిప్రతీతేః ప్రత్యక్షః. పఞ్చీకరణ ప్రక్రియయాచ సావయవో రూపవాన్. ఏతేన ఆకాశస్య అజన్యత్వనిరాసః. సూర్యపరిస్పన్ద యుక్తాకాశస్యైవ ప్రాచ్యాది వ్యవహారోపపత్తౌ దిగితిన పృథక్కల్పనం· దిక్సృష్టిస్త్వన్తరిక్షాది సృష్టివదుపపద్యతే.

రాజసాహంకార సాహాయ్యముతోఁ దామసాహంకారమునుండి పంచతన్మాత్రలును బంచభూతములును జనించును. అనఁగాఁ దామసాహంకారమునుండి భూతముల కుపాదానమగు భూతావ్యవహిత సూక్ష్మవస్థా విశిష్టద్రవ్యము జనించును. అది యే తన్మాత్రము. అదియే భూతముగాఁ బరిణమించును విశిష్టశబ్దాది విషయాధికరణము భూత మనఁబడును. శబ్దతన్మాత్రము, స్పర్శతన్మాత్రము, రూపతన్మాత్రము, రస తన్మాత్రము. గంధతన్మాత్రము అని తన్మాత్రములు అయిదు. భూతములును అట్లే ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి. అనిఅయిదు. వానిలోఁ దామసాహంకారమునకును ఆకాశమునకును మధ్యమావస్థగల ద్రవ్యము శబ్దతన్మాత్రము. పాలు పెరుగుగా మారుటకు మధ్యనున్న యవస్థలోనున్న ద్రవ్యమువంటిదే యీ శబ్దతన్మాత్రము. దానినుండి యాకాశము జనించును స్పర్శవత్త్వము లేక విశిష్ట శబ్దాధారమగుచు శ్రవణానందకరత్వము కలిగియుండునది అకాశము అని ఆకాశలక్షణము. (స్పర్శవత్త్వము లేనిదనుటవలన పృథివ్యాదులయందును, విశిష్టశబ్దాధార మనుటవలన కాలమునందును అతివ్యాప్తి నివారింపఁబడెను) అది ప్రత్యక్షము. శబ్దగుణము మాత్రముగలది. అవకాశమునకు హేతుభూత మగునదియు. "ఆకాశము నల్లగామన్నది'' యనుట వలన రూపమును నాకాశముననున్నదనవచ్చును. సృష్టియంతయుఁ బంచీకరణమును జెందినదియే కావునఁ బృథివ్యాది సంబంధమువలన నీలరూపము గలది కావచ్చును. ఇట్లాకాశము శబ్దతన్మాత్రమునుండి జనించిన దనుటచే ''నాకాశమజన్యమను మతము నిరస్తమయ్యెను. పంచీకరణముచే సావయవత్వమును రూపవత్త్వమును గూడఁ గలదగుటచే నీరూపము కావున నిత్యము'' అనికాని 'నిరవయవము కనుక నిత్యము'ని

కాని చెప్పుటకుదురదు. నైయాయికాదులు నవద్రవ్యములనిరి. వానిలోఁ బంచభూతములను గాలమును మనము ద్రవ్యములలోఁ బరిగణింతుము. ఆత్మను జీవుఁడను ద్రవ్యముగా నంగీకరించినారము. మనస్సును బ్రకృతి పరిణామ ద్రవ్యముగా నంగీకరింతుము ఇంక వారి నవద్రవ్యములలో దిక్కు అనునది కలదు. దానిని బృథగ్ద్రవ్యమనవలసిన పనిలేదు అదియు నాకాశభేదమే. సూర్యుని పరస్పందము (చలనము)చే నాకాశమే తూర్పు మున్నగు వ్యవహారమును బొందుచున్నదని చెప్పుట యుపపన్నమగుచుండగా ''దిక్కు'' అని వేరొక ద్రవ్యము నంగీకరించుట యనావశ్యకము. ఆకాశమువలె దిక్కును భగవత్సృష్టమేయగును. కావున నిత్యమనరాదు.

ఆకాశాత్ స్పర్శతన్మాత్రం. ఆకాశవాయ్వోర్మధ్యమావస్థా విశిష్టం ద్రవ్యం స్పర్శతన్మాత్రం. తస్మాద్వాయుః విశిష్టస్పర్శవత్త్వేసతిరూపరహితత్వం లస్త్రవాది స్పార్శనేన్ద్రియగ్రాహ్య ద్రవ్యత్వం, అనుష్ణాశీతవిశిష్టస్పర్శవత్త్వే సతి రూపరహితత్వ మిత్యాదికం వాయోర్లక్షణం. సచనానా. సలిలాతపకుసుమాదియోగాచ్ఛీతోష్ణ సౌరభాదివ్యపదేశః. త్వగిన్ద్రియాప్యాయకత్వేనోపకరోతి. తస్యశబ్దస్పర్శౌగుణౌ. తత్రశరీర ధారణాది హేతుర్వాయు విశేషః ప్రాణః. సచపఞ్చ ప్రకారః – ప్రాణాపానవ్యానోదాన సమానభేదాత్. హృది ప్రాణః – గుదేఅపానః సర్వశరీరగో వ్యానః కణ్ఠేఉదానః – నాభిదేశే సమాన ఇతినియమోజఙ్గమేష్వేవ. స్థావరేషుతు ప్రాణసమ్బన్ధస్స్వల్ప ఏవ. వాయోస్స్పార్శన ప్రత్యక్షత్వేన అనుమేయవాదనిరాసః. వాయుతేజసోర్మధ్యమావస్థా విశిష్టం ద్రవ్యం రూపతన్మాత్రం. తస్మాత్తేజః. ఉష్ణస్పర్శవత్త్వభాస్వరరూపవత్త్వాదికంతు తేజసోలక్షణం. తస్యబహిః పచనాది హేతుత్వమగ్నిసూర్యాత్మనా, అన్తర్జ్వాలానసంజ్ఞికజాఠరాగ్నిరూపేణ, దివాభీతాదివ్యతిరిక్తానాం చాక్షుషజ్ఞానే ఆలోకద్వారా సహకారిచభవతి. తచ్చతుర్ధా–భౌమం దివ్యమౌదర్యమాకరజంచేతి. తత్రపార్థివేన్ధనం తేజోభౌమం – దీపాది. జలమాత్రేన్ధనం దివ్యం – సూర్యాది. జలపార్థివేన్ధనమౌదర్యం – జాఠరాది. నిరిన్ధనం తేజ ఆకరజం – సువర్ణాది. సువర్ణస్య ద్రవ్యాన్తర సంసర్గాదుష్ణస్పర్శాభావః. ప్రభాస్వాశ్రయాన్యేన ప్రభా ప్రభావాంశ్చేతి విభక్తం. ఆవరణ సదసద్భావాధీనసఙ్కోచ వికాస ప్రసారి

తేజోవిశేషః ప్రభా. సాచపరిభావద్భిస్సహోత్పద్యతే-సహనశ్యతి. ద్రవ్యభూతా గుణభూతాసావయవాచ. అనేన ప్రభాయాః కేవలగుణత్వనిరాసః. ప్రభా విశిష్టం తేజః ప్రభావాన్. సచతుర్విధ ఇతి ప్రతిపాదితం. తత్తేజశ్శబ్దస్పర్శ రూపగుణవచ్చ. తేజస్సలిలయోర్మధ్యమావస్థా విశిష్టద్రవ్యం రసతన్మాత్రం. తస్మాదాపః. శీతస్పర్శవత్త్వం నిర్గన్ధత్వేసతి విశిష్టరసవత్త్వమిత్యాద్యపాం లక్షణం. తాసాంశుక్లమధురశీతైక స్వభావానాం ఆశ్రయాది సంసర్గభేదాద్రూప రసస్పర్శవైచిత్ర్యాలోకః. తాస్సముద్రసరిదాది రూపేణ బహుప్రకారాః. శబ్దస్పర్శరూపరసగుణాశ్చ. దేహసంపిణ్డీకరణాది హేతవః.

ఆకాశమునుండి స్పర్శతన్మాత్రము దానినుండి వాయువును జనించెను. ఆకాశావస్థకును వాయ్వవస్థకును మధ్యమావస్థలోనున్న ద్రవ్యమును స్పర్శతన్మాత్రమందురు. విశిష్టస్పర్శముకలిగి రూపశూన్య మగునది వాయువు. అస్మదాది స్పర్శనైకేంద్రియగ్రాహ్యము వాయువు. (అనఁగాఁ ద్వగింద్రియమునకు మాత్రము గ్రాహ్యమగునది వాయువని యర్థము) చల్లఁదనముగాని వేడిగాని లేని విశిష్టస్పర్శగుణము కలిగి గంధములేనిది వాయువు మున్నగునవి వాయులక్షణములు. (విశిష్ట స్పర్శము కలిగి యనుటవలన రూపాదులందతి వ్యాప్తియు, రూపశూన్య మనుటవలన పృథివ్యాదులందు అతివ్యాప్తియు ప్రథమవాయులక్షణము ననివృత్తములయ్యెను.) వాయువునకు జలసంబంధము వలన చల్లని దనియు ఆతపాది తేజః పదార్థసంబంధము వలన వెచ్చనిదనియు, కుసుమాది సుగంధద్రవ్యావయవ సంబంధముచేఁ బరిమళముగల దనియుఁ బ్రతీతి కల్గునేకాని శీతోష్ణాదులు దానియందు లేవు. అది త్వగింద్రియమునకు ఆప్యాయకమగును. వాయువునందు శబ్దము స్పర్శము అను గుణములుకలవు. అందు శరీరధారణాది హేతువగు వాయువిశేషము ప్రాణము అపానము వ్యానము ఉదానము సమానము అని అయిదు విధములుగా నుండును. వానిలో హృదయప్రదేశమునఁ బ్రాణము గుదప్రదేశమున నపానము సర్వశరీరమునను వ్యాపించి వ్యానము కంఠమున ఉదానము నాభియందు సమానమును ఉండును జంగమములయందు వలె స్థావరములయందును ప్రాణసంబంధము (ప్రాణము ఉండుట) సమానమే. వాయువు స్పర్శన ప్రత్యక్షమగును.

అనుమాన ప్రమాణ గోచరమనుమాట నిరస్తము. వాయు తేజస్సుల మధ్యమావస్థావిశిష్టమగు ద్రవ్యము రూపతన్మాత్ర మనఁబడును దాని నుండి తేజస్సు జనించును. ఉష్ణస్పర్శముగలది తేజము, లేదా భాస్వర రూపముగలది తేజము. అనునవి తేజోలక్షణములు. అది బయట అగ్నిరూపమునను సూర్యరూపమునను బచనాదులకు హేతువగును. శరీరములోపల వైశ్వానరము అను పేరుగల జఠరాగ్ని రూపమునఁబచన హేతువగును. గుడ్లగూబ మున్నగువానికితప్ప ఇతర ప్రాణులకుఁ జాక్షుషజ్ఞానమునకు వెలుగు రూపమున సహకరించును. ఈ తేజస్సు భౌమము దివ్యము ఔదర్యము ఆకరజము అను భేదములతో నాల్గు విధములు. వానిలోఁ బృథక్పదార్థములగు ప్రత్తి కట్టెలు మున్నగునవి యింధనముగాఁగల తేజస్సు భౌమమనఁబడును. దీపము మున్నగునవి అట్టివే. జలము మాత్రము ఇంధనముగాఁగలది దివ్యము సూర్యాది తేజస్సు అట్టిదే. పార్థివమగు నాహారము, జలము ఇంధనముగాగలది ఔదర్యము అది జఠరాగ్ని. ఇంధనములేని తేజము ఆకరజమగు సువర్ణాదికము. సువర్ణమునందుఁ బృథివీపదార్థము అధికముగాఁగలసి యున్నందున వేడిలేదు. (పంచీకరణ ప్రక్రియచే నితరభూతములతో మిశ్రితమయిన తేజఃపదార్థమే కదా వ్యష్టిప్రపంచమునఁ గాన్పించును.) ఆతేజస్సు సామాన్యముగాఁ బ్రభయనియుఁ బ్రభావత్తనియు విభజింపఁ దగును. ఆవరణము అనఁగా అడ్డుఉండుటచే సంకోచమును అదిలేనిచో వికాసమును బొందెడి ప్రసరణస్వభావమునుగల తేజోవిశేషము ప్రభ యగును. అది ప్రభావత్తులతోఁ గూడఁ బుట్టును. వానితోనే నశించును. ఇది ద్రవ్యము గుణము కూడ నగును, సావయవమును అగును. అందు వలనఁబ్రభ కేవల గుణమనుట సరికాదు. (రూపమువలె ప్రభావత్తగు వేరొక ద్రవ్యమును ఆశ్రయించియుండునది కావున గుణమగును తన కాశ్రయద్రవ్యమగు దీపాదులను విడిచి తత్సమీప ప్రదేశమున నుండుట చేతను రూపము కలుగుటచేతను అది ద్రవ్యమును అగుచున్నది.) అట్టి ప్రభతోఁగూడియున్న తేజస్సు ప్రభావత్తు అగును. తేజస్సు శబ్దస్పర్శ రూపములు అను మూడు గుణములు కలిగియుండును తేజస్సు నుండి రసతన్మాత్రమును దానినుండి జలమును జనించెను. తేజస్సులిలముల మధ్యమావస్థలోనున్న ద్రవ్యమే రసతన్మాత్రమనఁబడును. చల్లని

స్పర్శము కలిగియుండుట, వాసనలేకయుండి విశిష్టరసముకలిగియుండుట, అనునవి జలలక్షణములు. జలమునకు సహజముగా మాధుర్యము రసము, రూపము తెలుపు, స్పర్శగుణము చల్లదనము. అయినను ఆశ్రియాదుల సంసర్గమమున రూపరసస్పర్శములు మారుచుండును. జలము సముద్రము నదుల మున్నగు రూపములతో బహువిధము. దీనియందు శబ్దస్పర్శ రూపరసములు అను నాల్గుగుణములు ఉండును. చల్లుటకును ముద్దగాఁ చేయుటకును ఇది సాధనము

అప్పృథివ్యోర్మధ్యమావస్థావిశిష్టం ద్రవ్యంగన్ధతన్మాత్రం. తస్మాత్ పృథివీ. విశిష్టగన్ధవత్త్వం, రసత్త్వేసతి అనుష్ణాశీత స్పర్శవత్త్వ, మిత్యాది పృథివీలక్షణం. సాసుగన్ధి మధుర కృష్ణరూపానుష్ణాశీతస్పర్శవతీ. పాకభేదాద్వి చిత్రివర్ణగన్ధరసాచ. మనోఘ్రాణాప్యాయక త్వేనోపకరోతి. మృత్పాషాణా న్నౌషధాది బహుప్రకారవతీ. శబ్దస్పర్శరూపరసగన్ధగుణకా ధారణహేతుశ్చ.

జలమునుండి గంధతన్మాత్రమును దానినుండి పృధివియును జనించును సలిలపృధివీపదార్థముల మధ్యమావస్థలోనున్న ద్రవ్యము గంధతన్మాత్రమనంబడును. విశిష్టగంధవత్త్వము దానిలక్షణము; రసము కలిగియుండియు విశిష్టస్పర్శము కలిగియుండుటయు పృధివీలక్షణమగును. అది గంధము, మాధుర్యము నలుపు మున్నగురూపము, చల్లదనము వేడియుఁగాని స్పర్శము అను గుణములు కలిగియుండును. పృధివి యందుఁదేజస్సు యోగమువలనఁగలిగిన పాకమువలన విచిత్రవర్ణము లును విచిత్రరసములును గలుగును. ఇది మనస్సునకును ఘ్రాణము నకును అప్యాయనము కలిగించుటలో నుపకరించును. ఈ పృధివియే మట్టి రాయి అన్నము ఔషధము మున్నగు రూపములలో బహువిధ ముగానుండును. దీనియందు శబ్ద స్పర్శ రూప రస గంధములను నయిదు గుణములు నుండును. ధారణమునకిది హేతువు.

తమసః పృథివ్యామన్తర్భావః — తద్గుణత్వాత్ తదవస్థాన్తరత్వాచ్చ. అతఏవ ఆలోకాభావహేతుత్వం — నద్రవ్యాన్తరమిత్యాదికక్షనిరస్తాః.

తమస్సు (చీకటి) వేరొకపదార్థమనుట సరికాదు. ఇది పృథివి గుణమగు కృష్ణరూపముకలది కనుక పృథివ్యంతర్భూతమే. పృథివి యొక్క యవస్థాంతరమే యగుటచేతను నిది పృథివియే యగును. ప్రకృత్యవస్థావిశేషమే తమముకదా! దాని యవస్థావిశేషములలో వాయ్వాకాశములయందు రూపములేదు కనుక నాపదార్థములలో నిది చేరదు. సలిలతేజస్సులందు నీలరూపములేదు కావున వానియందును జేరదు. నీలరూపము గలది ప్రాకృతపదార్థములలో నొక్కపృథివియే. కావునఁ దమస్సు పృథివ్యవస్థాంతరమే యనుట యుపపన్నమగును. చక్షుస్సునకుఁ బదార్థమును గ్రహించుటకు ఆలోకసహకార మావశ్యకమే అయినను వస్తుస్వభావ విశేషమువలనఁ దమస్సును గ్రహించుటకు మాత్రమనావశ్యకము. కావున నాలోకాభావమే తమస్సనియు. తమస్సు ద్రవ్యాంతరమనియుఁ జెప్పెడి మతములు అనాదరణీయములు.

భూతేషు సర్వత్ర పఞ్చీకరణ ప్రక్రియయా గుణానాముపలమ్భః.

భూతములయందు అన్నింటను బంచీకరణ ప్రక్రియచేత శబ్దాది గుణములు కానవచ్చుచుండును.

పఞ్చీకరణ ప్రక్రియా తు భగవాన్ భూతాని సృష్ట్వా ఏకైకమేవ భూతం ద్విధా కృత్వా ద్వయోర్భాగయోస్స్వ భాగమేకం నిధాయ భాగాన్తరం చతుర్ధా కరోతి- తాన్ భాగాన్ భూతాన్తరేషు చతుర్షు యోజయతి. ఏవం సర్వేషు క్రియమాణేషు ఏకైకస్య భూతస్యార్ధం స్వభాగః - అర్ధాన్తరం చతుర్ణాం భూతానాం భాగసముచ్చయో భవతి. తథా చ స్వభాగస్య భూయస్త్వాత్, పరభాగస్యాల్పీయస్త్వా, చ్చ పృథివ్యాదివ్యపదేశః. వేదే త్రివృత్కరణోపదేశస్తు పఞ్చీకరణస్యాప్యుపలక్షణం. భూతైస్సాకం మహదహఙ్కారౌ మిళిత్వా సప్తీకరణమిత్యప్యాహుః.

పంచీకరణప్రక్రియ యీక్రిందితీరున నుండును. భగవంతుఁడు ముందుగాఁ బంచభూతములను సృష్టించి, ఒక్కొకభూతమును రెండేసి సమభాగములు కావించి, ఆరెండు భాగములలో నొకభాగమును ఒకచో నుంచి రెండవ యర్ధభాగములను నాల్గేసి భాగములుకావించి యానాల్గు

భాగములను మిగిలిన నాల్గు భూతభాగములలోను కలుపును. ఇట్లే అన్ని భూతములను గలుపఁగా నొక్కొక భూతమునఁ దనభాగము సగమున్ను మిగిలిన నాల్గుభూతముల భాగములును మిగిలిన యర్ధభాగమును అగును. అనఁగాఁ బ్రతిభూతమునందును ఎన్మిది భాగములలో నాల్గు భాగములు స్వాంశమును మిగిలిన నాల్గు భాగములును మిగిలిన నాల్గుభూతములును అయియుండునని గ్రహించునది. అన్ని భూతములును ఇట్లే ఇతర భూతములన్నింటితోఁ గలిసియున్నను అధికభాగము గల భూతముగా వ్యవహరింపఁ బడుచుండును. "తాసాంత్రివృతంత్రివృతమేకైకాంకరవాణి" ఇత్యాదిగా వేదమునంజెప్పఁబడిన త్రివృత్కరణము పంచీకరణమునకు ఉపలక్షణము. పంచభూతములతో మహదహంకారములనుగూడ కలిపి సప్తీకరణమనియుఁ జెప్పుదురు.

ఏతేషుచతుర్వింశతి సఙ్ఖ్యాకేషు పఞ్చభూతాని ప్రకృతిమహదహంకారాశ్చ శరీరోత్పాదకాని. ఏకాదశేన్ద్రియాణి ప్రత్యేకం సఙ్ఖ్యాతాని ప్రతిపురుషం భిన్నాని ఆభరణార్పితరత్నానీవ శరీరమాక్రమ్యతిష్ఠన్తి.

ఈ యిరువదినాల్గు తత్త్వములలో (ప్రకృతి, మహత్తు, అహంకారము, 11 ఇంద్రియములు, పంచతన్మాత్రములు, పంచభూతములు) పంచభూతములును ప్రకృతి, మహదహంకారములును శరీరమునకుపాదాన కారణములగును. ఏకాదశేంద్రియములు ఆభరణములలోఁ బొదుగబడిన రత్నములవలె శరీరమునందుఁ గూడియుండును. ఇవి ప్రత్యేకముగా నసంఖ్యాకములు ప్రతి పురుషునికి వేర్వేరుగానుండును.

శరీరం నామచేతనంప్రత్యాధేయత్వ విధేయత్వ శేషత్వ నియమైరపృథక్సిద్ధో ద్రవ్యవిశేష ఇత్యేకం లక్షణం — నియమేనయదాధేయత్వం — నియమేనయద్విధేయత్వం — నియమేనయచ్ఛేషత్వం — తదితిలక్షణత్రయం వాయోజ్యం.

చేతనమునకు నియతముగా నాధేయమును విధేయమును శేషభూతమును నగుచు నపృథక్సిద్ధమగు ద్రవ్యవిశేషము శరీరము – అని

శరీరలక్షణము. అపృథక్సిద్ధమనఁగా ఆ వస్తువు ఉన్నంత కాలము సంబంధము విడివడకయుండునది. విధేయమనంగా నియమింపఁ బడునది. ఆధేయమనఁగా నాశ్రయించియుండునది విశేషమనంగా నంగభూతమయినది. చేతనుఁడనఁగాఁ జైతన్యవిశిష్టుఁడు అనఁగా జీవుఁడు, నీశ్వరుఁడును, చేతనునికిఁ దానువసించు శరీరము తనకాధేయము. అనఁగాఁ తన్నాశ్రయించి నియమముగానుండునది. అట్లే శరీరము చేతనునికి నియామ్యము. అనఁగా నియమింపఁదగినదియు, నంగభూతమును అగుచున్నది ఇది శరీరమునకొక లక్షణము

ఇదియే మూడు లక్షణములుగా విభజింపవచ్చును. అనఁగా నీలక్షణమున నాధేయత్వ విధేయత్వ శేషత్వములు మూఁడును ఘటితములు వానిలో నేయొక్కదానితో ఘటితమయినను లక్షణము సరిపోవును అందువలన నిది మూఁడు లక్షణములుగాఁగూడఁ జేయవచ్చును. అనఁగాఁ జేతనునికి నియతముగా నేదియాధేయమో యది శరీరము లేదా చేతనునికి నియతముగా నేది విధేయమో యది శరీరము లేదా చేతనునికి నియతముగా నేది శేషభూతమో యది శరీరము అని లక్షణత్రయము సంభవించును. నియతమనఁగా నపృథక్సిద్ధముగా ననియర్థము. దీనివలనఁదేలిన నిష్కృష్టలక్షణముల నిట్లు తెలియఁదచును.

(1) ఏ చేతనునికి ఏ యవస్థగల ద్రవ్యము ఉన్నంతకాలము (అసంబంధానర్హమగుచు) సంబంధము విడఁదీయరాని దగుచుఁదనకు శక్యమయినపనిలో నియమింపఁదగిన స్వభావము కలదయియుండునో ఆయవస్థగల ద్రవ్యమతనకి శరీరమగును. శరీరము శరీరావస్థనువిడచి భస్మాద్యవస్థం జెందినపుడు చేతనుని సంబంధమును విడుచును గావున అసంబంధానర్హము కాకపోవలసివచ్చును. అందులకై "ఏయవస్థగల ద్రవ్యము" అను విశేషణము చేర్పఁబడెను. "ఉన్నంతకాలము" అనుట వలన పరకాయము, ప్రాణము మున్నగునవి శరీరములు కాఁజాలవు. పరకాయము ఈచేతనునికి ముందువెనుకలనుండవచ్చును ప్రాణాదులను అట్లే "తనకు శక్యమయినపనిలో" అనుటవలన నసంభవదోషమురాదు.

తన శరీరమునుగూడఁ గొన్నిపనులలోనే నియమింపఁగల్గును. అన్ని పనులలోను నియమింప సాధ్యముకాదు. మానవశరీరమాకాశగమనమున నియమింప శక్యముకాదుగదా! ఇట్లే ఏచేతనుని కేయవస్థగల ద్రవ్యము ఉన్నంతకాలము ధరింపదగియుండునో అతనికి ఆయవస్థగల ద్రవ్యము శరీరము అవియు లక్షణాంతరము. లేదా - ఏచేతనునకి ఏయవస్థగల ద్రవ్యము ఉన్నంతకాలము శేషత్వముగలదగునో యాతనికది శరీరము అవి మూఁడవలక్షణము అగును శిలాకాష్ఠాదులయందును జీవుఁడుండును గావున అవి వానికి శరీరములగుటలో బాధకములేదు. ఈ లక్షణము లన్నియు స్వరూపలక్షణములు.

ఈశ్వరతజ్ఞానవ్యతిరిక్త ద్రవ్యమితివాతటస్థ లక్షణం.

దీనికిఁ దటస్థలక్షణమునుగలదు. "ఈశ్వరుఁడు నాతనిజ్ఞానమును దప్ప మిగిలిన ద్రవ్యము శరీరము" ఇది తటస్థలక్షణము. జీవుఁడు, ప్రకృతి, నిత్యవిభూతి, కాలము అనునవి శరీరత్వయోగ్యములు కావున లక్షణము సరిపడును.

ఏతేనచేష్టాశ్రియశ్శరీరం, ఇన్ద్రియాశ్రియశ్శరీరం, భోగాయతనం శరీరం, శిరఃపాణిపాదావ్యవయవ సముదాయశ్శరీర, మిత్యాదీని పరోక్తాని శరీరలక్షణాని నిరస్తాని.

ఇట్లనుటచేత చేష్టాశ్రియము శరీరము, ఇంద్రియాశ్రయము శరీరము, భోగాయతనము శరీరము, శిరఃపాణిపాదాదిమయము శరీరము. మున్నగు లక్షణములు సరికావని యూహింపనగును. చేష్టయనఁగా "క్రియ" అని భావించినచో నది ఘటాదులందును నుండును కావున ఘటమును శరీరము కావలసివచ్చును. కావునఁ జేష్టాశ్రియము శరీర మనుట సరిపడదు. ఇంద్రియములకు సమవాయ సంబంధముచే నాశ్రయ మని చెప్పినచో ఇంద్రియావవయములుగూడ శరీరము కావలసివచ్చును. ఇంద్రియమునకును దదవయవములకును సమవాయసంబంధము కలుగదు గదా. సంయోగసంబంధముచే నింద్రియాశ్రయమన్నచో ఘటాదులను

ఇంద్రియ సంయుక్తములు కావున నివికూడ శరీరములు కావలసివచ్చును. కనుక ఇంద్రియాశ్రయము శరీరమ''ను లక్షణమును కుదురదు. భోగాయతనము శరీరమను లక్షణమును భోగస్థానములగు గృహాదులందతివ్యాప్తము కావున సరిపడదు. శిరఃపాణిపాదాదిమయము శరీరము అనులక్షణము బొమ్మలయందును అతివ్యాప్తమగును. ఇట్లీయాశరీరలక్షణములు దోషగ్రస్తములు కావునఁ బరిత్యాజ్యములు.

శరీరం ద్వివిధం నిత్యమనిత్యమితి. నిత్యం త్రిగుణ ద్రవ్యకాలజీవ శుభాశ్రయాదికమీశ్వర శరీరం, నిత్యసూరినాం స్వాభావిక గరుడభుజగాది రూపం, చ. అనిత్యం ద్వివిధం - అకర్మకృతం కర్మకృతం చేతి. ప్రథమమీశ్వరస్య మహదాదిరూపం, తథాఽనన్తగరుడాదీనాం ముక్తానామీశ్వరస్యచ ఇచ్ఛాగృహీతం తత్తద్రూపం, కర్మకృతమపి ద్వివిధం - సఙ్కల్ప సహకృత కర్మకృతం, కేవల కర్మకృతం చేతి. పూర్వం మహతాం సౌభరిప్రభృతీనాం. ఇతర దన్యేషాం. పునస్సామాన్యేన ద్వివిధం స్థావరజఙ్గమభేదాత్. స్థావరాశ్శిలావృక్షగుల్మాదయః. జఙ్గమం చతుర్ధా - దేవమనుష్యతిర్యఙ్నారకి భేదాత్. ఉద్భిజ్జస్వేదజాణ్డజజరాయుజభేదాఅపి విభాజకధర్మాః. అయోనిజ శరీరాణ్యపిసన్తి.

నిత్యము అనిత్యము అని శరీరము ద్వివిధము. అందుఁద్రిగుణద్రవ్యము కాలము జీవుఁడు శుభాశ్రయ మనఁబడు నీశ్వర శరీరమును నిత్యములు. గరుఁడుడు శేషుఁడు మున్నగు నిత్యసూరుల శరీరమును నిత్యమే. అనిత్య శరీరమును అకర్మకృతము కర్మకృతము అని ద్వివిధము. మహదహంకారాది రూపమగు నీశ్వరశరీరము అకర్మకృతమగు ననిత్యశరీరము. అనంతగరుడాదులు తమ యిచ్ఛానురూపముగా ధరించిన యాయా రూపములుకూడ ననిత్యాకర్మకృతశరీరములే. కర్మకృత శరీరమును ద్వివిధము. ఒకటి స్వసంకల్పసహకారముగల కర్మవలన నిర్మితము. రెండవది కేవల కర్మకృతము సౌభరి మున్నగువారి శరీరము సంకల్ప సహకృత కర్మకృతము. ఇతరుల శరీరములు కేవల కర్మకృతములు. మరల నిది స్థావరశరీరము జంగమశరీరము అని రెండు విధములనుండును. స్థావరములనఁగా శిలలు, చెట్లు, పొదలు,

లతలు మున్నగునవి. జంగమ శరీరములు నాల్గు విధములు అవి దేవయోనులు, మనుష్యులు తిర్యక్కులు, నారకులు అనువారి శరీరములు. (అసుర యక్ష రాక్షసాదులు దేవయోనులు. భూలోకమునందు బ్రహ్మ క్షత్రియాదులు మనుష్యులు. మృగములు పక్షులు సరీసృపములు మున్నగునవి తిర్యక్కులు, రౌరవాది నరకములందు పాపానుభవమును బొందుచున్నవారు నారకులు) శరీరములు ఉద్భిజ్జములు స్వేదజములు జరాయుజములు అండజములు అనియు నాల్గు తెరగులుగా నుండును. ఉద్భిజ్జములనఁగా భూమిని జీల్చుకొని పుట్టునట్టి తరుగుల్మాదులు. స్వేదజములనఁగా ఊష్మము (ఉక్క) వలన జనించు క్రిమికీటకాదులు. జరాయుజములనఁగా యోనిజాతములయిన పశువులు మనుష్యులు మున్నగువారు అండజములనఁగా గ్రుడ్డువలనఁబుట్టు పక్షులు బల్లులు మున్నగునవి అయోనిజాత శరీరములునుగలవు. బ్రహ్మ మధుకైటభులు మున్నగు దేవజాతివారును, దృష్టద్యుమ్నుడు ద్రౌపది మున్నగు మానవ జాతివారును, ఐరావతము, స్వేదజములగు క్రిమికీటకాదులు తిర్యక్కులును అయోనిజములు.

(ఈ శరీరములన్నియు నీశ్వరునికి శరీరములే ఈశ్వరునికి శరీరములగుటలోఁ గొన్ని సద్వారకములు కొన్ని యద్వారకములును. అనఁగా నీశ్వరునికిఁగొన్ని సాక్షాచ్ఛరీరకములును మరికొన్ని జీవునిద్వారా శరీరములును అగును. జీవుని శరీరములయిన అస్మదాదుల హస్తపాదాదులు ఈశ్వరునికి జీవునిద్వారముగ శరీరములు. హస్తపాదాదులు జీవునికి నియామ్యములుగదా! ఆ జీవుఁడు ఈశ్వరునికి నియామ్యుఁడు, అయినను నిద్రావస్థయందును మూర్ఛావస్థయందును జీవునివలె జీవుని శరీరముకూడ ఈశ్వరునికి సాక్షాత్తుగా నియామ్యమే కావున సద్వార శరీరమేయగును. ఇట్లు జీవశరీరము ఈశ్వరునికి సద్వారకముగను అద్వారకముగను గూడ శరీరమగునని కొందఱి యభిప్రాయము. కాని జీవశరీరము సుషుప్త్యాదులందును జీవద్వారకముగనే నియామ్యమగు ననియు నాకారణమున జీవశరీరమెల్లపుడును సద్వారక శరీరమేయనియుఁ గొందఱందురు. భగవద్దివ్యమంగల విగ్రహాదుల శరీరత్వము ఎప్పుడును అద్వారకమే యగును)

ఏవం పఞ్చీకృతానామేవాణ్డోత్పాదకత్వం. అణ్డోత్పాదాత్పూర్వసృష్టి స్సమష్టిసృష్టిః అనన్తరసృష్టి ర్వ్యష్టిసృష్టిః.

వెనుక చెప్పిన తీరునఁ బంచభూతసృష్ట్యనంతరము పంచీకృతము లయిన భూతములతోడనే అండముల నీశ్వరుడు సృష్టించును. అండ సృష్టికిఁ బూర్వసృష్టియంతయు సమష్టిసృష్టియందురు. అనఁగా నిరువది నాల్గు తత్త్వముల సృష్టియు సమష్టిసృష్టియే. ఆ పిమ్మట పంచీకృత పంచభూతములతో బ్రహ్మాండసృష్టి జరిగించును. అది మొదలు జరిగిన బ్రహ్మేంద్రాదులసృష్టి వ్యష్టిసృష్టియనఁబడును. ప్రత్యేక భిన్నశక్తులు గల పంచభూతములు నొకదానితో నొకటి కలియక ప్రజాసృష్టికి సమర్థములుకావు. కనుక పంచీకరణముచే భూతములను మేళవించి వానితో నండములను ఈశ్వరుఁడు నిర్మించును.

మహదాదీనా ముత్పత్తిర్నామ తాళపలాశ ఘటజ్కాన్యాయేనావస్థాన్తరాపత్తిరేవ. సేనా వన రాస్యాదివ్యవహారవత్పూర్వాపరావస్థా విశేష సమ్బన్ధ మాత్రేణ కార్యకారణభేద వ్యవహారః. తత్రపూర్వావస్థా ప్రహాణేనవిజాతీయావస్థా ప్రాప్తౌ తత్త్వాన్తరవ్యపదేశః పృథివీపర్యన్తమేవ.

ప్రకృతినుండి మహత్తుమున్నగునవి జన్మించుటయనఁగా నవస్థాభేదమును బొందుటయే. మాటిరేకను బొమ్మగాను కర్ణభూషణముగాను చేసినట్లే అదియే వస్తువు అవస్థాంతరమును బొందుటయే మహదాదుల యుత్పత్తియగును. భటుల సమూహము సేనయనియు వృక్షములనేకము లున్నచో వనమనియు నొకజాతివస్తువులు అనేకములు కూడినచో రాశి యనియు వ్యవహరింతుము. అట్లే మహదాదులకును నామాంతర వ్యవహారము కల్గెను. పూర్వావస్థా సంబంధముచే కారణమనియు నుత్తరావస్థా సంబంధముచేఁ గార్యమనియుఁ గార్యకారణ భావము వ్యవహృతమయ్యెను. అందుఁ బూర్వావస్థనువిడచి విజాతీయమగు నవస్థాంతరము కల్గినచో వేరొకతత్త్వమని వ్యవహారము సంభవించును. అట్టివాడుక పృథివీభూతమువరకునే.

ఇత్థం ప్రకృతి మహదహఙ్కారైకాదశేన్ద్రియ తన్మాత్ర పఞ్చక భూత పఞ్చః విభాగేన చతుర్వింశతి తత్త్వాని వర్ణితాని. ఏతేనన్యూనాధిక సఙ్ఖ్యాత త్త్వ వాదినో బాహ్యాః పాశుపతాశ్చ నిరస్తాః. పరమాణు కారణవాదినోపి.

ఇట్లు చతుర్వింశతి తత్త్వములను వివరింపఁబడెను. ఇట్లనుటచేఁ దత్త్వములు ఇరువదినైదుకంటెఁ దక్కువయనువారును ఎక్కువ అను వారును నిరసింపఁబడిరి.

తత్త్వములసంఖ్య పలువురు పలువిధములుగాఁ జెప్పిరి. అంతయు శూన్యమే యనియుఁ గావునఁ దత్త్వము శూన్యమే యనియు బౌద్ధుల వాదము, బ్రహ్మమొక్కటియే తత్త్వమని మాయావాదులు పలుకుదురు. స్వతంత్రము అస్వతంత్రము అని రెండే తత్త్వములని మాధ్వుల యభి ప్రాయము పృథివి, సలిలము, తేజస్సు, వాయువు, అని నాల్గే తత్త్వములని చార్వాకులందురు. వెనుక చెప్పిన ఇరువదినాల్గు తత్త్వము లను జీవుఁడును గలసి ఇరువది యయిదు తత్త్వములని నిరీశ్వర సాంఖ్యులును, ఈశ్వరునితోఁ గలసి ఇరువది యారు తత్త్వములని సేశ్వర సాంఖ్యులును జెప్పుదురు

ప్రకృతి పరిణామమే జగత్తు అనుటచేఁ బరమాణు కారణత్వ వాదులగు నైయాయికులు నిరస్తులయిరి.

ప్రకృత్యాదయః ఈశ్వరస్యజీవస్యచభోగ్య భోగోపకరణ భోగస్థానాని భవన్తి. భోగ్యానివిషయాః. భోగోపకరణానితు చక్షురాదికరణాని, భోగస్థానాని చతుర్దశభువన సహితాన్యణ్డాని. అణ్డం నామకపిత్థఫలాకారం పఞ్చీకృత పఞ్చ భూతారబ్ధం ప్రారబ్ధకృత ద్రవ్యం. తద్యథా - పద్మాకారాభూః. కర్ణికా కారా మేరుః. మేరోర్దక్షిణతో భారత కింపురుష హరివర్షాణి. ఉత్తరతో రమ్యక హిరణ్యక మేరువర్షాణి. పురతో భద్రాశ్వవర్షం. పశ్చాత్కేతు మాలవర్షం. మధ్యేత్విలావృతం. ఏవం నవవర్షయుక్తం జమ్బూద్వీపం లక్షయోజనవిస్తీర్ణం సమపరిమాణేన లవణసిన్ధునావృతం. ససిన్ధుర్ద్విగుణేన సప్తవర్షాత్మకేన ప్లక్ష ద్వీపేనవేష్టితః. సోపీక్షు సముద్రేణ. సోఽబ్ధిశ్శాల్మలీద్వీపేన. సపునస్సురా సముద్రేణ. సకుశద్వీపేన. ససర్పిస్సముద్రేణ. సోపి క్రౌఞ్చ ద్వీపేన.

సదథ్యర్ణవేన. సోపిశాకద్వీపేన. సచక్షీరార్ణవేన. సోపివర్షద్వయ విభాజక వలయాకార మానసోత్తర పర్వతసహితేన పుష్కరద్వీపేన. సశుద్ధజలార్ణవేన. ఏవం ద్వీపానాముత్తరోత్తర ద్వైగుణ్యం దష్టవ్యం. ప్లక్షద్వీపాదయశ్చ సప్తవర్షాత్మకాః.

ప్రకృతి మున్నగునవి ఈశ్వరునికిని జీవునికిని భోగ్యములు, భోగపకరణములు. భోగస్థానములు నగును. భోగ్యములనఁగాఁ దామనుభవింపఁదగిన వస్తువులు. అట్టివి శబ్దస్పర్శాది విషయములు. భోగోపకరణములనఁగా భోగముల ననుభవించుటకు సాధనములయిన కన్ను చెవి మున్నగు నింద్రియములు. భోగస్థానములనఁగా ననుభవించుటకు నిర్ణీతములయిన స్థానములు, అవి పదునాలు లోకములు మధ్యభాగమునఁగల బ్రహ్మాండ సమూహములు పంచీకరణముం బొందిన పంచభూతములతో వెలగపండు ఆకారముతో రచింపఁబడిన ప్రకృతివికారద్రవ్యమే అండమనఁబడును.

అది యెట్లన భూమి పద్మమువలె నుండును. పద్మకర్ణికవలె మధ్యభాగమున మేరువుండును. ఆమేరుపర్వతమునకు దక్షిణభాగమున భారత, కింపురుష, హరివర్షములు అను దేశములు ఉండును. ఉత్తర భాగమున రమ్యక, హిరణ్యక. కురువర్షము లుండును, తూర్పున భద్రాశ్వవర్షమును, బశ్చిమమునఁ గేతుమాలవర్షమును మధ్యభాగమున ఇలావృతవర్షమును గలవు. ఇట్లు తొమ్మిది వర్షములతోఁగూడినది జంబూ (నేరేడు) ద్వీపము. ఇది లక్ష యోజనముల విస్తారముగలది, దీనికిఁజుట్టును లక్ష యోజనముల పరిమితిగల ఉప్పుసముద్రము కలదు, ఆ సముద్రమునకుఁ జుట్టును రెండు లక్షల యోజనముల విస్తారముగల ప్లక్ష (జువ్వి) ద్వీపముగలదు. దానియందేడు వర్షములుండును, దాని చుట్టును చెరకురసముగల సముద్రములుండును. దానిచుట్టును శాల్మలి (బూరుగు) ద్వీపముగలదు. దాని చుట్టును కల్లుసముద్రము కలదు. దానిచుట్టును కుశ (దర్భ) ద్వీపమును, దానిచుట్టును నేతి సముద్రమును దానిచుట్టును క్రౌంచ (పక్షివిశేషము) ద్వీపమును దానిచుట్టును పెరుగు సముద్రమును దానిచుట్టును శాక (కూర) ద్వీపమును దానిచుట్టును

పాలః సముద్రమును దానిచుట్టును పుష్కర (తామరపూవు) ద్వీపమును నుండును ఈ ద్వీపము రెండు వర్షములుగా విభజింపఁబడియున్నది. అందు వలయాకారముగానున్న మానసోత్తర పర్వతమును గలదు. ఆద్వీపము చుట్టును మంచినీటి సముద్రము కలదు. ద్వీపములన్నియు వరుసగా నొకదానికంటె నొకటి రెట్టింపు విస్తారముకలది. అనఁగా జంబూద్వీపము లక్షయోజనముల విస్తారముకలది కాఁగా రెండు లక్షల యోజనముల విస్తారము ప్లక్షద్వీపమునకు నాల్గు లక్షల యోజనముల విస్తారము శాల్మలిద్వీపమునకును, ఎనిమిదిలక్షల యోజనముల విస్తారము కుశద్వీపమునకును, పదునారు లక్షల యోజనముల విస్తారము క్రౌంచ ద్వీపమునకును, ముప్పదిరెండు లక్షల యోజనముల విస్తారము శాక ద్వీపమునకును అరువదినాల్గు లక్షల యోజనముల విస్తారము పుష్కర ద్వీపమునకును బరిమితియని తెలియవగును. ప్లక్షద్వీపాదు లయిదును ఏడేసి వర్షములు గలది. అనఁగా ముప్పదియయిదు వర్షములు. జంబూ ద్వీపమునందలి తొమ్మిది వర్షములను గలుప మొత్తము సప్తద్వీపము లందును నలువదియారు వర్షములగును.

సప్తద్వీపాత్మకోయం ద్విగుణాయాకాఞ్చన భూమ్యావృతః. కాఞ్చన భూమిస్తులోకాలోకపర్వతేన. సపర్వతస్తమసా. తమోగర్భోదకేన. తతోణ్డ కటాహః.

సప్తద్వీపాత్మకమగు నీభూమి ద్విగుణ పరిమాణముగల బంగారు భూమితోఁ జుట్టఁబడియుండును. దానిచుట్టును లోకాలోక పర్వతమును దానిచుట్టును గాఢాంధకారమును దానిచుట్టును గర్భోదకమును నుండును. ఆదియుండు కటాహముచేఁ జుట్టబడియుండును. ఇది భూమియొక్క పార్శ్వభాగ వివరణము

ఏవం భూమేరధః అతల వితల సుతల తలాతల మహాతల రసాతల పాతాళ భేదాత్ సప్తలోకాః. అధోనరకాః. తేచపాపకర్మణాం పాపానుభవ భూమయోరౌరవాద్యాః ముఖ్యతయా ఏకవింశతి పరిభేద్యాః. తతోగర్భోదకం. తతోణ్డ కటాహః.

ఇట్టి భూమికిఁ గ్రిందిభాగమున అతలము వితలము రసాతలము తలాతలము మహాతలము సుతలము పాతాళము అను నేడు లోకము లుండును. వీని క్రిందిభాగమున ముఖ్యముగా నిరువదియొక భేదము గల రౌరవాది నరకలోకములుండును. అది పాపాత్ముల పాపానుభవ స్థానములు. వానిక్రింద నంధకారమును దానిక్రింద గర్భోదకమును దానిపిమ్మట నండకటాహమును నుండును ఇది భూమి క్రిందభాగము వివరణము.

భూమేరుపరి లక్షయోజనాత్సూర్యమణ్డలం. తావద్భువర్లోకః. తదుపరి చన్ద్రమణ్డలం తస్మాదుపరి నక్షత్రమణ్డలం. తతోబుధశుక్రమణ్డలం. తతోఽఙ్గారక బృహస్పతి శని సప్తఋషి మణ్డలాని. తదుపరి ధ్రువలోక ఇత్యేతత్పర్యన్తం స్వర్లోకః. చతుర్దశలక్షోపరికోటి యోజనోచ్ఛ్రాయో మహర్లోకః. తస్మాద్ద్విగుణో జనోలోకః. తతశ్చతుర్గుణస్తపోలోకః. తస్మాద్దశకోట్యుచ్ఛ్రాయస్సత్యలోకః. తతస్తమోగర్భోదకమణ్డకటాహశ్చ.

భూమికి ఊర్ధ్వభాగమున లక్షయోజనములకు సూర్యమండలము కలదు. అదియే భువర్లోకము. దాని మీదఁజంద్రమండలము, దాని మీఁద నక్షత్రమండలమును దాని మీద బుధ శుక్రాంగారక బృహస్పతి శనిగ్రహ మండలములును దానిపైని సప్తర్షిమండలమును దాని మీఁద ధ్రువమండలమునుగలవు. సూర్యమండలము మొదలు ధ్రువలోకము వరకు మన్నది స్వర్లోకము. ఆమీద నాల్గులక్షల యోజనములకుఁబయిని కోటియోజనములు ఎత్తుగలది మహర్లోకము. దానికి రెట్టింపు అనఁగా రెండుకోట్ల యోజనముల ఎత్తుగలది జనలోకము. దానికి నాల్గురెట్లు యోజనముల యెత్తుగలది తపోలోకము. దానిమీద పండ్రెండుకోట్ల యోజనముల యెత్తుగలది సత్యలోకము. దానిమీద నంధకారము. ఆపైని గర్భోదకము. ఆపైని అండకటాహము ఉండును.

ఏవం తిర్యగూర్ధ్వ ప్రమాణేన పఞ్చాశత్కోటియోజనత్వం భూమేరుక్తం భవతి. శతకోటియోజన విస్తీర్ణత్వ వాదో మానభేదేన. అణ్డకటాహః కోటియోజనోచ్ఛ్రాయః. తదణ్డం దశోత్తరావరణైరావృతం. ఏతాదృశాన్యణ్డాన్యనన్తాని జలబుద్బుదవద్యుగపదీశ్వరసృష్టాని. ఈశ్వరస్య చతుర్ముఖ పర్యన్తం సృష్టిరద్వారికా – అనన్తరం సద్వారికేతి విభాగః. విస్తరస్తు పురాణరత్నాదిషు ద్రష్టవ్యః. ఇతి ప్రకృతిర్నిరూపితా.

ఇట్లు అడ్డముగను మీదుభాగమును కొలతచే ఏబదికోట్ల యోజనములు భూమికిఁ బరిమాణము చెప్పఁబడెను. శతకోటి యోజనముల విస్తారము కలదనుమాట వేరొక మానముచేతనని గ్రాహ్యము. అండకటాహము మాత్రము కోటి యోజనముల ఎత్తుగలది. ఆ అండము పది యుత్తరావరణములతోఁ గూడియుండును. ఇట్టి అండములు నీటిబుడగలవలె నస్థిరములు, అనంతములును. ఇవి ఒక్కసారి ఈశ్వరునిచే సృజింపఁబడినవి.

ఈశ్వరుఁడు చతుర్ముఖ సృష్టివరకును అద్వారకముగనే సృష్టించును. ఆ తరువాత సృష్టియంతయు సద్వారకము, అనఁగా చతుర్ముఖుని ద్వారమున సృష్టించును. ఈసృష్టి విస్తరమంతయు విష్ణుపురాణాదులయందు తెలియఁదగును, ఇట్లు ప్రకృతి నిరూపింపఁబడెను.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం ప్రకృతి నిరూపణంనామ
చతుర్థోఽవతారః.

ఇది ప్రకృతి నిరూపణమనఁబడు చతుర్థావతారము.

——×——

## పఞ్చమోవతారః

అథాచిద్విశేషః కాలోనిరూప్యతే - కాలోనామగుణత్రయ రహితోజడ విశేషః. సచనిత్యో విభుః. భూతభవిష్యద్వర్తమాన భేదేన త్రివిధః. యుగ పత్క్షిప్రక్రమాది వ్యపదేశహేతుః. నిమేషకాష్ఠా తత్పరా వినాడీకలాఘటికా ముహూర్త దివసపక్షమాస ఋత్వయన సంవత్సరాది వ్యవహారహేతుశ్చ.

**అచిద్ద్రవ్యములలో నొకటియగు ప్రకృతి వెనుకటి యవతారమున వివరింపఁబడెను. ఇంక నచిద్విశేషమగు కాలమును నిరూపింతుము.**

కాలము సత్త్వరజస్తమోగుణములు లేని యొక జడద్రవ్యము. అది నిత్యము. సృష్టికిపూర్వమే కాలమున్నట్లు శ్రుతి బోధించుచున్నది. 'సదేవసోమ్య ఇదమగ్ర ఆసీత్'' అను శ్రుతిలో అగ్రే అనగా ''సృష్టి పూర్వకాలమున" అని వ్యవహరింపబడుటచేతను, అట్లే ''నాసదాసీత్ నోసదాసీత్తదానీమ్'' అను శ్రుతిలో తదానీం = అనగా సృష్టి పూర్వకాలమునందు అనియు వ్యవహరింపఁబడుటచే సృష్టికిఁబూర్వమే కాలము కలదని స్పష్టమగుచున్నది. కావున నది నిత్యము ''అనాదిర్భగవాన్కాలోనాన్తోస్యద్విజవిద్యతే'' అను పరాశరోక్తి వలనను అది నిత్యమని నిర్ణీతము. ''విద్యాకాలోభవత్కృతౌ'' ఇత్యాదులలో కాలముత్పన్నమయ్యెననుట దాని యుపాధ్యుత్పత్తినే చెప్పునుగాని కాలోత్పత్తినిచెప్పదు. కావున కాలము నిత్యము కాలము అన్నిపదార్థములతోడను గూడి యుండును గావున "విభువు" నగును గడచినది. నడచుచున్నది, రాబోవునది అని యాకాలము త్రివిధము అనఁగా భూతభవిష్యద్వర్తమాన వ్యపదేశముకలది. ఈ కాలమునుబట్టియే వేగము విలంబము, ఒక్కసారి ఇత్యాది వ్యవహారములు సంభవించును. అంతియకాక నిమేషము (రెప్పపాటు కాలము) కాష్ఠ. (15 నిమేషములు) కల. (30 కాష్ఠలు) ముహూర్తము (30 కలలు) దినము, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము మున్నగు వ్యవహారములకు ఈ కాలమే హేతువగుచున్నది.

మనుష్యమానేన మాసః పితౄణాం దినం. తేషామమావస్యా మధ్యాహ్నం. మనుష్యమానేన సంవత్సరో దేవానాందినం. తేషా ముత్తరాయణ మహః - దక్షిణాయనం రాత్రిః. ఏవం దేవమానేన ద్వాదశవర్ష సహస్ర సఙ్ఖ్యాకం చతుర్యుగ మిత్యుచ్యతే. తత్ర చతుస్సహస్రసఙ్ఖ్యాకం కృతయుగం. తత్ర పూర్ణోధర్మః. తత్ర త్రిసహస్రసఙ్ఖ్యాకం త్రిపాదధర్మవత్త్రేతాయుగం. ద్విసహస్ర పరిమితం ద్విపాదధర్మవద్ద్వాపరం. సహస్రసఙ్ఖ్యాక మేకపాద ధర్మయుతం కలియుగం. ఏతేషాం సన్ధిర్ద్విసహస్రసఙ్ఖ్యాకః. ఏవమ్భూత చతుర్యుగ సహస్రాణి బ్రహ్మణోదివస ప్రమాణం. ఏవం రాత్రిః.

మనుష్యుల మాసము పితృదేవతల కొకదినము (అహోరాత్రములు) అమావాస్య వారికి మధ్యాహ్నసమయము. మనుష్యుల సంవత్సరము దేవతల కొకదినము (అహోరాత్రము). వారికందుత్తరాయణము పగలు దక్షిణాయణము రాత్రి. ఇట్టి దేవమానముచే పండ్రెండువేల సంవత్సరముల కాలము చతుర్యుగ మనఁబడును. అందు నాల్గువేల సంవత్సరముల కాలము కృతయుగము. ఆ కాలమున ధర్మము పూర్ణముగా నుండును. మూఁడువేల సంవత్సరముల కాలము త్రేతాయుగము. అందు ధర్మము మూఁడు పాదములును ఒకపాద మధర్మమునుండును రెండువేల సంత్సరముల కాలము పరిమితిగలది ద్వాపరయుగము అందొకటి నరపాదములు ధర్మమును రెండు నరపాదము లధర్మమును నుండును. ఒక వేయి సంవత్సరములు కలియుగము. ఇందొక పాదము ధర్మమును మూఁడు పాదము లధర్మమును ఉండును. ఈయుగ చతుష్టయ పరిమితి యిట్లు పదివేల సంవత్సరములు. ఈ యుగముల సంధికాలము రెండువేల సంవత్సరములు. అందు కృతయుగమునకుఁ బూర్వసంధి నాల్గువందలను బరసంధి నాల్గువందలును సంవత్సరములు. త్రేతాయుగమునకుఁ బూర్వోత్తరసంధులు (సమముగా) నారువేల సంవత్సరములు. ద్వాపరమునకు రెండు సంధులను నాల్గువేల సంవత్సరములు. కలియుగ సంధికాలములు రెండు వందల సంవత్సరములు. ఇట్లీ యుగ సంధికాలములు రెండువేల వర్షములను గలియఁగాఁ జతుర్యుగకాలము పండ్రెండువేల సంవత్సరములగును. ఇట్టి చతుర్యుగములు ఒక వేయి

అయినచోఁ జతుర్ముఖుని కొక పగలగును. అతని రాత్రియు నిట్లే వేయి చతుర్యుగములకాలము

బ్రహ్మణోఽహ్ని చతుర్దశ మనవః. తథేన్ద్రాస్సప్తర్షయశ్చ. ఏకైకమనో రేక సప్తతి చతుర్యుగ పరిమాణకాలః. ఏవం బ్రహ్మమానేన బ్రహ్మణశ్శత వర్ష జీవిత్వం. ఏతత్సర్వం కాలాధీనం. ఏవం నిత్యనైమిత్తిక ప్రాకృతాది ప్రళయా అపి కాలాధీనాః.

చతుర్ముఖుని యొక పగటికాలమునఁ బదునల్గురు మనువులు జనింతురు ఇంద్రులును సప్తర్షులను గూడఁ బదునల్గురేసి జనింతురు. ఒక్కొక మనువు డెబ్బదియొక్క చతుర్యుగముల కాలము జీవించు చుందురు. బ్రహ్మయాయుర్దాయముకూడ బ్రహ్మమానము ననుసరించి నూరు సంవత్సరముల కాలము ఇది యంతయుఁగాలాధీనము. ఇట్లే నిత్య ప్రళయములు, నైమిత్తిక ప్రళయములు ప్రాకృత ప్రళయము లును గూడఁ గాలాధీనములే.

కాలస్య స్వకార్యం ప్రతి స్వస్యోపాదానత్వం. అఖణ్డకాలో నిత్యః- ఖణ్డకాలాః పునరనిత్యాః. ఏవం భూతః కాలః ఈశ్వరస్య క్రీడాపరికరో భవతి. లీలావిభూతావీశ్వరః కాలాధీన ఏవ కార్యంకరోతి - నిత్యవిభూతౌతు కాలస్య విద్యమానత్వేపిస్వాతన్త్ర్యేణ. కేచిత్కాల ఏవ నాస్తీతివదన్తి - అన్యేతు తామసోమహాన్ కాలఇతి. ఉభయేషామాగమబాధః ప్రత్యక్షబాధశ్చ.

అఖండకాలము నిత్యము నిమేషకలాకాష్ఠాది రూపమయిన కాలము కార్యమనంబడును. దీనికి అఖండకాలము ఉపాదానమగును. (కనుకనే కాలమునకు ద్రవ్యత్వము సంభవించుచున్నది.) ఈనిమేషాది కార్య సంజ్ఞకమగు కాల మనిత్యము. ఇట్టికాల మీశ్వరునికిఁ దనక్రీడలకు సాధన విశేషము. లీలలకు సహకారి కారణమగును సత్యసంకల్పుఁడగు నీశ్వరుఁడు లీలావిభూతియందు సృష్టిస్థితి సంహారాదులగు తన లీలలను తాను నిర్ణయించిన కాలపరిమాణాదుల ననుసరించియే కావించును. కాన నీశ్వరునికి కాలము క్రీడాపరికరమగుటయు నీశ్వరునికిఁ గాలాధీనత్వమును సిద్ధించుచున్నదని యూహింప నగును. లీలావిభూతిలో నీశ్వరుఁడు

కాలాధీనుడయి సృష్టికావించుచున్నను నిత్య విభూతియందు మాత్రము కాలము ఉన్నను దానికి స్వాతంత్ర్యము లేదు "నకాలస్తత్రవై ప్రభుః" అని చెప్పబడియున్నది కొందఱు నిత్యవిభూతియందుఁ గాలములేదని యందురు మరి కొందరు మహత్తత్త్వములోని తామసరూపము కాలమని చెప్పుదురు. ఈ రెండు పక్షములును శాస్త్రవిరుద్ధములును ప్రత్యక్షబాధితములు నగును.

షడిన్ద్రియవేద్యః కాలఇత్యాచార్యాః తేన అనుమేయవాది నిరాసః. ఇతి కాలోనిరూపితః.

కొందఱు కాలమారింద్రియములకును గ్రాహ్యామగునని యందురు అనఁగాఁ గాలము ప్రత్యక్షమని భావము కాలమింద్రియ గోచర పదార్థములకు విశేషణముగా భాసించుచున్నది. విశేష్యమింద్రియగోచరమయినపుడు విశేషణమును ఇంద్రియగోచరమనుటలో సంశయములేదు. "ఈ ఘటము క్షణకాలము ఉన్నది." అను ప్రతీతి ప్రత్యక్షమును కదా! ఈ ఘట ప్రత్యక్షమున ఘటవిశేషణమగు రూపము (రూపరహితమయినను) ప్రత్యక్షమేకదా! అట్లే ఘటవిశేషణమగు కాలమును ప్రత్యక్షమేయగును. ఏతత్కాలీన ఘటము అనునపుడు కాలము విశేషణమగుచున్నదిగదా! "ఇది యిపుడు స్పృశింపఁబడుచున్నది" "ఇది యిపుడు వినఁబడుచున్నది." ఇత్యాదిరీతిగాఁ ద్వక్ శ్రోత్రాది ప్రత్యక్ష విషయమును అగును కొందఱు కాలమనుమేయమనిరి అది సరికాదు మీదఁజెప్పిన తీరువఁ బ్రత్యక్షమగుచుండగా ననుమేయమనట కుదురదు. ప్రత్యక్ష ప్రతీతిలో విశేషణమగు కాలము అనుమేయమన్నచోఁ బ్రత్యక్ష విషయములగు ఘటాదులును అనుమేయము లనవలసివచ్చును వహ్నివి ధూమముచే ననుమానించినపుడు "వహ్నిమాన్ పర్వతః" అను ప్రతీతి ప్రత్యక్షము కాజాలదుకదా. కావునఁ గాలమనుమేయమనుట కుదురదు. ఇట్లు కాలము నిరూపితము.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం కాలనిరూపణం నామ షష్ఠమోవతారః.

ఇది కాలనిరూపణమనఁబడు పంచమావతారము.

---

## షష్ఠోవతారః

అథనిత్యవిభూతిర్నిరూప్యతే. శుద్ధసత్త్వధర్మభూత జ్ఞానజీవేశ్వర సాధారణం లక్షణమజడత్వం. అజడత్వంనామ స్వయం ప్రకాశత్వం. తత్ర శుద్ధసత్త్వధర్మ భూతజ్ఞాన సాధారణం పరాక్త్వే సత్యజడత్వం. తత్త్వంనామ స్వయం ప్రకాశత్వేసతిపరస్మా ఏవభాసమానత్వం.

ఇంక నిత్యవిభూతిని నిరూపింతుము, ప్రకృతి, కాలము జడము లని నిరూపించితిమి శేషించిన నాల్గు ద్రవ్యములును అనఁగా శుద్ధ సత్త్వము, ధర్మభూతజ్ఞానము, జీవుఁడు, ఈశ్వరుఁడును అజడములు. స్వయముగాఁ బ్రకాశించునవి అజడములు. శుద్ధమగు (రజస్తమస్సంబం ధములేని) సత్త్వముకలది. కావున శుద్ధసత్త్వమని నిత్యవిభూతిని వ్యవహరింతురు. శుద్ధసత్త్వము. ధర్మభూత జ్ఞానమును పరాక్కులగుచు నజడములగును. పరులకు మాత్రమే భాసించుట పరాక్త్వము. స్వయం ప్రకాశములగుచుఁ బరులకు మాత్రమే భాసించునవి యనిభావము. ధర్మభూతజ్ఞానముకూడ నిత్యవిభూతివలె పరులకుమాత్రమే భాపించునది. జ్ఞానము జ్ఞానాశ్రయమునకు మాత్రమే భాసించును. తనకుఁ దాను భాసింపదుగదా! త్రిగుణ ప్రకృతి యెట్లు జడమో శుద్ధసత్త్వవత్తమగు నిత్యవిభూతియు జడమేకావలయునని కొందఱనిరి కాని అది సరికాదు. నిత్యవిభూతి భగవత్సరూపము కావున భగవత్స్వరూపము జ్ఞానాత్మకము కావున నిత్యవిభూతియు జ్ఞానాత్మకమే యగుటచే నజడపదార్థమేయగును. మఱికొందరిది నిరుపాధిక జ్ఞానవికాసస్థాన మగుటచేతను నిశ్శేషా విద్యా నివృత్తి హేతువగుటచేతను జడమే అయినను ఔపచారికముగా నజడమని వ్యవహరింపఁబడుచున్నదని చెప్పుచున్నారు.

శుద్ధసత్త్వత్వంనామ త్రిగుణద్రవ్య వ్యతిరిక్తత్వే సతిసత్త్వవత్త్వం. నిశ్శేషావిద్యానివృత్తిదేశ విజాతీయాన్యత్వంవా. సావిభూతిరూర్ధ్వప్రదేశే నానన్తా అధః ప్రదేశేన పరిచ్ఛిన్నా అచేతనా స్వయంప్రకాశాచ. ఆనన్దావహత్వాదానన్దనామికా. పఞ్చోపనిషన్మన్త్ర ప్రతిపాద్యతయా పఞ్చోపనిషదాత్మికా, అప్రాకృత పఞ్చశక్తిమత్తయా పఞ్చశక్తిమయీ, తివిగద్యతే.

శుద్ధసత్త్వమనఁగాఁ ద్రిగుణద్రవ్యాతిరిక్తమగు సత్త్వవద్ద్రవ్యము అనఁగా నిశ్శేషావిద్యానివృత్తిదేశము. (శుద్ధం సత్త్వం యత్రతచ్ఛుద్ధ సత్త్వం అని విగ్రహము) ఆ నిత్యవిభూతి ఊర్ధ్వభాగమున నంతము లేనిదియు నధోభాగమునఁ బరిచ్ఛిన్నమును. తమోరహితమగుచు సత్త్వముగలది, రజోరహితమగుచు సత్త్వముగలది. అను లక్షణము లును దీనికి సరిపడును. దీనికిఁ బ్రమాణములునుగలవు. (ఆదిత్యవర్ణంత మసఃపరస్తాత్, యోస్యాధ్యక్షః పరమేవ్యోమన్, ఇత్యాది శ్రుతులు. "తద్చాకాశం సనాతనమ్'' అను రామాయణము దివ్యం స్థానమజ రంచాప్రమేయమ్'' అని భారతమును ) ఇది యచేతనము. స్వయం ప్రకాశమును. కొందఱు ఇది నిరతిశయదీప్తికలది కావున స్వయంప్రకాశ మను వ్యవహారము కలిగెనందురు. ఆనందమును గలిగించునది కావున నానందనామముకలది పంచోపనిషన్మంత్రములచేఁ బ్రతిపాద్యమగుట పంచోపనిషదాత్మకమనియు అప్రాకృతమగు పంచశక్తులు కలది కావున పంచశక్తిమయమనియుఁ జెప్పఁబడుచున్నది. (పరమేష్ఠిశక్తి, పురుష శక్తి, విశ్వశక్తి, నివృత్తిశక్తి, సర్వశక్తి ఇవి పంచశక్తులు.)

సావిభూతిరీశ్వరస్య నిత్యానాం ముక్తానాం చేశ్వర సఙ్కల్పాత్ భోగ్య భోగోపకరణ భోగస్థానరూపాచ భవతి. భోగ్యాన్యైశ్వర్యాదీని. భోగోప కరణాని చన్దనకుసుమ వస్త్రవధూభూషణాయుధాదీని. భోగస్థానానితు గోపుర ప్రాకార మణ్డప విమానోద్యాన పద్మిన్యాదీని. తత్రేశ్వరస్య నిత్యముక్తానాంచ శరీరాణి భగవన్నిత్యేచ్ఛాసిద్ధాని. ముక్తానాం శరీరాణి. తేషాం పిత్రాదిసృష్టిః, యుగపద నేకశరీర పరిగ్రహ ఇత్యాదీని భగవత్సఙ్కల్పా దేవభవన్తి.

అట్టి నిత్యవిభూతి ఈశ్వరునికిని, నిత్యులకును, ముక్తులకును ఈశ్వరుని సంకల్పవశమున భోగ్యముగను భోగోపకరణముగను భోగ స్థానముగను గూడ నగుచుండును అనఁగా శబ్దాదివిషయరూప భోగ్యముగను శరీరేంద్రియరూప భోగోపకరణముగను గోపుర మంట పాది భోగస్థానరూపముగను గూడ భగవత్సంకల్పమువలన నుపయుక్త మగుచుండును ఈశ్వర శరీరాదికము భోగ్యము, చందన కుసుమ వస్త్ర భూషణాయుధాదులును భోగోపకరణములు గోపురములు పుర

ములు ప్రాకారములు మండపములు మున్నగునవి భోగస్థానములు. వానిలో నీశ్వరునియొక్కయు నిత్యులయొక్కయు శరీరములు భగవన్నిత్యేచ్ఛాసిద్ధములు ముక్తులయొక్క శరీరములను వారికి తండ్రి మున్నగువారి సృష్టియు ఒక్కసారి యనేక శరీరములను ధరించుట మున్నగునవి భగవత్సంకల్పము వలననే యగును.

భగవతోవ్యూహ విభవార్చావతార శరీరాణ్యప్రాకృతమయాని. అర్చావతారేషు ప్రతిష్ఠానన్తరం ప్రసాదోన్ముఖ భగవత్సఙ్కల్పాధీన మప్రాకృత శరీరమతాావిర్భవతి. ప్రాకృతాప్రాకృత సంసర్గః కథమితినశఙ్కనీయం రామకృష్ణాద్యవతార శరీర వదితి ప్రమాణానుసారేణ పరిహారో ద్రష్టవ్యః.

భగవంతుని వ్యూహరూపములగు సంకర్షణాదిరూప శరీరములను రామకృష్ణాద్యవతార శరీరములను శ్రీరంగనాథ శ్రీనివాసాద్యర్చా శరీరములనుగూడ నప్రాకృతములే. అర్చావతారములయందు శాస్త్రోక్త రీతినిఁ బ్రతిష్ఠయయిన పిమ్మట భగవంతుఁడు ప్రసన్నుఁడై తన సంకల్పముచే నప్రాకృత శరీరము నావిర్భవింపఁజేయును ప్రాకృతములగు శిలా లోహాదులచే నిర్మితములగు నర్చావిగ్రహములందు అప్రాకృత శరీర మావిర్భవించుట యనఁబడు ప్రాకృతా ప్రాకృత శరీర సంసర్గమెట్లు కలుగునని శంకింపరాదు. రామకృష్ణాద్యవతార శరీరములందటులనే ప్రాకృతా ప్రాకృత శరీర సంసర్గము కలిగెను గదా! ప్రమాణములట్లు చెప్పుచున్నవి కావున విరోధములేదు

ముక్తానాం శరీరాది పరిగ్రహస్తు వసన్తోత్సవవేష పరిగ్రహవత్ స్వామినో ముఖవికాసహేతుత్వా త్తత్కైఙ్కర్యార్థమేవ. ఈశ్వరశరీరస్య షాడ్గుణ్య ప్రకాశకత్వాత్ షాడ్గుణ్య మితివ్యవహారః. నిత్యనిరవద్యనిరతిశయౌజ్జ్వల్యసౌన్దర్య సౌగన్ధ్య సౌకుమార్య లావణ్య యౌవనమార్దవాదయో దివ్యమఙ్గళవిగ్రహ గుణాః.

ముక్తులు శరీరమును బరిగ్రహించుట వసంతోత్సవాదులయందు వేషధారణమువలె భగవన్ముఖవికాసహేతువగుచున్నందున భగవత్కైంకర్యమే. (నిత్యులను ముక్తులను భగవదభిమత కైంకర్యరూప

భోగమునకే శరీరమును ధరింతురు. భగవంతుని శరీరధారణము తమకు శేషభూతులగు నిత్యులను ముక్తులను ఆనందింపఁజేయుటకును ముముక్షువులగు వారికి ఉపాస్యమగుటకును అగును. ఈశ్వరుని శరీరము షాడ్గుణ్య ప్రకాశకమగుటచే షాడ్గుణ్యమనుచున్నారు. భగవంతుని దివ్యమంగళవిగ్రహమునకు అనేక సుగుణములుగలవు. నిత్యములును నిరతిశయములు నిరవద్యములునగు నా గుణములు ఔజ్జ్వల్యము సౌందర్యము మంచివాసన, సౌకుమార్యము, లావణ్యము యౌవనము మార్దవము ఆర్జవము మున్నగునవి (భగవంతుని శరీరపరిగ్రహము తన సంకల్పమువలననే యగును. నిత్యులయు ముక్తులయు శరీర పరిగ్రహము ఒకప్పుడు పరమపురుషుని సంకల్పముచేతను నొకప్పుడు భగవత్సంకల్పానుసారియగు తమ సంకల్పముచేతనునగును)

తస్య వ్యాపకత్వం గీతాసు ప్రసిద్ధం. ముక్తస్య శరీరాదికం నాస్తీతి వచనం తు కర్మకృతశరీరాభావపరం. తత్రేన్ద్రియాణాం నిత్యత్వాదపి ఏవ కార్యకారణ భావాభావాత్ప్రాకృతవన్న తత్త్వాన్తర వ్యపదేశః. ఏతేన తత్ర శరీరాదికం నాస్తీతి మతనిరాసః. * తమసః పరస్తాదిత్యుక్త్యా ప్రకృత్యేకదేశవాదనిరాసః. అప్రాకృత శబ్దస్పర్శరూప రసగన్ధాశ్రయత్వాదాకాశవ్యావృత్తిః. జ్ఞానాత్మకత్వ ప్రతిపాదనాత్. జడమితిమతనిరాసః.

ఆ భగవచ్ఛరీరము వ్యాపకమని గీతాదులయందుఁ బ్రోక్తము. ముక్తునికి శరీరములేదని చెప్పుట, కర్మకృతశరీరము లేదని చెప్పుటయే. కర్మకృతశరీరమే అయినచో నదియు నిత్యము కావలసియుండును. అచటనున్న ఇంద్రియములు నిత్యములు. ఈ శరీరము దేనికిని కార్యము కాదు. దేనికిని కారణమును కాదు. అందుచేతనే దీనికిఁ బ్రాకృతపదార్థము వలె వేరొకతత్త్వమని వ్యవహారము లేదు ఇట్లనుటచే నిత్యవిభూతిలో శరీరాదులు లేవను మతము నిరస్తమయ్యెను. నిత్య విభూతియను నదియుఁ బ్రకృతిలోని యొకభాగమే యనువాదమునునిరస్తమే. "తమసః పరస్తాత్" తమోగుణమునకతీతము అని శ్రుతిచెప్పుచుండగా ప్రకృత్యేక దేశమెట్లగును ? అదియ ప్రాకృతములగు శబ్దస్పర్శాది గుణముల కాశ్రయము కావున ప్రాకృతమగు నాకాశాదులలో భాగమనుటకు వలను

పడదు. ఆ ప్రసిద్ధాకాశాదులు ప్రాకృతగుణాశ్రయములేకాని యప్రాకృత గుణాశ్రయములు కావు. అది జ్ఞానాత్మకము అనఁగా స్వయంప్రకాశము కావున జడమనుటయుఁ గుదురదు.

భగవతోఽప్రాకృత దివ్యమఙ్గళ విగ్రహస్యాస్త్రభూషణాధ్యాయోక్తం సర్వాపాశ్రియత్వం. తద్యథా – పురుషస్య కౌస్తుభాకారత్వం. ప్రకృతేః శ్రీవత్సరూపత్వం. మహతో గదారూపత్వం. సాత్త్వికాహఙ్కారస్య శఙ్ఖ రూపత్వం. తామసాహఙ్కారస్య శార్ఙ్గరూపత్వం. జ్ఞానస్యాసి రూపత్వం. అజ్ఞానస్య తదావారక రూపత్వం మనసశ్చక్రత్వం. జ్ఞానేన్ద్రియ కర్మేన్ద్రియాణాం శరరూపత్వం. సూక్ష్మస్థూలభూతానాం వనమాలాకారత్వం. అత్ర*చేతశ్చ క్రితిచేతనాసిరమతిస్తత్సం వృతిర్మాలికాభూతాని స్వగుణైరహఙ్కృతియుగం శఙ్ఖేనశార్ఙ్గాయతే। బాణాఃఖానిదశాపికౌస్తుభ మణిర్జీవః ప్రధానం పునఃశ్రీవత్సం కమలాపతేతవగదామాహుర్మహాన్తంబుధాః" ఇతి సఙ్గ్రహేణోక్తం పద్యమను సన్ధేయం. సావిభూతిరామోద ప్రమోద సమ్మోద వైకుణ్ఠాఖ్యరూపేణ చతుర్విధా. పునరనన్తా, త్రిపాద్విభూతిః పరమపద పరమవ్యోమపరమా కాశా మృతనాకా ప్రాకృత లోకానన్దలోక వైకుణ్ఠాయోధ్యాదిశబ్దవాచ్యాచ. తస్యాం విభూతౌ ద్వాదశావరణోపేత మనేక గోపుర ప్రాకారైరావృతం వైకుణ్ఠం నామ నగరం. తత్రానన్దనామకో దివ్యాలయః. తదన్తః రత్నమయానేకస్తమ్భ సహస్రైర్విరచితా మహామణిమణ్డపాఖ్యాసభా. తస్యాం సహస్రఫణామణి తేజోఽపరాజితోఽనన్తః. తస్మిన్ ధర్మాదిమయదివ్యసింహాసనం. తదుపరి చామర హస్తాభిర్విమలాదిభిస్సేవ్యమానమష్టదళాత్మకం పద్మం. తదుపరి ప్రకృష్ట విజ్ఞానధామా శేషః. ఉపరివాచః పరం మహదద్భుతం. ఏవం నిత్యవిభూతి స్సఙ్గ్రహేణ నిరూపితా.

భగవంతుని యప్రాకృత దివ్యమంగళ విగ్రహము అస్త్రభూష ణాధ్యాయమునఁ జెప్పినట్లు అలంకార రూపముగను ఆయుధరూపము గను నుండి సర్వతత్త్వములకును ఆశ్రయమగుచున్నది.

అది యెట్లన పురుషుఁడు (జీవుఁడు) కౌస్తుభము ప్రకృతి శ్రీవత్సము మహత్తు (తత్త్వమును బుద్ధియనియు వ్యవహరింతురు) గద ఇంద్రియకారణమగు సాత్త్వికాహంకారము శంఖము భూతాది

యగు తామసాహంకారము శార్ఙ్గము. జ్ఞానము ఖడ్గము. అజ్ఞానము దాని యావరకము అనగా ఒర. మనస్సు చక్రము. జ్ఞానేంద్రియము లును గర్మేంద్రియములు బాణములు. పంచతన్మాత్రలు, పంచభూతము లును వనమాలయు నయ్యెను. ఈవిషయ మీశ్లోకమున నిట్లు సంగ్ర హింపఁబడెను.

శ్లో॥ చేతశ్చక్రతి, చేతనాసి, రమతి స్తత్సంవృతిర్మాలికా
భూతాని స్వగుణైరహంకృతి యుగం శంఖేన శార్ఙ్గాయతే।
బాణాః ఖానిదశాపి కౌస్తుభమణిర్జీవః ప్రధానం పునః
శ్రీవత్సం కమలాపతే! తవగదామాహుర్మహాంతం బుధాః॥

అట్టి నిత్యవిభూతి ఆమోదము ప్రమోదము సంమోదము వైకుంఠము అని నాల్గువిధములును ననంతమును. అది త్రిపాద్విభూతి, పరమ పదము. పరమ వ్యోమము, పరమాకాశము, అమృతము, నాకము, అప్రాకృతలోకము, ఆనందలోకము, వైకుంఠము, అయోధ్య మున్నగు శబ్దములతో వ్యవహరింపఁబడును. ఈ విభూతిలోఁ బంద్రెండు ఆవరణములతోఁగూడిన యనేకములగు గోపురములతోడను అనేక ప్రాకారములతోడను గూడియున్న వైకుంఠమను నగరము కలదు. అందానందమను పేరుగల దివ్యాలయము కలదు. అందు రత్నమయములగు అనేక సహస్రసంఖ్యాకములగు స్తంభములతోగూడిన మహామణిమంటపమను పేరుగల సభాభవనముకలదు. దానిలో వేయి పడగలయందలి మణికాంతులతో విరాజిల్లు ననంతుని దివ్యశరీరము. దానియందు ధర్మాదిరూపమగు సింహాసనముగలదు. దానిపై చామర ములను వీచుచున్న విమలాదులచే సేవింపఁబడుచున్న అష్టదళపద్మ మును దానిమీద ప్రకృష్ట విజ్ఞానస్థానమగు శేషుఁడును నాతనిపై నాగ గోచరాద్భుత రూపముగల శ్రీమన్నారాయణుండు ఉండును. ఇది నిత్య విభూతి నిరూపణము.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం నిత్యవిభూతి నిరూపణం నామ షష్ఠోవతారః.

ఇది నిత్యవిభూతి నిరూపణమనంబడు నారవ యవతారము.

# సప్తమోవతారః

అథ క్రమప్రాప్తం ధర్మభూతజ్ఞానం నిరూప్యతే - స్వయం ప్రకాశా చేతన ద్రవ్యత్వేసతి సవిషయత్వం, విభుత్వేసతి ప్రభావద్ద్రవ్యగుణాత్మకత్వం అర్థప్రకాశో, బుద్ధిరిత్యాదితల్లక్షణం. ధర్మభూతజ్ఞానం ఈశ్వరస్య నిత్యానాంచ సర్వదానిత్యమేవవిభుచ. బద్ధానాంతిరోహితం. ముక్తానాం పూర్వం తిరోహిత మనన్తరమావిర్భూతం.

ద్రవ్యములను నిరూపించు వరుసలో నిత్యవిభూతి నిరూపణానంతరము ధర్మభూతజ్ఞానమును నిరూపింతుము. స్వయంప్రకాశాచేతన ద్రవ్యమగుచు సవిషయమగునది ధర్మభూతజ్ఞానము అని దీనిలక్షణము అట్లే ప్రభవలె ద్రవ్యమును గుణమును గూడ నయ్యేది విభుపదార్థము ధర్మభూతజ్ఞానము అర్థప్రకాశమగుబుద్ధి ధర్మభూతజ్ఞానము ఇత్యాది లక్షణములు జ్ఞేయములు. (జ్ఞానము రూపాదివిషయములను బ్రకాశింపఁ జేయునపుడు జ్ఞానమున కాశ్రయమగు నాత్మకు స్వయముగా భాసించును అన్యపురుషగత జ్ఞానము అనుమానాదులకు విషయమగును కాలాంతర జ్ఞానమయిన చోస్మృతివిషయమగును ఈశ్వరాదులు సర్వజ్ఞులు కావున వారికిఁ బ్రత్యక్షమేయగును )

ఆ ధర్మభూతజ్ఞానము ఈశ్వరునికిని, నిత్యులకును ఎల్లపుడును నిత్యమేయగును, విభువుకూడనగును బద్ధులకుమాత్రము ఆచ్ఛాదికము ముక్తులకుఁ బూర్వము తిరోహితమును ముక్తిఁజెందిన పిమ్మట యావిర్భూతమునగును. ఈజ్ఞానము నిత్యమని "నవిజ్ఞాతుర్విజ్ఞాతేర్విపరిలోపోవిద్యతే, ఇత్యాది శ్రుతులను, తథా హేయగుణధ్వంసాదవబోధాదయోగుణాః। ప్రకాశ్యంతే నజన్యంతే నిత్యాఏవాత్మనోహితే" ఇత్యాది స్మృతులును జెప్పుచున్నవి.

నను జ్ఞానస్య నిత్యత్వే జ్ఞానముత్పన్నం నష్టమితి వ్యవహారః కథమితి చేత్ తదుచ్యతే - జ్ఞానస్య సఙ్కోచ వికాసావస్థతయా తత్సమ్భవాత్. ఛిద్రైః పాదాప్యుదకమిత్థం జ్ఞానమపీన్ద్రియద్వారా ప్రసృత్యార్థేనసంనికృష్యతే. అహి కుణ్డలవత్సఙ్కోచవికాసౌ.

జ్ఞానము నిత్యమన్నచో "జ్ఞానముకలిగెను - జ్ఞానముపోయెను" ఇత్యాది వ్యవహారమెట్లు - అని శంకింపరాదు. జ్ఞానము సంకోచ వికాసములనుబొందును గావున నాయవస్థలనుబట్టియే యట్టివ్యవహారము సంభవించుచున్నది.

తిత్తిలోనుండి దాని గొట్టముద్వారా ఉదకమెట్లు జారునో అట్లే జ్ఞానమును ఇంద్రియముల ద్వారా స్రవించి పదార్థములతోఁ (విషయము లతో) గలియును. పాము చుట్టచుట్టుకొని యుండుటయుఁ దిన్నగాసాగి యుండుటయు నను నవస్థలవలెనే జ్ఞానమునకును సంకోచవికాసావస్థలు కలుగును. జ్ఞానమునకును ఇంద్రియములు ప్రసారద్వారములు మాత్రమే యగును "ప్రసరించుటయనునది క్రియగదా గుణమగు జ్ఞానము నందుఁ గ్రియయెట్లు సంభవించును"? అని శంకింపరాదు. జ్ఞానము గుణమయినను ద్రవ్యముకూడ నగును గావున దానికిఁ బ్రసారక్రియ విరుద్ధముకాదు.

సర్వం జ్ఞానం స్వతఏవ ప్రమాణం. స్వయం ప్రకాశంచ. విప్రతిపన్నా సంవిత్ స్వగత వ్యవహారం ప్రతిస్వాధీనకిఞ్చిత్కారా - స్వసజాతీయ సమ్బన్ధానపేక్ష వ్యవహారహేతుత్వాత్ - అర్థేన్ద్రియ దీపాదివత్. వచచక్షురాలోకయో స్సజాతీయత్వం - అహఙ్కారికతైజసయోర్భేదాద్భేదః. అనేనజ్ఞానస్య క్షణి కత్వం, త్రిక్షణావస్థాయిత్వం, ప్రాతిభాసిక వద్వ్యావహారికస్యాపిమిథ్యాత్వం, పరతః ప్రామాణ్యం, జ్ఞానస్యైవాత్మత్వ, మిత్యాదిపక్షానిరస్తాః.

జ్ఞానము స్వయం ప్రమాణము. అనఁగాఁదనంతటానే ప్రమాణము స్వయంప్రకాశము కూడను. 'ఘటోఽస్తి' ఘటము ఉన్నది. అను జ్ఞాన మున ఘటము ఉండుటయే ప్రామాణ్యము. అట్టి ఘటాస్తిత్వము జ్ఞానము

చేతనే తెలియఁబడునుగదా. కావున జ్ఞానము స్వయంప్రమాణమగు చున్నది ఇందు అనుమానప్రమాణమును గలదు, "జ్ఞానము జ్ఞానమను వ్యవహారమును గురించి స్వాధీనప్రయత్నము గలదియగును. స్వసజాతీయముయొక్క సంబంధమును అపేక్షింపకయే వ్యవహారహేతువు అగుచున్నది కావున అర్థేంద్రియ దీపతుల్యముగా" చక్షురాలోకములు సజాతీయములు కావుగదా; ఆహంకారిక తైజసభేదమువలన నవి భిన్న జాతీయములు.

జ్ఞానము నిత్యమని నిరూపించియుండుటచే నదిక్షణికమగుటయు, వేదాంత్రిక్షణావస్థాయి యనుటయు నిరస్తమయ్యెను. జ్ఞానము సత్యమని నిరూపించియుండుటచే శుక్తియందు రజితమువలెఁ బ్రాతిభాషికమనుటయు, జ్ఞానవ్యవహారము మిథ్యయనుటయు నిరస్తము. స్వతఃప్రమాణము జ్ఞానమనుటచేఁ బరతఃప్రమాణమను మతమును, జ్ఞానముగలది యాత్మ యనుటచే జ్ఞానమే యాత్మయనుపక్షమును నిరస్తములయ్యెను.

స్తమ్భః స్తమ్భ ఇత్యాది ధారావాహిక జ్ఞానం త్వేకమేవ. నను ఆగమ బలాజ్జ్ఞానస్య నిత్యత్వాఙ్గీకారే కథం జాగరసుషుప్త్యాది భేదసిద్ధిరితిచేన్న-దాహకస్య వహ్నేర్దాహ్యసన్నిధౌ మణ్యాది ప్రతిబన్ధకాద్దాహాభావః – తద్వజ్జ్ఞాన తిరోధాయక తమోవిశేష సన్నిధానా సన్నిధానాభ్యాం స్వాపాదిసిద్ధిః. పుంస్త్వాదివచ్చ – పుంస్త్వాదికంతుబాల్యేతిరోహితం – యౌవనే ఆవిర్భవతి. విశేషణాదివత్.

ఏకవిషయమును అవిచ్ఛిన్నమును అనుజ్ఞానమును ధారావాహిక మందురు స్తంభము, స్తంభము, స్తంభము అని అవిచ్ఛిన్నముగాఁగల్గు స్తంభవిషయక జ్ఞానము ధారావాహిక మగుచున్నది. ఇట్టి జ్ఞానము ఏకరూపమగుటచే నొక్కటియేకాని యనేకములు కావని మా మతము. "జ్ఞానము నిత్యమని శాస్త్రబలమువలన నంగీకరించినచో జాగరణము (మేల్కొనుట) సుషుప్తి (నిద్రించుట) మున్నగు నవస్థాభేదమెట్లు సిద్ధించును ? అనఁగా జ్ఞానాభావరూపమయిన సుషుప్తిచే జ్ఞానమునకు విచ్ఛేదమెట్లు సంభవించును ?" అని శంకింపరాదు, అగ్నియందలి దాహకత్వము ప్రతిబంధకమగు మణిసంన్నిధానముచే తిరోహితమయి యట్టిమణిని తీసివేసినచో మరలఁబ్రవర్తించునుగదా ! అచట నగ్నికి

దాహకత్వము నశింపలేదుకదా! అట్లే జ్ఞానము నశింపకున్నను దానికి తిరోధాయకమగు తమో విశేషముయొక్క సన్నిధివలన సుషుప్తియు ఆ తమోవిశేషము పోవగనే స్వాపము పోవుటయు సంభవించును. పుంస్త్వాదులవలె నభివ్యక్త్యనభివ్యక్తులు మాత్రమే జ్ఞానమునకుఁగల్గును కాని జ్ఞానాభావము మాత్రము కలుగదు.

శరీరమునకు సప్తధాతుమయత్వము సహజమని ప్రమాణసిద్ధము అందుఁబుంస్త్వాద్యసాధారణమగు నొక ధాతువు బాల్యాద్యవస్థలయం దెల్లపుఁడును పురుషునికి ఉండును అయినను బాల్యమునందు ఆ ధాతువు అనభివ్యక్తమయి (తిరోభావమయి) యౌవనావస్థయందభివ్యక్తమగును అట్లే జ్ఞానమును అభివ్యక్తమును, అనభివ్యక్తమును జాగ్రత్సుషుప్తులయిందగునేకాని ఎన్నడును నశింపదు. కావున జ్ఞానము స్వరూపానుబంధి ధర్మమేయగును.

యోయదాశ్రిత స్వభావః – సతస్యగుణ ఇతి గుణలక్షణ లక్షితత్వాద్జ్ఞానం గుణః, యతస్సఙ్కోచ వికాసావస్థావత్ – అతోద్రవ్య, మపి భవతి. ఆత్మ గుణభూతస్య జ్ఞానస్య ద్రవ్యత్వంకథమితి నశఙ్కనీయం – ప్రభావదేకస్యైవ ద్రవ్యత్వ గుణత్వయోర్విరోధాభావాత్.

"ఏది దేని నాశ్రయించియుండు స్వభావముగలదో యది దానికి గుణము" అవిగదా గుణలక్షణము ఈ లక్షణము జ్ఞానమునందును గలదు. ఇది యాత్మ నాశ్రయించియుండు స్వభావముగలది. కావున జ్ఞానము విశేషణాదులవలెనే గుణమగుచున్నది గుణలక్షణము వైశేషికాదులవలె మనకు "ఇవియే గుణములు" అని పారిభాషికముకాదు. ఒకదాని నాశ్రయించియుండు స్వభావముగలది యెల్లగుణమేయగును. అది ద్రవ్యముకాఁగూడదను నిర్బంధమునులేదు. కొన్ని ద్రవ్యాత్మక గుణములును కొన్ని కేవల గుణములు నగుచుండును ఈ జ్ఞానము సంకోచము, వికాసము అను నవస్థలు కలదగుటచే ద్రవ్యమునుఅగును. ''అవస్థాశ్రయోద్రవ్యమ్'' అని ద్రవ్యలక్షణముకదా! ''ఆత్మకు గుణమగు జ్ఞానము ద్రవ్యమెట్లగును'' అని శంకింపరాదు. ప్రభవలె నొక్క

వస్తువే ద్రవ్యమును గుణమును గూడ నగుటలో విరోధము లేదు. ద్రవ్యలక్షణము కలది కావున ద్రవ్యమును గుణలక్షణము కలది కావున గుణమును, గూడ నగును

అవస్థాశ్రయో ద్రవ్యమితి ద్రవ్యలక్షణం. స్వాశ్రయా దన్యత్ర వర్తమానత్వమపి – ప్రభావదుపపత్తేః. ప్రయోగశ్చ – గుణభూతా బుద్ధిర్ద్రవ్యం – ప్రసరణాదిమత్త్వాత్ – ప్రభావత్. జ్ఞానం ద్రవ్యం సంయోగాదృష్టాన్యత్వేసతి భావనాకారణత్వాత్ – ఆత్మవదితి. ఉక్తజ్ఞానస్య యుగపదనన్తదేశ సంయోగోనయన సూర్యాది తేజోవత్సమ్భవతి. జ్ఞానం మతిః ప్రజ్ఞాసంవిద్ధిషణా ధీర్మనీషా శేముషీ మేధాబుద్ధిరిత్యేవమాదయశ్శబ్దాః జ్ఞానపర్యాయాః. బుద్ధిరేవ ఉపాధి భేదాత్సుఖదుఃఖేచ్ఛాద్వేష ప్రయత్నరూపా – సుఖాదేర్జనకతయాఽభ్యుపగతజ్ఞానాతిరేకే ప్రమాణాభావాత్, ఇచ్ఛామిద్వేష్మీతి వ్యవహారస్యస్మరామీత్యాదివద్జ్ఞాన విశేషేణోపపత్తేః.

జ్ఞానము స్వాశ్రయమును విడచి ఇతర స్థలమునందు (విషయ భూత పదార్థములందు) వర్తించుటయుఁ బ్రభవలెనే యుపపన్నమే యగును (ప్రభస్వాశ్రయమగు దీపాదికమును విడచి ఘటాదులందు వర్తించునుగదా) ఇందుకుఁ బ్రయోగమునుగలదు గుణమగు బుద్ధి ప్రసరణాదికముకలది కావునఁ బ్రభవలె ద్రవ్యమగును. లేదా! సంయోగాదృష్టములకంటె భిన్నమయి భావనాకారణ మగుటవలన జ్ఞానము ఆత్మవలె ద్రవ్యమగును. అనియుఁ బ్రయోగాంతరముఁ జూపవచ్చును. ముక్తుని జ్ఞానమునకు ఒక్కసారిగా అనంతదేశములతో సంయోగించుట వయనతేజస్సు సూర్యతేజస్సు మున్నగు వానికి వలెనే సంభవించును. (ఏక కాలమున బహుదేశసంయోగము జ్ఞానమునందలి వేగాతిశయము చేతనే కలుగునని భావము) జ్ఞానాదిగుణములు ద్రవ్యాత్మక గుణములు. సత్త్వాదిగుణములు కేవల గుణములు నని భేదము తెలియనగును.

జ్ఞానము, మతి, ప్రజ్ఞ, సంవిత్తు ధిషణ, ధీ, మనీష, శేముషి, మేధ, బుద్ధి ఇత్యాదులు పర్యాయపదములు బుద్ధియే ఉపాధి భేదము వలన సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ద్వేషము, ప్రయత్నము అను

రూపములతో నుండును. జ్ఞానముకంటె నితరమగునది సుఖాది జనకముగాఁ బ్రమాణమెద్దియు గానరాదు (స్మరామి) "స్మరించుచున్నాను" మున్నగురానివలె ఇచ్ఛయించుచున్నాను ద్వేషించుచున్నాను అను వ్యవహారము జ్ఞానవిశేషములనుటయే ఉపపన్నమగుచున్నది

నను * కామస్సంకల్పో విచికిత్సా శ్రద్ధా௨శ్రద్ధా ధృతిరధృతి, హ్రీర్ధీర్భీ రిత్యేతత్సర్వం మన ఏవేత్యేతేషాం జ్ఞానరూపత్వం కథమితిచేత్. జ్ఞానస్య మనస్సహకారిత్వనియమాత్ మన ఏవోపచారాదుక్తమితి నవిరోధః. ఏవం ప్రత్యక్షానుమానాగమస్మృతి సంశయ నిర్ణయ విపర్యయ భ్రమవివేక వ్యవసాయ మోహరాగ ద్వేష మద మాత్సర్య చాపల్య దమ్భ లోభ క్రోధ దర్పస్తమ్భ ద్రోహాభినివేశనిర్వేదానన్ద, సుమతిదుర్మతి ప్రీతిరుష్టి తుష్టిస్సన్తతి శాన్తి కీర్తి విరక్తిరతిమైత్రీ దయాముముక్షాలజ్జా తితిక్షావిచారణావిజిగీషామృదుతాక్షమా చికీర్షాజుగుప్సాభావనోహనా అసూయాజిఘాంసాతృష్ణాదురాశావాసనాదుర్వాస-నావశ్యాభక్తి ప్రపత్త్యాదయశ్చ జీవాత్మగుణా అనన్తాః ధర్మభూతజ్ఞానస్యైవ విశేషాఏవ. ఏవం జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్య తేజస్సౌశీల్య వాత్సల్య మార్దవార్జవసౌహార్ద సామ్య కారుణ్య మాధుర్యగామ్భీర్యౌదార్యచాతుర్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమాదయో భగవతో௨నన్త కల్యాణగుణాః జ్ఞానశక్త్యోరపి తత్తద్భూతాః.

"కామము, సంకల్పము, విచికిత్స శ్రద్ధ, అశ్రద్ధ, ధృతి, అధృతి, హ్రీ, ధీ, భయము ఇవియన్నియు మనస్సే" అని చెప్పఁబడి యుండగా నివి జ్ఞానరూపములనుట యెట్లు పొసఁగును అని శంకింపరాదు. జ్ఞానము మనస్సహకారి యగుటచే జ్ఞానమును మనస్సే అనుట ఔపచారికమే కాని ముఖ్యముకాదు. కనుక విరోధములేదు.

ఇట్లే ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, స్మృతి, సంశయము, విపర్యయము (అన్యథా జ్ఞానము) భ్రమము, వివేకము, వ్యవసాయము, మోహము, రాగము ద్వేషము, మదము, మాత్సర్యము, ధైర్యము, చాపల్యము, దంభము, లోభము, క్రోధము, దర్పము, స్తంభము, ద్రోహము, అభినివేశము, నిర్వేదము, ఆనందము, సుమతి,

దుస్మృతి, సుప్రీతి, తుష్టి, ఉన్నతి, శాంతి, విరక్తి, రతి, మైత్రి, దయ, ముముక్ష, లజ్జ, తితిక్ష, విచారము జిగీష, ముదిత, క్షమ, చికీర్ష, జుగుప్స, భావన, కుహన, అసూయ, జిఘాంస, తృష్ణ, దురాశ, వాసన చర్చ శ్రద్ధ, భక్తి ప్రపత్తి మున్నగు అనంతములయిన జీవగుణములు ఈ ధర్మభూత జ్ఞానముయొక్క అవస్థావిశేషములే.

(వెనుక అనుభవించునది తలంపుకునకువచ్చుట స్మృతి. నిశ్చయములేని జ్ఞానము సంశయము, ఒక ధర్మముకలదాని నింకొకవిధముగా భావించుట విపర్యయము, ఒక వస్తువు నింకొక వస్తువుగా ననుకొనుట భ్రమము, సందేహము బోయిన పిమ్మట కలిగిన ఊహ వివేకము, వ్యవసాయము అనఁగా ఉద్యమము. భయాదులవలన వస్తుతత్త్వమును దెలిసికొనలేకపోవుట మోహము. అభినివేశ మనఁగాఁ బట్టుదల. విషయమునందనిచ్ఛ నిర్వేదము, ఉన్నతి యనగా ఉత్సాహము. రతి యనఁగాఁ ప్రేమ తితిక్ష యన నోర్పు, చేయదలంచుట చికీర్ష. ఏవగింపు జుగుప్స. కుహన అనఁగా మోసము. జిఘాంస యనఁగాఁ జంపఁదలంచుట వాసన యనఁగా సంస్కారవిశేషము )

ఇట్లే జ్ఞానము శక్తి బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు, సౌశీల్యము, వాత్సల్యము, మార్దవము, ఆర్జవము, సౌహార్దము ధైర్యము సామ్యము కారుణ్యము, మాధుర్యము, గాంభీర్యము, ఔదార్యము స్థైర్యము పరాక్రమము మున్నగు భగవంతుని అనంత కల్యాణ గుణములు. జ్ఞానము శక్తి అనుగుణములు విస్తృతి రూపములు.

జ్ఞానంనామ – సర్వసాక్షాత్కారరూపం. శక్తిః – అఘటితఘటనా సామర్థ్యం। బలం – ధారణసామర్థ్యం. ఐశ్వర్యం – నియమనసామర్థ్యం. వీర్యం – అవికారిత్వం. తేజః – పరాభిభవన సామర్థ్యం, మహతోమన్దైస్స హనీరన్ధ్రేణసంశ్లేషస్సౌశీల్యం. వాత్సల్యం – దోషేపిగుణత్వబుద్ధిః. దోషాదర్శిత్వంవా. ఆశ్రితవిరహాసహత్వం మార్దవం. మనోవాక్కాయైకరూపత్వ మార్జవం. స్వసత్తానపేక్ష తదభీష్టపరత్వం సౌహార్దం, అభిజనవృత్తగుణాద్య నపేక్షయా సర్వాశ్రయణీయత్వం సామ్యం. స్వార్థానపేక్ష పరదుఃఖనిరా–

చికీర్షాకారుణ్యం. పరదుఃఖా సహిష్ణుత్వంవా. క్షీరవదుపాయభావే పిస్వాదుత్వం మాధుర్యం. భక్తానుగ్రహవదాన్యత్వాదేరామూలతోదురవ గాహత్వం గామ్భీర్యం. అపరిమితం దత్వాప్యతృప్తత్వమౌదార్యం. ఆశ్రితదోషగోపనం చాతుర్యం. అకమ్పనీయత్వం స్థైర్యం. అభగ్న ప్రతిజ్ఞత్వం ధైర్యం. పరబల ప్రవేశసామర్థ్యం శౌర్యం. తన్నిరాకరణం పరాక్రమః. ఇత్యాద్యూహ్యం.

జ్ఞానమనఁగా సర్వవస్తువులను సాక్షాత్కరించుట. అఘటిత ఘటనా సామర్థ్యము శక్తి. ధరింపఁగల్గుట బలము. నియమింపఁగల్గుట యైశ్వర్యము వికారమును జెందకుండుట వీర్యము. ఇతరులను దిరస్కరింపఁగల్గుట తేజస్సు. గొప్పవారు తక్కువవారితో బాగుగాఁగలసి యుండు స్వభావము సౌశీల్యము దోషములందును గుణబుద్ధి, లేదా దోషములను జూడకుండు స్వభావము వాత్సల్యము ఆశ్రితుఁను విడచియుండలేకపోవుట మార్దవము. త్రికరణముల వ్యాపార మొక్క విధముగా నుండుట యార్జవము తనయునికిని జూచుకొనకయే పరుని రక్షణమునందాసక్తుఁడగుట సౌహార్దము. జాతి, జ్ఞానము, నడువడి, గుణములు వీనిని జూడకయే అందఱచేతను నాశ్రయింపఁదగియుండుట సామ్యము. ఆశ్రితుల దోషములను గప్పివుచ్చుట చాతుర్యము ఎవ్వరి చేతను గదల్పఁబడకుండుట స్థైర్యము చేసిన ప్రతిజ్ఞను విడనాడకుండుట ధైర్యము. పరసైన్యమధ్యమునఁబ్రవేశింపఁగల సామర్థ్యము శౌర్యము. పరబలమును నిరాకరించుట పరాక్రమము తనకేమియుఁబ్రయోజనము లేకయే పరుల దుఃఖమును బోగొట్టదలంచుట దయ లేదా పరులదుఃఖమునుజూచి తాను దుఃఖించుట ఉపాధిలేకున్నను పాలవలె స్వాదువుగా నుండుట మాధుర్యము. తనకు భక్తులయందుఁగల యనుగ్రహము దాతృత్వము, ఎంతపరిమితిగలదో ఎట్టిదో ఆలోచింప శక్యముకాకుండుట గాంభీర్యము. తానెంతయిచ్చినను అల్పమేయిచ్చితినని తృప్తిలేక యుండుట ఔదార్యము. వదాన్యత యన్నను నిదియే. ఇట్లే తక్కినవియు నూహ్యములు.

జ్ఞానవిశేషభూతయోర్భక్తి ప్రపత్త్యోస్స్వరూపం కిఞ్చిదుచ్యతే – భక్తి ప్రపత్తి వ్యాజీకృత్యేశ్వరఏవ మోక్షం దదాతి. అతస్తయోర్మోక్షోపాయత్వం.

ప్రత్యక్షఫత్వేస్థానాం మోక్షోపాయత్వేనోక్తానాం కర్మయోగ జ్ఞానయోగ ప్రభృతీనాం తత్తత్పురుష వివక్షయోపాయత్వం.

ఇక జ్ఞానవిశేషములగు భక్తిప్రపత్తుల స్వరూపము కొంత చెప్పఁబడుచున్నది. భక్తిప్రపత్తులచేఁ బ్రసన్నుఁడయిన యీశ్వరుఁడే మోక్షమునిచ్చును అందువలన నన(గా మోక్షసాధనమయిన భగవంతుని ప్రసన్నతకు భక్తిప్రపత్తులు కారణములు కావున – ఆభక్తి ప్రపత్తులే మోక్షసాధనములు. మోక్షసాధనములుగాఁ జెప్పఁబడిన కర్మయోగ జ్ఞానయోగములను భక్తిద్వారముగనే మోక్షసాధనములగును. (భక్తియోగము పరమపురుష ప్రాప్త్యుపాయము. అందశక్తులగువారికి అది సిద్ధించుటకు ఆత్మావలోకనము ముందుగా నపేక్షితము. దానికి జ్ఞానయోగ కర్మయోగములు ఉపాయములు. అందను జ్ఞానయోగము అంతరంగోపాయము అయినను అది ముందుగా దుష్కరము. అందశక్తుఁడగువాఁడు కర్మయోగము నాచరింపవలెను. జ్ఞానయోగశక్తుఁడయినను లోకసంగ్రహార్థము కర్మయోగము నాచరింపవలసినదే. కర్మయోగమే జ్ఞానయోగశక్తినిచ్చును)

కర్మయోగోనామ – ఉపదేశాజ్జీవపరయాథార్థ్యజ్ఞానవతా శక్త్యనుసారేణ ఫలసఙ్గరహితానిషిద్ధకామ్య నిత్యనైమిత్తికరూప పరిగృహీత కర్మవిశేషః. సతు దేవార్చనా తపస్తీర్థయాత్రా దానయజ్ఞాదిభేదభిన్నః. అయంతు జీవగత కల్మషాపనయనద్వారా జ్ఞానయోగ ముత్పాద్యతద్ద్వారావా–సాక్షాద్వాభక్త్యుత్పాదకో భవతి.

ఆచార్యోపదేశమువలన జీవునియొక్కయు పరమాత్మయొక్కయు యాథాత్మ్యమును దెలిసికొని తనశక్తిననుసరించి ఫలమునందాసక్తిని విడచి నిషిద్ధములుకానట్టి నిత్యనైమిత్తిక కామ్యకర్మల నాచరించుటయే కర్మయోగము. అది దేవతార్చనము, తపస్సు, తీర్థయాత్ర దానము యజ్ఞము మున్నగు భేదములతో బహువిధము. ఈ కర్మయోగము జీవునియందలి కల్మషములను బోఁగొట్టి జ్ఞానయోగమును గలిగించి దాని ద్వారముగగాని లేదా తానే సాక్షాత్తుగా గాని భక్తి నిగలిగించును.

జ్ఞానయోగోనామ కర్మయోగాన్నిర్మలాన్తఃకరణ స్యేశ్వరశేషత్వేన ప్రకృతివియుక్తస్వాత్మచిన్తనవిశేషః. తస్యసాక్షాద్భక్త్యుపయోగః ఏవం సాధనాన్తరాణామపి స్వాతన్త్ర్యంభక్త్యుపయోగిత్వం చయథా ప్రమాణమూహ్యం.

జ్ఞానయోగ మనఁగాఁ కర్మయోగము వలన నంతఃకరణము నిర్మలమై తానీశ్వరశేషభూతుండను జ్ఞానముతోఁ బ్రకృతిని యుక్తమగు స్వాత్మయొక్క చింతనము ఇది సాక్షాత్తుగా భక్తికి నుపయోగించును. అనఁగా వానికి భక్త్యుత్పత్తి ద్వారముగనే ఉపయోగముకాని సాక్షాత్సాధనములు కావు

భక్తియోగోనామ యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యానసమాధి రూపాష్టాఙ్గయుక్త తైలధారావద విచ్ఛిన్న స్మృతి సన్తానరూపః.

భక్తియోగమనఁగా – యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణా ధ్యాన సమాధులనఁబడు నెనిమిది యంగములు గలదియై నూనెధారవలె నెడతెగని స్మృతిసముదాయము అందు యమనియమాదుల స్వరూపము యోగసూత్రాదుల వలన విస్తరముగాఁ దెలియనగును.

అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము ఇవి యమమనఁబడును, శౌచము సంతోషము తపస్సు స్వాధ్యాయము ఈశ్వర ప్రణిధానము – ఇవి నియమము. స్థిరమును సుఖకరమునగు పద్మాసనాదులు ఆసనము. శ్వాస ప్రశ్వాసములను బంధించుట ప్రాణాయామము ఇంద్రియములను దమతమ విషయములనుండి మరలించుట ప్రత్యాహారము. ధ్యేయమునందు మనసును నిలుపఁబెట్టుట ధారణ యగును ధ్యేయమునందు జ్ఞానము నిరంతరముగా ప్రవృత్తము గావించుట ధ్యానము ధ్యేయమునందు మనస్సును ఏకాగ్రము కావించుట సమాధియగును.



సదవివేక విమోకాభ్యాస క్రియా కల్యాణానవసాదానుద్ధర్షరూప సాధన సప్తకజన్యః. తత్రవివేకోనామ – జాత్యాశ్రయ నిమిత్తాదుష్టాదన్నాత్కాయ శుద్ధిః. విమోకః – కామానభిష్వఙ్గః. అభ్యాసః – పునఃపునరాలమ్బన సంశీలనం

శక్తితఃపఞ్చ మహాయజ్ఞాద్యనుష్ఠానం క్రియా. సత్యార్జవదయా దానాహింసా నభిధ్యాః కల్యాణాని. అనవసాదః – దైన్యాభావః. అనుద్ధర్షః – తుష్ట్యభావః. అతిసన్తోషశ్చ విరోధీత్యర్థః

భక్తియోగము వివేక, విమోక, అభ్యాస, క్రియా, కల్యాణ, అనవసాద, అనుద్ధర్షములను ఏడు సాధనముల వలన జనించును. వివేకమనఁగా దోషశూన్యమగు నాహారము వలన శరీరశోధనము ఆహారపదార్థములకు జాతివలనను ఆశ్రయమువలనను నిమిత్తము వలనను మూఁడు విధములగు దోషములు కల్గును ఉల్లి మొదలగునవి జాతిచేతనె దుష్టములు. పతితులు మున్నగు వారియొద్దనున్న పదార్థము ఆశ్రయదుష్టము. శునకము ముట్టినది, ఎంగిలి మున్నగునవి నిమిత్త దుష్టములు ఇట్టి యాహారమును తినరాదు. విమోకము అనఁగా కామమునకు వశముకాకుండుట. అభ్యాసమనఁగా మరల మరల ధ్యాన మునకాలంబనమగు భగవద్విగ్రహమును బరిశీలించుట. క్రియ యనఁగా యథాశక్తిగాఁ బంచమహాయజ్ఞాదుల నాచరించుట సత్యము అర్జవము, దయ, దానము అహింస మున్నగునవి కల్యాణములు. దైన్యములేకుండుట అనవసాదము అతిసంతోషమును బొందకుండుట అనుద్ధర్షము. ఉద్ధర్షమనఁగా నతిసంతోషము. అతిసంతోషముకూడ విరోధియేయగును.

ఏవం సాధన సప్తకానుగృహీతా భక్తిర్దర్శన సమానాకారా అన్తిమ ప్రత్యయావధికా భవతి. సచాన్తిమ ప్రత్యయః ఏతచ్ఛరీరావసానేవా – శరీరాన్తరావసానేవా భవతి. వేదనధ్యానోపాసన శబ్దవాచ్యా, చ భక్తిః పరభక్తి పరజ్ఞాన పరమభక్తిరూప క్రమవతీ, ప్రపత్త్యఙ్గికా, చ. సాద్వివిధా – సాధన భక్తి ఫలభక్తి భేదాత్. సాధనజన్యా సాధనభక్తిః. ఫలభక్తిస్తు – ఈశ్వర కృపాజన్యపరాఙ్కుశ నాథాదినిష్ఠా. * మద్భక్తజనవాత్సల్య మిత్యాదిషుస్తుతి నమస్కారాదిషు చ భక్తిశబ్ద ప్రయోగ ఔపచారికః.

సాధన సప్తకానుగృహీతమగు నీభక్తి దర్శన సమనాకారమయి అంతిమ జ్ఞానపర్యంతము నాచరింపదగియుండును. ధ్యానగోచరుండగు

భగవంతుఁడు దర్శింపఁబడుచున్నట్లు మనస్సునకు సాక్షాత్కరింపఁబడుటయే దర్శన సమానాకారత్వ మనఁబడును "స్వప్నే వృక్షే చ పశ్యామి" అన్నట్లు ధ్యానాతిశయము వలన దర్శన సమానాకారత ప్రాప్తించును అ తిమప్రత్యయము ఈశరీరావసానమునంగాని మరియొక శరీరావసానమునంగాని యగును అంతవరకును బ్రతిదినమును భక్తి నాచరింపవలయును భక్తియే వేదనము ధ్యానము ఉపాసనము మున్నగు శబ్దములచే వ్యవహరింపఁబడును అది పరభక్తి పరజ్ఞానము పరమభక్తి యను రూపములతోఁ గ్రమవృద్ధి బెందును దీనికిఁ బ్రపత్తియంగమును అగును లేదా యిది ప్రపత్తికి అంగమగును.

అది సాధనభక్తి ఫలభక్తి యని ద్వివిధము వెనుక జెప్పిన రీతి సాధనములవలనఁ గల్గిన భక్తి సాధనభక్తియగును సాధనములవలనఁగాక భగవత్కృపాజన్యమగుభక్తి ఫలభక్తియగును. ఇది శ్రీ పరాంకుశ నాథాదులయందు గలిగియుండెను భక్తి అష్టవిధమని కొన్నిచోట్ల చెప్పఁబడియున్నది "మద్భక్తజన వాత్సల్యం, పూజాయాంచానుమోదనమ్। స్వయమభ్యర్చనం చైవ మదర్థేదంభవర్జనమ్। మత్కథాశ్రవణే భక్తిః స్వరనేత్రాంగవిక్రియా। మమానుస్మరణం నిత్యం యచ్చమాం నోప జీవతి" అని చెప్పఁబడిన భక్తజన వాత్సల్యము మున్నగువానియందును. నుతినమస్కారాదుల యందును భక్తియని వ్యవహరించుట యౌపచారికమేకాని ముఖ్యముకాదు.

నను వేదాన్తేషు శ్రవణమననయోరపి విధానాత్కథం ధ్యానమేవవిధీయత ఇతిచేత్. ఉచ్యతే – అధీత సాఙ్గవేదః పురుషః ప్రయోజనవదర్థావబోధిత్వ దర్శనాత్తన్నిర్ణయాయస్వయమేవ శ్రవణే ప్రవర్తత ఇతి శ్రవణస్య ప్రాప్తత్వాదనువాదః. శ్రవణ ప్రతిష్ఠార్థత్వాన్మననస్యాప్యనువాదః. తస్మాద్ధ్యానమేవ విధీయత ఇతి నవిరోధః. ధ్యానశబ్దవాచ్యాభక్తిర్విద్యాభేదాద్బహువిధా భవతి. తాశ్చవిద్యాద్వివిధాః – ఐహికఫలాముక్తి ఫలాశ్చేతి. తత్రైహిక ఫలాఉద్గీథ విద్యాదయః. ముక్తిఫలాస్తు అన్తరక్షివిద్యాఽన్తరాదిత్య విద్యాదహర విద్యా భూమవిద్యా సద్విద్యా మధువిద్యోపకోసలవిద్యా శాణ్డిల్య విద్యాపురుష విద్యా ప్రతర్దన విద్యావైశ్వానరవిద్యా పఞ్చాగ్ని విద్యాదికాః బ్రహ్మవిద్యాః.

వేదాంతములయందు "శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అని శ్రవణ మననములుకూడ విధింపఁబడియుండగా ధ్యానము మాత్రమే విధింపఁబడినదనుట యెట్లు' అని శంకింపరాదు ఉపనిషత్తునందు శ్రవణమననములు అను వదింపఁబడినవే కాని నూతనముగా విధింపఁబడలేదు ధ్యానమొక్కటియే విధింపఁబడెను. సాంగవేదాధ్యయనముచేసిన పురుషుఁడు తానధ్యయనము కావించిన వేదము స్వభావముచేతనే ప్రయోజనవంతమయిన యర్థమునే బోధించునని తెలిసికొని యదినిర్ణయించు కొనుటకు శాస్త్రవిధాన మక్కఱలేకయే శ్రవణమునకుఁ బ్రవర్తించును శ్రవణము ప్రాప్తించియే యుండుటచే దానికి అనువాదమే కాని విధానముకాదు. వినినది స్థిరపరచుకొనుటకే మననము కావున నదియుఁ బ్రాప్తించియే యుండుటంబట్టి అనువదింపఁబడినదియేకాని విహితముకాదు ఆచార్యులవలన వినిన యర్థమును దనలోఁదాను ఈ యీ కారణములచే నిదియే యుక్తమని స్థిరపరచుకొనుటయే మననము కావున నిదియు ననువాదమే కావున ధ్యానమొక్కటియే విధింపఁబడినదనుట యుక్తమే (పరభక్తి యనఁగా సాక్షాత్కారాభినివేశము పరిజ్ఞానమనఁగా సాక్షాత్కారము. పరమభక్తి యనఁగా అనుభవాభినివేశము.)

ధ్యానము అని చెప్పఁబడుచున్న యీభక్తి విద్యానామములతో బహువిధముగానున్నది. అంతరక్షివిద్య, అంతరాదిత్యవిద్య దహరవిద్య భూమవిద్య సద్విద్య, మధువిద్య. ఉపకోసలవిద్య. శాండిల్యవిద్య, ఉదీనవిద్య పురుషవిద్య, ప్రతర్దనవిద్య, వైశ్వానరవిద్య మున్నగు బ్రహ్మవిద్యలు భక్తిభేదములే,

న్యాసవిద్యా ప్రపత్తిః. సా చ * అనన్య సాధ్యేస్వాభీష్టే మహావిశ్వాస పూర్వకం। తదేకోపాయతాయాఞ్చా ప్రపత్తిశ్శరణాగతిరిత్యుక్తా, ఏతద్దేహావసానేమోక్షప్రదా, అన్తిమ ప్రత్యయ నిరపేక్షా, సకృత్కర్తవ్యా న్యాసశ్శరణాగతిరిత్యాది శబ్దవాచ్యా, జ్ఞానవిశేషరూపా,. ఏషారహస్యాదిశాస్త్రేషు సత్సమ్ప్రదాయపూర్వకం జ్ఞాతవ్యేతిహబాల బోధనార్థ ప్రవృత్తగ్రన్థేనప్రకాశ్యేతి విరమ్యతే.

న్యాసవిద్య ప్రపత్తియనఁబడును. ప్రపత్తి అయిదు అంగములతోఁగూడి యున్నది. ఆనుకూల్య సంకల్పము ప్రాతికూల్య వర్జనము రక్షించునను విశ్వాసము, గోప్తృత్వవరణము, ఆత్మనిక్షేప కార్పణ్యము అను నయిదును అంగములు. ఈ ప్రపత్తి జ్ఞానవిశేషరూపము. ఇది యీ శరీరావసానముననే మోక్షమునిచ్చును. ఒక్కసారియే యిది యాచరింపఁదగినది. ఇది న్యాసము, శరణాగతి మున్నగు శబ్దములచే వ్యవహరింపఁబడును. ఈ ప్రపత్తి ఆచార్యులవలన రహస్యశాస్త్రములయందు సంప్రదాయానుసారముగాఁ దెలిసికొనఁదగినది. కావున బాలబోధనమునకై రచియింపఁబడిన యీ గ్రంథమున నే వివరింపఁబడలేదు.

సాధ్యభక్తి సాధనభక్తియని భక్తి మరల ద్వివిధము. భగవత్ప్రాప్తికి భగవానుడే యుపాయమను స్థిరబుద్ధి సాధ్యభక్తియగును. భగవత్ప్రాప్తికి భగవద్భక్తియే సాధనము అను బుద్ధిసాధనభక్తియగును. వీనిలో సాధ్యభక్తియే గొప్పది. అదియే ప్రపత్తి. అది ప్రారబ్ధకర్మ ననుగూడ నశింపఁజేయును. సాధనభక్తి ప్రారబ్ధేతర పాపమును మాత్రము నశింపఁజేయును. విశేషములు ప్రపత్తిశాస్త్రములందుఁ దెలియనగును )

భక్తి ప్రపత్త్యోరేవ మోక్షసాధనత్వేన స్వీకారాత్ పరోక్తోపాయ నిరాసః. వేదబాహ్యానా మధ్యేకేషాం చిన్మతే దేహాతిరిక్తాత్మనో ఽ నఙ్గీకారాన్మోక్ష ప్రవృత్తిరేవ నసమ్భవతి. అన్యేషాంమతే జ్ఞానస్య క్షణికత్వాత్తస్యైవాత్మత్త్వాకారస్య ప్రవృత్తిర్న సమ్భవతి. సన్తానస్యేతిచేన్న–అన్యాఙ్ప్రత్యన్యే–నహియత్నోనకార్యః. ఇతినప్రవృత్తిః. అపరేషాంమతే సత్త్వాసత్త్వాది సప్తభఙ్గీరిత్యానైకాన్తవాదాన్న ప్రవృత్తిః. వైశేషికాదిపక్షే పాషాణకల్పమోక్షే ప్రవృత్తిః కస్యాపి నసమ్భవతి. సాఙ్ఖ్యాదిపక్షేష్వీశ్వరాఙ్గీకారాత్పురుషస్యాప్రకృతేర్వా మోక్ష ఇతి సంశయాన్న ప్రవృత్తిః. మాయిమతే వ్యావహారికవాక్యస్య పారమార్థికాభేదజ్ఞానా జనకత్వాన్న ప్రవృత్తిః. భాస్కరయాదవోక్తకర్మజ్ఞాన సముచ్చయవాదోప్యుక్తన్యాయేన నిరస్తః. శైవమతేతు పశుపతేః ప్రాప్యత్వస్వీకారాత్, వేదవిరుద్ధ భస్మధారణాదేస్సాధనత్వేనస్వీకారాచ్చ తన్నిరాసః. ఏవం మతిర్నిరూపితా.

భక్తిప్రపత్తులే మోక్షసాధనములనుటచే నితరులుచెప్పిన యుపాయములు సరికావని తెలియఁబడుచున్నది. వేదప్రామాణ్యము నంగీకరింపనివారిలో కొందఱు (చార్వాకుల) మతమున దేహాతిరిక్తముగ ఆత్మయే అంగీకరింపఁబడనందున మోక్షము విషయమునఁ బ్రవృత్తియే లేదు మఱికొందఱి (బౌద్ధుల) మతమున జ్ఞానమే ఆత్మయగుటచేతను జ్ఞానము క్షణికమగుటచేతను మోక్షమునుగుఱించి యెవ్వరు ప్రవర్తింతురు? ఆత్మ క్షణములో నశించునుగదా! క్షణికమయినను అట్టి జ్ఞానములయొక్క పరంపరయే ప్రవర్తించుననుటకును వలనుపడదు. ఒకయాత్మ మోక్షముగురించి యింకొకయాత్మ ప్రవర్తించుట కుదురదుగదా! మఱికొందఱి (జైనుల) మతమున నంతటను అవిశ్వయబుద్ధియే యుండుటచేఁ బ్రవృత్తి యుండదు వైశేషికాదుల పక్షమున మోక్షము పాషాణకల్పకమగుటచే దానికొఱకెవ్వరును యత్నింపరు. సాంఖ్యాదుల పక్షమున నీశ్వరుఁడు లేనందున మోక్షము పురుషునకా? ప్రకృతికా? అని సంశయము కావునఁ బ్రవృత్తియుండదు. మాయావాదుల మతమున వ్యావహారిక సత్యమగు తత్త్వమస్యాదివాక్యము పారమార్థిక సత్యమగు నభేదజ్ఞానమును గల్గింపదు కావునఁ బ్రవృత్తియుండదు వ్యావహారిక సత్యమగు విషము ప్రాతిభాసిక సర్పమువలనఁ గలుగదుకదా! అట్లే వ్యావహారిక సత్యమగు తత్త్వమస్యాది వాక్యము పారమార్థిక సత్యమగు నభేదజ్ఞానమును గలిగింపలేదు.

భాస్కరయాదవుల మతమునఁ గర్మజ్ఞాన సముచ్చయము మోక్షసాధనమనుటయు సరిపడదు. భక్తియొక్కటియే మోక్షసాధనమని నిరూపితము శైవమతమునఁ బశుపతియే ప్రాప్యమని తలంచుటచేతను వేదవిరుద్ధములగు భస్మధారణాదులను సాధనముగా స్వీకరించుటచేతను ఆ మతమును అయుక్తమే. ఇట్లు ధర్మభూతజ్ఞానము నిరూపితము.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం
ధర్మభూతజ్ఞాననిరూపణంనామ సప్తమోవతారః.

ఇది బుద్ధినిరూపణమనఁబడు సప్తమావతారము,

---

# అష్టమో వతారః

---

అథజీవో నిరూప్యతే – ప్రత్యక్త్వచేతనత్వాత్మత్వకర్తృత్వాదీని ఈశ్వరజీవసాధారణానిలక్షణాని ప్రత్యక్త్వం నామస్వస్మై స్వయమేవభాసమానత్వం, చేతనత్వంనామ – జ్ఞానాశ్రయత్వం. ఆత్మత్వం – శరీరప్రతి సమ్బన్ధిత్వం, కర్తృత్వం – సఙ్కల్పజ్ఞానాశ్రయత్వం. ఏవం సామాన్యలక్షణ లక్షితస్య జీవస్య విశేష లక్షణాన్యుచ్యన్తే.

ఇంక జీవస్వరూపము నిరూపింపఁబడును. ప్రత్యక్త్వము, చేతనత్వము, ఆత్మత్వము, కర్తృత్వము, మున్నగు లక్షణములు జీవుని యందును ఈశ్వరునియందును గూడ నుండునవి. ప్రత్యక్త్వమనఁగాఁ దనంతటను తనకు భాసించుట చేతనత్వమనఁగా జ్ఞానము కలిగియుండుట ఆత్మత్వమనఁగా శరీరప్రతి సంబంధియగుట. అనఁగా శరీరము దేనికి సంబంధించినదో యదియనిభావము. కర్తృత్వమనఁగా సంకల్ప జ్ఞానాశ్రయత్వము, ఇవి సామాన్యలక్షణములు. ఇంక జీవుని విశేషలక్షణములు చెప్పఁబడును.

అణుత్వేసతి చేతనత్వం, స్వతశ్శేషత్వేసతి చేతనత్వం. ఏవమాధేయత్వ విధేయత్వ పరతన్త్ర కర్తృత్వ పారతన్త్ర్యత్వాదిక మప్యూహ్యం. జడదేహేన్ద్రియ మనఃప్రాణధీభ్యో విలక్షణః. యథా – మమశరీరమితి ప్రతీత్యా దేహాద్వ్యావృత్తః.

అణుత్వముగల చేతనుఁడు జీవుఁడు. శేషత్వముగల చేతనుఁడు జీవుఁడు. శేషత్వమనఁగా యథేచ్ఛముగా నుపయోగించుకొనఁదగి యుండుట. పరమాత్మకు జీవుఁడు స్వేచ్ఛగా వినియోగించుకొనఁదగినవాడు కావున లక్షణము సరిపడుచున్నది. ఇట్లే ఆధేయత్వము గల చేతనత్వము, విధేయత్వము గల చేతనత్వము, పరాధీనకర్తృత్వము గల చేతనత్వము, పరతంత్రత్వముగల చేతనత్వమును జీవలక్షణము లగును. ఆధేయత్వమనఁగా నొకదానిని నాశ్రయించి యుండుట.

విధేయత్వమనఁగా నియమింపఁదగియుండుట. జీవుఁడు పరమాత్మకు ఆధేయమును విధేయమును గావున లక్షణము సరిపడును.

జీవుఁడు దేహము కంటెను ఇంద్రియముల కంటెను మనస్సు కంటెను ప్రాణముకంటెను భిన్నమగు పదార్థము అది యెట్లన్—"ఇది నా శరీరము" అని ప్రతీతియగుటచే శరీరము వేరనియు "నా" శబ్దార్థము వేరనియుఁ దెలియఁబడుచున్నది

(చార్వాకులు దేహమే ఆత్మయనియు దేహముకంటె వేరుగా నాత్మలేదనియు నందుచేతనే దేహము జన్మింపకముందుగాని దేహనాశానంతరముగాని యాత్మలేదనియుఁ జెప్పుదురు. కావుననే "స్థూలోహమ్" "కృశోహమ్" అనఁగా నేను స్థూలముగానున్నాను నేను కృశించియున్నాను. అని వ్యవహరింపఁబడుచున్నది స్థూలత్వ కృశత్వములు దేహమునకేకదా సంభవించును. కావున దేహమే ఆత్మ అని వారందురు. అది సరికాదు. ఇది నాశరీరము అనుచోట "నా" శబ్దార్థమును "ఇది" శబ్దార్థమును గూడ నొక్కటి కారాదు. అది శాస్త్రవిరుద్ధము "నఖల్వహమిదం కారావేకస్యైకత్రివస్తుని" అని శాస్త్రము "స్థూలోహం" ఇత్యాది ప్రయోగము లాక్షణికమే కాని ముఖ్యముకాదు అంతియేకాక దేహమునకు భూతములు కారణముగదా కారణములయిన భూతములందు లేని చైతన్యము దేహమునందెట్లు సంభవించును ? విశేషగుణములు కారణగుణ పూర్వకములుగదా ! "ఉత్పత్తి కలది కనుక దేహమాత్మకాదు" అనురీతి ననుమానముచేతను దేహమాత్మకాదని తెలియఁబడుచున్నదో. ఈ వాదవిశేషములు గ్రంథాంతరములనుండి తెలిసికొనవలయును )

చక్షుషా పశ్యామి – శ్రోత్రేన్ద్రియేణ శృణోమి – వాచా వదామీత్యాది ప్రత్యయాద్బాహ్యేన్ద్రియేభ్యో వ్యావృత్తః మనసః కరణత్వప్రతీతేః, ర్మమప్రాణ ఇతి వ్యతిరేకోక్త్యా, జానామ్యహమితి ప్రతీత్యా చ మనః ప్రాణజ్ఞానేభ్యో వ్యావృత్తః

"కంటితోఁ జూచుచున్నాను. చెవితో వినుచున్నాను" ఇత్యాది ప్రతీతుల వలన బాహ్యేంద్రియములు ఆత్మ కావని తెలియనగును. చూచునది వేరు చూచుటకు సాధనమగు కన్ను వేరు అని యిచ్చట భాసించుచున్నది కదా! "మనస్సుచేఁ దెలిసికొనుచున్నాను" అను ప్రతీతివలన మనస్సు ఆత్మకాదని తెలియుచున్నది "నాప్రాణములు" అని తానువేరు ప్రాణములు వేరు అని భాసించుటచేతఁ బ్రాణ మాత్మ కాదు. "నేను తెలిసికొనుచున్నాను" అని ప్రతీతికలదు. తెలిసికొనుచున్నాను అనఁగా జ్ఞానమున కాశ్రయమగుచున్నాను అని కదా యర్థము. అనఁగా జ్ఞానమువేరు జ్ఞానముగల వస్తువువేరు అని అంగీకరింపక తప్పదు. అందువలన జ్ఞాన మాత్మకాదనియు నది కలదిమాత్రమే ఆత్మయనియుఁ దెలియఁబడుచున్నది. కావున దేహము, ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, జ్ఞానము కూడ నాత్మకాదు. అంతకంటె భిన్నమగు నాత్మకలదు అని నిశ్చితము. అదియే జీవశబ్ద వాచ్యము.

సచాణు పరిమాణః - ఉత్క్రాన్త్యాది శ్రవణాత్, ప్రమాణానుసారాచ్చ. అణుత్వే సతి యుగపదనేకవిషయానుభవః కథమితి నశఙ్కనీయం - ధర్మభూతజ్ఞాన వ్యాప్త్యోపపత్తేః. ఏతేన సౌభరి ప్రభృతీనాం ముక్తానాం చ అనేక శరీర పరిగ్రహోఽపి సమ్భవతి.

అట్టి జీవుఁడు అణుపరిమాణుఁడు. జీవునికి శరీరమునుండి యుత్క్రాంతియు గమనము ఆగమనము శ్రుతులవలనఁ దెలియఁబడుచున్నది "తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నో వా అన్యేభ్యో వా శరీర దేశేభ్యః" "యేవై కేచాస్మాల్లోకాత్ప్రయన్తి చన్ద్రమసమేవ తే సర్వే గచ్ఛన్తి" "తస్మాల్లోకాత్పునరేత్య అస్మై లోకాయ కర్మణే" అను శ్రుతులవలన ఉత్క్రాంతియు గమనము ఆగమనము వరుసగా బోధింపఁబడుచున్నవి. కావున విభువనుటకు వలనుపడదు. "వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ । భాగో జీవస్సవిజ్ఞేయః" ఇత్యాది ప్రమాణముల ననుసరించి జీవుఁడణు పరిమాణుఁడనియు విభువు కాదనియుఁ దెలియఁ బడుచున్నది.

"జీవుఁడణువయినచో ననేకేంద్రియములతో నొక్కమారు కలయిక సంభవింపదు కదా! ఒక్కసారి యనేక విషయముల యనుభవము కానవచ్చుచున్నది కదా! సుగంధముగల తీయని చల్లని పానీయమును ద్రాగుచున్నపుడు ఘ్రాణరసనాత్వగింద్రియముల వలన గంధరసస్పర్శములొక్కసారిగా ననుభూతములగుచున్నవి. ఆత్మ అణువయినచో అనేక విషయముల అనుభవమొక్కసారికల్గుట కుదురదు" అని శంకింపరాదు. ఆత్మ అణువయినను ధర్మభూతజ్ఞానమున్నియింద్రియములతోను సంబంధించును కావున ననేక విషయానుభవమొక్కసారి యుపపన్నమేయగును. ఈ ధర్మభూతజ్ఞానముచేతనే సౌభరిమున్నగు యోగులును, ముక్తులును ఒక్కసారి యనేక శరీరములను పరిగ్రహించుట యుపపన్నమగుచున్నది.

సచనిత్యః – పూర్వానుభూతార్థ ప్రతిసన్ధానాత్. నిత్యశ్చేజ్జీవః – ఉత్పన్నోనష్ట ఇతి ప్రతీతిః కథమితిచేన్న – జీవస్య దేహసమ్బన్ధాదుత్పత్తిః – తద్వియోగాన్నాశ ఇతి ప్రతిపాదనాత్ జీవస్వరూపం నిత్యమేవ.

ఆట్టి జీవుఁడు పూర్వమనుభవించిన యర్థమును స్మరించుచుండుట వలన నిత్యుఁడని నిశ్చయము కానిచో ననుభవకాలముననున్న జీవుఁడు స్మరణకాలమున లేనందున స్మరణమే కుదురదు.

అంతియకాక "నజాయతే మ్రియతేవావిపశ్చిత్" "జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ" ఇత్యాది శ్రుతులును జీవుఁడు నిత్యుఁడనుటలోఁ బ్రమాణములు. జీవుఁడనిత్యుఁడే యయినచోఁ జేసినకర్మల ఫలమనుభవించుట కుదురదు. చేయని కర్మల ఫలమనుభవింపవలసియు వచ్చును కర్మలు చేయునప్పటికి ఉన్న జీవుఁడు వేరు. అనుభవించునప్పటికున్న జీవుఁడు వేరను కావున నిత్యుఁడనవలయును). జీవుఁడు నిత్యుఁడయినచో "జీవుఁడుద్భవించెను – జీవుఁడు నశించెను" ఇత్యాది ప్రతీతులు ఎట్లు ఉపపన్నమగునని శంకింపరాదు. జీవుఁడు నిత్యుండేయయినను ఆతనికి దేహసంబంధమును ఉత్పత్తియనియు దేహవియోగమును వినాశనమనియుఁ బ్రతిపాదించుటచేత జీవస్వరూపము నిత్యమేయగును.

ప్రతిశరీరం భిన్నాః. సమపరిమాణేషు స్వర్ణఘటేష్వేకోఘట ఇతి ప్రతీతివత్, వ్రీహిరాశావేకో వ్రీహిరితి ప్రతీతివ, జ్ఞానైకాకారతయా ఏకత్వవ్యవహారః. నతుస్వరూపైక్యం – ప్రమాణ విరోధాత్.

ఒక్కొక్క శరీరమునందొక్కొక జీవుఁడుండును. అనఁగాఁ బ్రతిశరీరము నందును ఉండు జీవులు భిన్నులని తెలియనగును. నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం" అను శ్రుతియు జీవ బహుత్వమునే చెప్పుచున్నది "భోక్తాభోగ్యం ప్రేరితారంచమత్వా" అను శ్రుతి జీవుని యేకత్వమునే ప్రతిపాదించుచున్నట్లు కానవచ్చినను జీవులన్నియు జ్ఞానైకాకారులగుటచే నేకత్వ వ్యవహారము కల్గినేకాని స్వరూపైక్యము చేత మాత్రము కాదు. సమాన పరిమాణముగల యనేక సువర్ణఘటములందు ఒక్క ఘటమనియు వ్రీహిరాశియందు వ్రీహి యనియుఁ బ్రతీతికలె నీప్రతీతియు నాకార సామ్యముచేతనే యనుట యుపపన్నమగును. ప్రమాణములకు విరుద్ధముగా జీవస్వరూపైక్యము మాత్రము ఉపపన్నముకాదు

స్వతస్సుఖీ ఉపాధివశాత్సంసారీ. అయంచ కర్తాభోక్తా శరీరీ శరీరం చ భవతి. ప్రకృత్యపేక్షయాశరీరం చ. అస్యప్రత్యక్ష శ్రుతిభ్యాం. స్వయం ప్రకాశత్వం చ సిద్ధం, ప్రయోగశ్చ ఆత్మా స్వయంప్రకాశః – జ్ఞానత్వాత్- ధర్మభూతజ్ఞానవదితి.

జీవుఁడు సహజముగా సుఖి. ఉపాధివలన ననఁగా నచిత్సంబంధము వలన సంసారము కలుగును. కర్తయుఁ గర్మఫలాదులకు భోక్తయు శరీరము కలవాఁడును, శరీరమునుగూడనగును. ప్రకృతి వికారమగు పాంచభౌతిక శరీరమునుబట్టి శరీరియు ఈశ్వరునిబట్టి శరీరము అగును "యస్యాత్మా శరీరమ్" అనుశ్రుతి పరమాత్మకు జీవుఁడు శరీరమగుటకుఁ బ్రమాణము. ఈ ఆత్మకు 'అహమ్' అని స్వయం ప్రకాశత్వము ప్రత్యక్షసిద్ధము. (తనకుఁదాను భాసించుట స్వయం ప్రకాశత్వం) "అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి" ఇత్యాది శ్రుతులచేతనుగూడ స్వయం ప్రకాశత్వము సిద్ధించును. "ధర్మభూత

జ్ఞానమువలె జ్ఞానస్వరూపుఁడు కావున జీవుఁడు స్వయంప్రకాశుఁడు" అని యనుమానముచేతను స్వయం ప్రకాశత్వము సిద్ధించుచున్నది. స్వయం ప్రకాశత్వమనఁగా ననన్యాధీన ప్రకాశత్వము. ఇదియే అజడత్వము,

జ్ఞానత్వామలత్వాదయః ఏతత్స్వరూప నిరూపక ధర్మాః. ఏతేన జ్ఞానస్య క్షణికత్వాత్ క్షణిక సన్తానరూప ఆత్మేతి బౌద్ధపక్షః, భూతచతుష్టయాత్మకత్వాద్దేహస్య దేహావధిక ఆత్మేతి చార్వాకపక్షః, గజదేహే గజపరిమాణః - పిపీలికాదేహే పిపీలికాపరిమాణ ఇతి జైనపక్షః, కర్తృత్వ భోక్తృత్వాదికం ప్రకృతేరేవ నపురుషస్యేతి సాఙ్ఖ్యపక్షః, బ్రహ్మాంశో జీవ ఇతి యాదవపక్షః, ఔపాధిక బ్రహ్మఖణ్డో జీవ ఇతి భాస్కరపక్షః, అవిద్యాపరికల్పితైకజీవ వాద పక్షః, అన్తఃకరణావచ్ఛిన్నానేకజీవ వాదపక్షః, ఇత్యేవమాదయో విరుద్ధపక్షాశ్చ నిరస్తాః, విభుత్వవాదపక్షోపి. ననుజీవస్య విభుత్వాభావే దృష్టజనిత దేశాన్తర ఫలోపలబ్ధిః కథమితిచేన్న - జీవస్య సమ్బన్ధాభావేపి అదృష్టవశా - దుపపద్యతే. అదృష్టంనామ భగవత్ప్రీతిజనక కర్మవిశేషజన్యో జ్ఞానవిశేషః. సవిశేషో భగవత్సఙ్కల్ప ఏవ విభుస్వరూపం భగవన్తమాశ్రితః అతః ఫలోపలబ్ధిరితి నవిరోధః.

జ్ఞానము, అణుత్వము, అమలత్వము, మున్నగునవి యీజీవునికి స్వరూపమును నిరూపించు ధర్మములు,

ఇట్లు జీవస్వరూపము నిశ్చయింపఁబడుటచే నేతద్విరుద్ధమగు బౌద్ధచార్వాకాదుల పక్షములు నిరస్తములగుచున్నవి, బౌద్ధులు జ్ఞానము క్షణికమనియు నట్టి జ్ఞానపరంపరయే యాత్మయనియుఁ జెప్పుదురు, ఆత్మ నిత్యమనుటచే నీబౌద్ధపక్షము సరికాదు,

దేహము పృథివ్యాది చతుర్భూతాత్మకము కావున దేహమున్నంత కాలము ఆత్మయుండుననియుఁ జెప్పెడి చార్వాకపక్షమును ఆత్మ నిత్య మనుటచేతనే నిరస్తము "ఆత్మ ఏశరీరమునందుండునో ఆ శరీరము నంతపరిమాణముగలది, గజదేహమున నాత్మ గజపరిమాణకము,

దేహయందలియాత్మ దేహమంత పరిమాణముగలదియగు" యను జైనుల పక్షమును ఆత్మ అణుపరిమాణకమని నిరూపించుటచే నిరస్తమే. కర్తృత్వభోక్తృత్వములు జీవుని ధర్మములని స్థాపించుటచే "కర్తృత్వ భోక్తృత్వములు ప్రకృతి ధర్మములేకాని పురుషునివి కావు" అను సాంఖ్యుల పక్షము నిలువదు. బ్రహ్మాంశమే జీవుడను యాదవపక్షమును బ్రహ్మకంటె జీవుడు భిన్నుడని నిరూపించుటచే సరికాదు. ఇంక నీపక్షమున ననేక దోషములు కలవు. ఉపాధిసహితమగు బ్రహ్మ ఖండమే జీవుడను భాస్కరపక్షమును భేదనిరూపణముచేతనే త్రోసి వేయబడెను.

"అవిద్యాశబలమగు బ్రహ్మయే జీవుడు. అతడును అన్ని శరీరములయందును నొక్కడే" అని శాంకరాద్వైతులు చెప్పుదురు. జీవబ్రహ్మలకును జీవులకు బరస్పరమును భేదమే ప్రామాణికమని నిరూపితమగుటచే శాంకరమతమును అనుపపన్నము.

అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము జీవుడనియు అంతఃకరణభేదముచే ననేకజీవులు సిద్ధింతురనియు జెప్పెడి మతమును సరికాదు. అంతఃకరణము కల్పాంతమున నశించును మరలగల్పాదిని అంతఃకరణాంతరము జనించును. దానింబట్టి యంతఃకరణభేదముచే జీవభేదమును నీమతమున ననివార్యము. ఇదియు జీవనిత్యత్వవిరోధి కావున అనంగీకార్యము. జీవుని అణుత్వ ప్రతిపాదనమువలన విభుత్వమును జెప్పెడి పక్షమును అపాస్తమే. జీవుడు విభువుకానిచో నదృష్టవశమున దేశాంతరమున జన్మించిన ఫలమెట్లు లబ్ధమగుననుశంక యక్కరలేదు. జీవునికి దేశాంతర సంబంధములేకున్నను అదృష్టవశముననే యుపపన్నమగును. అదృష్ట మనగా భగవత్సంకల్పమే కావున నాసంకల్పమువలననే ఫలప్రాప్తి కలుగునని తెలియవలెను. భగవంతునికి బ్రీతిగాని, యప్రీతికాని కల్గించెడి జీవుడు చేయుకర్మవలన జనించిన యొక జ్ఞానవిశేషము అదృష్టము. అది భగవత్సంకల్పమే అది విభుస్వరూపుడయిన భగవంతుని నాశ్రయించియుండును కావున జీవునికి దేశాంతర ఫలలబ్ధియగుటలో విరోధము లేదు.

సజీవస్త్రివిధః బద్ధముక్త నిత్యభేదాత్. తత్రబద్ధోనామ — అనువృత్తసంసారాశ్చతుర్దశభువనాండకటాహవర్తినో బ్రహ్మాదికీటపర్యన్తాశ్చేతన విశేషాః శ్రీమతో నారాయణస్య నాభికమలాదుత్పన్నో బ్రహ్మా. బ్రహ్మణో రుద్రః. తథా బ్రహ్మణస్సనకాదియోగినో, నారదాది దేవర్షయో, వసిష్ఠాది బ్రహ్మర్షయః, పులస్త్య మరీచి దక్ష కశ్యపాది నవ ప్రజాపతయో, భృగవః. త్రిలోకదేవా, దిక్పాలకా, శ్చతురశీతా, శ్చతుర్దశమనవో, ఉ సురాః, పితర, స్సిద్ధగన్ధర్వకిన్నర కింపురుష విద్యాధరాదయో, వసవో, రుద్రా ఆదిత్యా, అశ్వినౌ, చ దానవ యక్ష రాక్షస పిశాచ గుహ్యకాదయః, ఏవం దేవయోనయో బహువిధాః— మనుష్యా అపి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది భేదాద్బహువిధాః, తిర్యఞ్చోపి పశు మృగ పక్షి సరీసృపపతఙ్గ కీటకాది భేదాద్బహువిధాః. స్థావరా అపి వృక్ష గుల్మలతా వీరుత్తృణాది భేదాద్బహువిధాః, వృక్షాదీనాం జలాహరణాద్యుక్త శక్తిర్బద్ధానసమ్బన్నో ఽ స్త్యేవ — * అప్రాణవత్సు స్వల్పాసేత్యుక్తత్వాత్. అతో దేవ మనుష్య తిర్యక్స్థావరభేదభిన్నా బద్ధాః ఏతే పునర్జరాయుజాణ్డజోద్భిజ్జస్వేదజాశ్చభవన్తి. దేవమనుష్యా జరాయుజాః. తేషు బ్రహ్మరుద్రాదయస్సనకాదయ, శ్చసీతా ద్రౌపదీ దృష్టద్యుమ్న ప్రభృతయో, భూత భేతాలాదయ, శ్చాయోనిజాః. తిర్యగాదయశ్చజరాయుజా అణ్డజాస్స్వేదజాశ్చ భవన్తి స్థావరాశ్చ ఉద్భిజ్జాః. ఏవమ్భూతాబద్ధాబీజాఙ్కుర న్యాయేన విషమ ప్రవాహతయాఽనాదికాల ప్రవృత్తావిద్యా కర్మవాసనారుచి ప్రకృతిసమ్బన్ధైశ్చ- క్రవత్పరివర్తమానైర్గర్భజన్మ బాల్యయౌవన జాగరస్వప్న సుషుప్తి మూర్ఛా- జరామరణ స్వర్గనరక గమనాదిషు వివిధ విచిత్రావస్థావనోఽనన్తప్రకారాతిదుస్సహతాపత్రయాభితప్తాస్సన్తః ప్రాప్తభగవదనుభవ విచ్ఛేదవన్తశ్చ.

బద్ధులు, ముక్తులు, నిత్యులు, నని జీవులు మూడు విధములు. సంసారముననుండువారు బద్ధులు. చతుర్దశలోకములతోఁ గూడియున్న యండకటాహమునందున్న బ్రహ్మమొదలు కీటకములవరకు నున్న సమస్త చేతనులును బద్ధులగుదురు.

శ్రీమన్నారాయణుని నాభికమలమునుండి బ్రహ్మ జన్మించెను. ఆతనినుండి రుద్రుఁడు జన్మించెను. అంతియకాక బ్రహ్మనుండి సనకుఁడు మున్నగు యోగులు నారదుఁడు మున్నగు దేవర్షులు వసిష్ఠుఁడు భృగువు

మున్నగు బ్రహ్మర్షులు భృగుప్రముఖుడు మరీచి దక్షుడు కశ్యపుడు మున్నగు తొమ్మండ్రుగురు ప్రజాపతులను గూడ జనించిరి. వారినుండి దేవతలు, దిక్పాలురు పదునల్గురింద్రులు పదునల్గురు మనువులు అసురులు పితరులు సిద్ధులు గంధర్వులు కింనరులు కింపురుషులు విద్యాధరాదులు వసువులు రుద్రులు ఆదిత్యులు అశ్వినీదేవతలు దానవ యక్ష రాక్షస పిశాచ గుహ్యకాదులును జనించిరి ఇట్లు దేవయోనులు జనించిరి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది జాతి భేదమువలన బహువిధులగు మానవులును జన్మించిరి గో మహిషాది పశువులు శార్దూల సింహాది మృగములు పక్షులు పాములు మున్నగు సరీసృపములు మిడతలు మున్నగు పతంగములు, పురుగులు, మున్నగు తిర్యగ్జంతువులు బహువిధములు మఱ్ఱి మొదలగు వృక్షములు, పొదలు, ద్రాక్షాదిలతలు, దొండ మున్నగు వీరుత్తులు (కోసివేసినను వివిధముగా చిగుళ్ళు పెట్టి మొలచు తీగెలు మున్నగునవి వీరుత్తులనబడును) తృణములు మున్నగు స్థావరములు బహువిధములు. వృక్షాదులకును ఇంచుక జ్ఞాన సంబంధముకలదు అట్టి జ్ఞానముచేతనే యవి వీటిని పీల్చుచున్నవి. "అప్రాణవత్సుస్వల్పాసా" అని చెప్పఁబడుటచే వృక్షాదులయందును ఇంచుక జ్ఞాన సంబంధము కలదనుట సప్రమాణము.

కావున బద్ధులు – దేవతలు మనుష్యులు తిర్యక్కులు స్థావరములు అను భేదములు గలవారు. అంతియకాక జరాయుజములు అండజములు ఉద్భిజ్జములు స్వేదజములు అనియు బద్ధజీవుల భేదములు చెప్పవచ్చును. అందు దేవతలు మనుష్యులు జరాయుజులు వారిలోఁ గూడ బ్రహ్మరుద్రాదులు సనకాదులును సీతా ద్రౌపదీ దృష్టద్యుమ్నాదులు భూత భేతాళాదులును అయోనిజులు తిర్యగాదులు – జరాయుజములు, అండజములు, స్వేదజములను గూడ నగును. స్థావరాదులు ఉద్భిజ్జములు

ఇట్టి బద్ధులు బీజాంకురన్యాయమున అనాదికాలమునుండి వచ్చుచున్న అవిద్య, కర్మవాసన, రుచి, ప్రకృతి సంబంధము అనునవి విషమముగాఁ బ్రవహించుచుఁ జక్రమువలెఁ బరిభ్రమించుచుండుటచేత

గర్భవాసము పుట్టుక బాల్యము యౌవనము మేల్కొనుట నిద్రించుట స్వప్నము మూర్ఛ ముసలితనము చావు స్వర్గగమనము నరకగమనము మున్నగు పలురకములును విచిత్రములునగు నవస్థలు కలవారై అనాదియు నత్యంతము సహింపరానిదియు నగు నాధ్యాత్మికాధి భౌతికాధి దైవికము లనబడు తాపత్రియముచేఁ బీడితులై స్వతోలబ్ధమయియున్న భగవదనుభవమునకు సంసారమ్ముచే విచ్ఛేదము కలవారై యుందురు.

తేచ ద్వివిధాః – శాస్త్రవశ్యాస్తదవశ్యాశ్చ. తయోర్మధ్యే కరణాయత్తజ్ఞానానాం బద్ధానాం శాస్త్రవశ్యతాపి తిర్యక్స్థావరాదీనాం నాస్తి. శాస్త్రవశ్యా ద్వివిధాః – బుభుక్షవో ముముక్షవశ్చేతి. తత్ర బుభుక్షవః – త్రైవర్గిక పురుషార్థనిష్ఠాః. తే ద్వివిధాః – అర్థకామపరా ధర్మపరాశ్చేతి. కేవలార్థకామపరా దేహాత్మాభిమానినః. ధర్మపరాశ్చ – అలౌకిక శ్రేయస్సాధనం ధర్మః, చోదనాలక్షణోఽర్థో ధర్మః, ఇతి ధర్మలక్షణలక్షిత యజ్ఞాది దాన తపస్తీర్థయాత్రాదినిష్ఠాః. తేచ దేహాతిరిక్త ఆత్మాభిమానినః పరలోకోఽస్తీతి జ్ఞానవన్తః. ధర్మపరా ద్వివిధాః – దేవతాన్తరపరా భగవత్పరాశ్చేతి. దేవతాన్తరపరా బ్రహ్మరుద్రాద్యారాధనపరాః. భగవత్పరాస్తు * ఆర్తో జిజ్ఞాసురర్థార్థీత్యుక్తాధికారిణః. ఆర్తః – భ్రష్టైశ్వర్యకామః అర్థార్థీ – అపూర్వైశ్వర్యకామః.

వారు శాస్త్రవశ్యులు శాస్త్రావశ్యులు నని రెండు విధములు. వారిలో నింద్రియాధీన జ్ఞానులగు బద్ధులకు శాస్త్రవశ్యత్వము కలదు. తిర్యక్కులకును స్థావరాదులకును శాస్త్రవశ్యత్వము లేదు.

శాస్త్రవశ్యులను – బుభుక్షువులు, ముముక్షువులు నని రెండు విధములు. వారిలో బుభుక్షువులు ధర్మార్థకామములనంబడు పురుషార్థములు మూడింటియందును నాసక్తులగువారు వారును అర్థకామాసక్తులు ధర్మాసక్తులు నని మరల రెండు విధములు. అర్థకామపరులు దేహాత్మాభిమానము కలిగియుందురు ధర్మపరులు – యజ్ఞము దానము తపస్సు తీర్థయాత్ర మున్నగు ధర్మములందాసక్తి కలిగియుందురు ధర్మమనఁగా నలౌకికమగు శ్రేయస్సును సాధించునట్టివి "వేదచోదితము లగునవి ధర్మములు" నియుఁ జెప్పవచ్చును వీరు దేహాతిరిక్తమగు నాత్మకలదనియు దానికి పరలోకము గలదనియుఁ దెలిసినవారు.

ధర్మపరులును – దేవతాంతరపరులు, భగవత్పరులు నని రెండువిధములు. బ్రహ్మ రుద్రుఁడు ఇంద్రుఁడు అగ్ని మున్నగువారి నారాధించువారు దేవతాంతరపరులు "ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ" యని భగవద్గీతలోఁ జెప్పినట్లు భగవత్పరులును త్రివిధాధికారులు ఆర్తుఁడనఁగాఁబోయిన యైశ్వర్యమును గోరువాఁడు అర్థార్థియనఁగా నూతనైశ్వర్యమును గోరువాఁడు. జిజ్ఞాసువనఁగాఁ బ్రకృతివియుకాత్మస్వరూపమును బొందఁగోరువాఁడు. జ్ఞాని యనఁగా భగవత్ప్రాప్తిని గోరువాఁడు,

ముముక్షవో ద్వివిధాః – కైవల్య పరా మోక్ష పరాశ్చేతి. కైవల్యంనామ జ్ఞానయోగాత్ప్రకృతి వియుక్తాత్మానుభవరూపం. సోఽనుభవోఽర్చిరాదిమార్గేణ పరమపదంగతవత ఏవక్వచిత్కోణేపతివియుక్తపత్నీ న్యాయేన భగవదనుభవ వ్యతిరిక్తస్వానుభవ ఇత్యాహుః అర్చిరాది మార్గేణగతస్యా పునరావృత్తి శ్రవణాత్. ప్రకృతిమణ్డల ఏవక్వచిద్దేశేస్వాత్మానుభవ ఇత్యప్యాహుః,

ముముక్షువులును – కైవల్యపరులు మోక్షపరులు నని రెండు విధములు. జ్ఞానయోగమునవలంభించి ప్రకృతిబంధమునుండి విడివడిన యాత్మస్వరూపానుభవము కైవల్యమనఁబడును. ఈ యనుభవముగల వాడు కైవల్యపరుఁడు – ఇతఁడును అర్చిరాదిమార్గమునఁబోయి పరమ పదమునుబొంది యటనొకమూల భర్తవిడచిన భార్యవలె భగవదను భవములేక యాత్మానుభవమును బొందుచుండునని చెప్పుదురు.

మోక్షపరాశ్చద్వివిధాః – భక్తాః ప్రపన్నాశ్చేతి. భక్తాః పునరధీతసాఙ్గ శిరస్కవేదాః. పూర్వోత్తర మీమాంసా పరిచయాచ్చ చిద్విలక్షణా నవధి కాతిశయానన్ద స్వరూపం నిఖిలహేయ ప్రత్యనీకం సమస్తకల్యాణగుణాత్మకం బ్రహ్మవధార్యతత్ప్రాప్త్యుపాయభూతాం భక్తిం స్వీకృత్యతయా మోక్షం ప్రాప్తు కామాః భక్తావధికారః త్రైవర్ణికానామేవ. దేవాదీనామప్యస్తి – అర్థిత్వ సామర్థ్యయో స్సమ్భవాత్. నశూద్రాణా మధికారః – అపశూద్రాధికరణ విరోధాత్. భక్తిస్వరూపంతు బుద్ధిపరిచ్ఛేదే ప్రతిపాదితం.

మోక్షపరులును భక్తులు ప్రపన్నులు నని రెండు విధములు. అంగములతోడను ఉపనిషత్తులతోడనుగూడిన వేదముల నధ్యయనము కావించి పూర్వోత్తర మీమాంసా శాస్త్రముల పరిచయమువలనఁ జెద చిత్తులకంటె విలక్షణమును సత్యజ్ఞానానంద స్వరూపమును నిఖిలహేయములు లేనిదియు సమస్త కల్యాణగుణాత్మకమును అగు బ్రహ్మస్వరూపమును దెలిసికొని దానిని బొందుటకు ఉపాయమగు సాంగమగు భక్తిని స్వీకరించి దానితో మోక్షమును బొందఁగోరువారు భక్తులు. భక్తి చేయుటకు బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు మాత్రమే యధికారముకలదు. భక్తి చేయు సామర్థ్యమును దానియందభిలాషయు నుండుటకవకాశమున్నది. కావున దేవతలకును అధికారముకలదు. అపశూద్రాధికరణ విరోధము వలన శూద్రులకధికారములేదు. భక్తిస్వరూపము బుద్ధిపరిచ్ఛేదమున నిరూపితము.

భక్తొద్వివిధః – సాధనభక్తి నిష్ఠాస్సాధ్యభక్తి నిష్ఠాశ్చేతి. సాధనభక్తి నిష్ఠావ్యాసాదయః. సాధ్యభక్తి నిష్ఠానాథాదయః.

సాధనభక్తినిష్ఠులు, సాధ్యభక్తినిష్ఠులు అని భక్తులును రెండు విధములు వ్యాసాదులు సాధనభక్తి నిష్ఠులు పరాంకుశాదులు (నమ్మాళ్వారు) సాధ్యభక్తినిష్ఠులు. సాధ్యభక్తినే ఫలభక్తియందురు.

ఆకిఞ్చన్యానన్యగతిత్వధర్మ విశిష్టోభగవన్తమాశ్రితః ప్రపన్నః. సద్వివిధః – త్రైవర్గిక పరో మోక్షపరశ్చేతి. త్రైవర్గిక పరోనామ భగవత ఏవధర్మార్థ కామాభిలాషీ. మోక్షపరస్తు సత్సఙ్గత్యాయోవిత్యా నిత్యపరాపర వస్తువివేకేసతి సంసార వైరాగ్యే ఉత్పన్నే మోక్షేచ్ఛాయాం జాతాయాం తన్నిర్వర్త్యర్థం * ఆచార్యోవేదసమ్పన్న ఇత్యాద్యాచార్యలక్షణ లక్షితం గురుం సంశ్రిత్యతద్ద్వారా పురుషకారభూతాం శ్రియం ప్రపద్యభక్త్యాద్యుపాయాన్తరేష్వశక్తోఽత ఏవాకిఞ్చనోఽనన్యగతిః శ్రీమన్నారాయణచరణౌ వేవోపాయత్వేన స్వీకరోతి – సప్రపన్నః ప్రపత్తిస్సర్వాధికారా.

ఆకించన్యము అనన్యగతికత్వము అను ధర్మములుగల్గి భగవంతు నాశ్రయించినవాడు ప్రపన్నుఁడు. అనఁగా సాధనాంతర దేవతాంత రాశ్రయణములు లేక భగవంతు నాశ్రయించినవాఁడని భావము ఆ ప్రపన్నుఁడును – త్రైవర్ణికపరుఁడు మోక్షపరుఁడు నని రెండువిధములు. త్రైవర్ణికపరుఁడు భగవంతుని వలననే ధర్మార్థకామముల నభిలషించువాడు ఏమోక్షపరుఁడు సజ్జనసాహవాసమువలన నిది నిత్యము, ఇది యనిత్యము అను వివేకము కలిగి సంసారమునందలి నిర్వేదముచే వైరాగ్యముకలిగి మోక్ష వాంఛకలుగగా నది సిద్ధించుటకు సదాచార్య లక్షణములుగల గురువు నాశ్రయించి యాతనిద్వారా పురుషకార భూతురాలగు లక్ష్మీదేవి నాశ్రయించి భక్త్యాద్యుపాయము లందశక్తుఁడయి యందుచేతనే యకించనుఁడును ననన్యగతియునయి శ్రీమన్నారాయణ చరణములనే యుపాయముగా స్వీకరించునో యాతఁడు ప్రపన్నుఁడు. ఈ ప్రపత్తి అన్ని వర్ణములవారును స్త్రీ పురుషులును గూడఁ జేయ వచ్చును.

ప్రపన్నో ద్వివిధః – ఏకాన్తీ పరమైకాన్తీచేతి యో మోక్షఫలేనసాకం ఫలాన్తరాణ్యపి భగవత ఏవేచ్ఛతి – స ఏకాన్తీ. దేవతాన్తరశూన్య ఇత్యర్థః. భక్తిజ్ఞానాభ్యామన్యత్ఫలం భగవతోపి నేచ్ఛతియః – సపరమైకాన్తీ. సద్వివిధః – దృప్తార్తభేదాత్ * అవశ్యమనుభోక్తవ్యమితి ప్రారబ్ధకర్మానుభవన్నేతద్దేహావసానసమయే మోక్షమపేక్షమాణో దృప్తః. జాజ్వల్యమానాగ్నిమధ్యస్థితేరివసంసారస్థితేరతి దుస్సహత్వాత్ప్రపత్త్యుత్తరక్షణ ఏవ మోక్షకామ ఆర్తః.

అతఁడు ఏకాంతి, పరమైకాంతి యని రెండు విధములు. ఎవఁడు మోక్షముతోఁగూడ నితరఫలములనుగూడ శ్రీమన్నారాయణుని వలననే లభింపఁగోరునో యాతఁడేకాంతి దేవతాంతర శూన్యుఁడని తాత్పర్యము. భక్తిజ్ఞానములకంటె వేరొక ఫలమును భగవంతునినుండి యయినను గోరనివాఁడు పరమైకాంతి యగును ఆ ప్రపన్నుఁడు దృప్తుఁడు ఆర్తుఁడు నని రెండు విధములు. చేసినకర్మ తప్పక యనుభవింపవలయునను భావనతోఁ బ్రారబ్ధకర్మము ననుభవించుచు దేహావసాన సమయమును నిరీక్షించువాడు దృప్తప్రపన్నుఁడు. ఘోరముగా మండు

చున్న యగ్నిమధ్యమునమున్నట్లు సంసారమునసుండుట భరింపలేక ప్రపత్తి క్షణముననే మోక్షముకావలయునని కోరువాఁడార్తప్రపన్నుఁడు.

ముక్తోనామ - ఉపాయపరిగ్రహానన్తరం నిత్యనైమిత్తిక భగవదాజ్ఞాను జ్ఞాకైఙ్కర్యరూపాణి కర్మాణి స్వయం ప్రయోజనతయాకుర్వన్, భగవద్భాగ వతాచార్యాపచారాంశ్చ వర్జయన్, దేహావసానే సుకృత దుష్కృతే మిత్రామిత్ర యోర్నిక్షిపన్, * వాఙ్మనసీత్యాదిప్రకారేణ హార్దేపరమాత్మని పరిశ్రమ్యముక్తి - ద్వార భూతసుషుమ్నానాడీం ప్రవిశ్యతయా బ్రహ్మరన్ధ్రాన్నిష్క్రమ్య హార్దేన సాకం సూర్యకిరణద్వారా అగ్నిలోకం గత్వాదివపూర్వపక్షోత్తరాయణ సంవత్స రాద్యభిమాని దేవతాభిర్వాయునాచపథి సత్కృతః, సూర్యమణ్డలంభిత్వారథ చక్రద్వారా తద్వారా సూర్యలోకం గత్వానంతరంచన్ద్ర విద్యుద్వరుణేన్ద్ర ప్రజాపతిభిర్మార్గదర్శిభిరాతివాహికైర్గణైస్సహసోపచారం తత్తల్లోకాపతీత్య ప్రకృతి వైకుణ్ఠసీమా పరిచ్ఛేదికాం విరజాం తీర్త్వా సూక్ష్మశరీరం విహాయ అమానవకర స్పర్శాద్ప్రాకృత దివ్యవిగ్రహయుక్తశ్చతుర్భుజో, బ్రహ్మాలఙ్కారేణాలఙ్కృతః. ఇన్ద్రప్రజాపతి సంజ్ఞికనగర ద్వారపాలాభ్యనుజ్ఞయా శ్రీ వైకుణ్ఠ దివ్యనగరం ప్రవిశ్యపతాకాలఙ్కృత దీర్ఘప్రాకారసహిత గోపుర మతీత్య ఐరమ్మదాఖ్యా మృత సరస్సోమసవనాఖ్యాశ్వత్థంచ దృష్ట్వా * శతం మాలాహస్తా ఇత్యాద్యుక్త పఞ్చశతాప్సరోగణై రుపచరితో, బ్రహ్మగన్ధాదిభిరలఙ్కృత, స్తత్రత్యానన్త గరుడ విశ్వక్సేనాదీన్ ప్రణమ్యతైర్బహుమతో, మహామణిమణ్డపమాసాద్య పర్యఙ్కసమీపే స్వాచార్యాన్ ప్రణమ్య పర్యఙ్క సమీపం గత్వా.

భక్తిప్రపత్తులను బరిగ్రహించి నిత్యనైమిత్తికములనంబడు భగవ దాజ్ఞాకైంకర్యములను విహ్యముగా జేయుచు భగవద్భాగవతాపరాధము లనుజేయక దేహావసానకాలమునఁ దన పుణ్య పాపములను మిత్రా మిత్రులయందు సంక్రమింపఁజేసి "వాఙ్మనసి సంపద్యతే" ఇత్యాదిరీతిగా బరమాత్మయందు మనస్సును విశ్రమింపఁజేసి ముక్తిద్వార మనఁదగిన "సుషుమ్న" యను నాడియందుఁ బ్రవేశించి బ్రహ్మరంధ్రమునుండి వెడలివచ్చి ..................... సూర్యకిరణములద్వారా నగ్నిలోకము నకు వెడలి దినము శుకపక్షము ఉత్తరాయణము సంవత్సరము అను కాలముల యభిమాని దేవతలచేత సత్కరింపఁబడి సూర్యమండలమును భేదించుకొని యాకాశరంధ్రముద్వారా సూర్యలోకమునకుఁబోయి

చంద్రుఁడు విద్యుత్తు వరుణుఁడు ఇంద్రుఁడు ప్రజాపతి అను మార్గదర్శకులగు నాతివాహికులతోఁగూడి యాయాలోకములందు వారివారిచే సత్కరింపఁబడుచు నాలోకములను దాటి ప్రకృతికిని వైకుంఠమునకును హద్దుగానున్న విరజానదినిదాటి సూక్ష్మశరీరమును విడచి యమానవ పురుషునియొక్క హస్తస్పర్శముచేత దివ్యమంగళ శరీరముగలవాఁడై నాల్గుభుజములతోఁగూడి బ్రహ్మాలంకారమును బొంది ఇంద్రనగరము ప్రజాపతినగరము అను పేర్లుగల పట్టణముల ద్వారపాలకులచే ననుమతింపఁబడి శ్రీవైకుంఠము అను నగరమును బ్రవేశించి గరుడునితోడను అనంతునితోడను గూడియున్న పతాకములతో నలంకరింపఁబడిన దీర్ఘ ప్రాకారసహిత గోపురము నతిక్రమించి ఐరంమదమను పేరుగల యమృతసరస్సును సోమసవనము ను పేరుగల యశ్వత్థవృక్షమునుజూచి "శతం మాలాహస్తాః" అని చెప్పినరీతిని అయిదు వందల మంది దివ్యాప్సరసల గణములచే నుపచారములనుబొంది బ్రహ్మగంధము (దివ్యచందనము) మున్నగువానిచే నలంకృతుఁడయి యచటనున్న యనంత గరుడ విష్వక్సేనాదులను నమస్కరించి వారిచే గౌరవింపఁబడి మహామణిమండప మనఁబడు సభాభవనమునుచేరి పర్యంకసమీపమున నున్న స్వాచార్యులకు నమస్కరించి పర్యంక సమీపమునకుఁ బోయి.

తత్ర ధర్మాదిపీఠో పరికమలే అనన్తే విమలాదిభిశ్చామర హస్తాభిస్సేవ్యమానం శ్రీభూనీళాసమేతం శఙ్ఖచక్రాది దివ్యాయుధోపేతం జాజ్వల్యమాన కిరీట మకుట చూడావతంస మకరకుణ్డలగ్రైవేయకహార కేయూరకటక శ్రీవత్స కౌస్తుభముక్తాదామోదరబన్ధన పీతామ్బర కాఞ్చీగుణనూపురాద్య పరిమిత దివ్య భూషణైర్భూషిత మపరిమిత గుణౌదార్య సాగరం భగవన్తం దృష్ట్వాపాదేన పర్యఙ్కమారుహ్య తేనస్వాఙ్కే స్థాపితః, కోసీతిపృష్టో బ్రహ్మ ప్రకారోస్మీత్యుక్త్వా తేన కటాక్షితః, తదనుభవజనిత ప్రహర్ష ప్రకర్షాత్సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత స్వ కైఙ్కర్యైకరతిః, ఆవిర్భూత గుణాష్టకః, ఉత్తరావధిరహిత బ్రహ్మానుభవాన్,, స ముక్త ఇత్యుచ్యతే

ధర్మాధిపీఠము నుపరిభాగమునఁ గమలమునందలి యనంతుని యందు విమల మున్నగు చామరగ్రాహిణులచే సేవింపఁబడుచున్నట్టియు

శ్రీ భూనీళలచే సేవింపఁబడుచున్నట్టియు శంఖచక్రాది దివ్యాయుధములను ధరించి మిక్కిలిగాఁ బ్రకాశించుచున్న కిరీటము మకరకుండలములు కంఠభూషణము హారములు భుజకీర్తులు హస్తభూషణములు శ్రీవత్సమను పుట్టుమచ్చయు కౌస్తుభమణియు ముత్తెముల హారములు మొలకట్టు పీతాంబరము మొలత్రాడు పాదభూషణములు మున్నగు నపరిమిత దివ్యాలంకారములతో భూషితుఁడయినట్టియు నపరిమితములగు కల్యాణ గుణములకు సముద్రుఁడయినట్టియు భగవంతునిదర్శించి అతని పాదపద్మములకు శిరస్సుతోఁ బ్రణమిల్లి తనకాలితోఁ బర్యంకమునెక్కి యాస్వామిచే తన యంకమునఁ గూర్చుండబెట్టుకొనఁబడి నీవెవ్వరని యాతఁడడుగ బ్రహ్మశేషభూషితుఁడనని పల్కి యాతని కరుణాకటాక్షమునకు గురియయి యాతనిననుభవించుటచేఁగల్గిన సంతోషాతిశయముతో సర్వదేశములకును సర్వకాలములకును సర్వావస్థలకును ఉచితములగు సర్వవిధ భగవత్కైంకర్యములందును ఆసక్తుఁడై సంసారదశయందు మరుగుపడిన సహజములగు నెనిమిదిగుణములను (అపహతపాప్మత్వాదులు) మరల నావిర్భవింపఁగా నుత్తరావధిరహిత పరబ్రహ్మానుభవముగలవాఁడు ముక్తుఁడనంబడును

ముక్తస్య బ్రహ్మసామ్యాపత్తిస్తు భోగసామ్యాపత్తిమాత్రం-జగద్వ్యాపారవర్జత్వ స్వప్రతిపాదనాత్. తస్యనానాత్వం సర్వలోక సఞ్చరణం చ సమ్భవతి, ననుముక్తస్యానావృత్తిప్రతిపాదనాదస్మిల్లోకే సఞ్చారః కథమితిచేన్న-కర్మకృతస్యైవనిషేధాత్ స్వేచ్ఛయాసఞ్చరణస్యోపపత్తేః. అతోముక్తోభగవత్సఙ్కల్పాయత్తః స్వేచ్ఛయాచ సర్వత్రసఞ్చరతి. నిత్యానామకదాఽపి భగవదభిమతవిరుద్ధాచరణాభావేన జ్ఞానసఙ్కోచ ప్రసఙ్గరహితాః. అనన్తగరుడ విష్వక్సేనాదయః. తేషామధికారవిశేషా ఈశ్వరస్య నిత్యేచ్ఛయైవ అనాదిత్వేనవ్యవస్థితాః తేషామవతారస్తు భగవదవతారవత్స్వేచ్ఛయైవ. ఏవం బద్ధముక్తనిత్యభేదభిన్నో జీవో నిరూపితః.

ముక్తునికి బ్రహ్మసామ్యమును జెప్పెడి "నిరఞ్జనః పరమం సామ్యముపైతి" అను శ్రుతి భోగసామ్యమునే చెప్పును. అనఁగా ముక్తునికి బ్రహ్మతోసమానమగు భోగము అనఁగా నానందానుభవముండునని యాశ్రుతికిఁ దాత్పర్యము జగత్సృష్ట్యాది వ్యాపారము

మాత్రము ముక్తునికి విశేషించుటవలన భోగసామ్యము విహితమని తెలియఁబడుచున్నది (మోక్షమనఁగా సాయుజ్యము. సాయుజ్యమనఁగా బ్రహ్మతోసమానమగు భోగానుభవమని యర్థము. (సమానో యుక్ = యోగోయస్యస - సయుక్-తస్యభావః సాయుజ్యమ్. సమానో యోగో-భోగసంబంధో-యస్యస సయుక్-ఇతి) సాలోక్యము సామీప్యము సారూప్యము అనునవి స్వర్గాదులవలె ఫలాంతరములు. సాయుజ్యమే మోక్షము.) "మమ సాధర్మ్యమాగతాః" అనుదానికిని ఇదియేయర్థము "లోకేషు విష్ణోర్నివసన్తి కేచిత్సమీపమృచ్ఛన్తి చ కేచిదన్యే। అన్యేతురూపం సదృశం భజన్తే సాయుజ్యమన్యే సతుమోక్ష ఉక్తః" అను శ్లోకమును సాయుజ్యమునే మోక్షమని చెప్పుచున్నది

ఈముక్తుఁడు బహుశరీరధారణమును సర్వలోక సంచరణమును గూడ గలిగియుండును ముక్తునికి "అనావృత్తిశ్శబ్దా" దిత్యాదుల వలన మరల నీలోకమునకు వచ్చుట యుండదని పునరావృత్తి నిషిద్ధ మయియుండఁగా నీలోకమున ముక్తుఁడు సంచరించుటయెట్లని శంకింప రాదు కర్మకృత పునరావృత్తి సంభవింపదని మాత్రమే దానితాత్పర్యము. కావున స్వేచ్ఛాసంచారమునకు విరోధములేదు. అందువలన ముక్తుఁడు భగవత్సంకల్పము ననుసరించి స్వేచ్ఛతోనంతటను సంచరించును.

ఎప్పుడును భగవంతునికి అనభిమత గుణాచరణముఁ జేయక జ్ఞానసంకోచమును బొందు ప్రసంగమేలేక యుండెడి అనంతుఁడు గరుత్మంతుఁడు విష్వక్సేనుఁడు మున్నగువారు నిత్యులనఁబడుదురు వారివారి యధికారములు భగవంతుని నిత్యేచ్ఛననుసరించి యనాదిగా నియమింపఁబడినవి ఈ నిత్యుల యవతారములును భగవంతుని యవతారములవలె స్వేచ్ఛచేత భవించినవే కాని కర్మకృతములుకావు.

ఇట్లు బద్ధులు ముక్తులు నిత్యులు అను భేదములుగల జీవుని స్వరూపము నిరూపితము.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం జీవనిరూపణం నామ అష్టమోవతారః.

ఇది జీవనిరూపణమనెడు నష్టమావతారము.

## నవమోవతారః

అథేశ్వరో నిరూప్యతే – సర్వేశ్వరత్వం, సర్వశేషిత్వం, సర్వకర్మ సమారాధ్యత్వం, సర్వఫలప్రదత్వం, సర్వాధారత్వం, సర్వకార్యోత్పాదకత్వం సర్వశబ్దవాచ్యత్వం, సర్వజ్ఞానవిషయత్వం, స్వస్వజ్ఞానేతర సమస్తద్రవ్య శరీరిత్వ, మిత్యాదీనీశ్వర లక్షణాని.

ఇంక నీశ్వరస్వరూపము వివరింపఁబడుచున్నది ఈశ్వరుఁడనఁగా సర్వమును నియమించువాఁడు. ఈశ్వరత్వము, సర్వశేషిత్వము (సర్వమును ఈతనికి యథేష్టముగా వినియోగింపఁదగియుండుటచే శేషభూత మగును శేషత్వమునకుఁ బ్రతిసంబంధిత్వమే శేషిత్వము) సర్వ కర్మలచేతను నారాధింపఁదగియుండుట అన్ని ఫలములను ఇచ్చుట సర్వమునకు నాధారుఁడగుట, అన్నికార్యవస్తువులను బుట్టించుట, తన జ్ఞానము, తానుదప్ప నితరములగు ద్రవ్యములన్నియు శరీరముగాఁ గల్గియుండుట మున్నగునవి ఈశ్వరలక్షణములు వ్యాపకత్వయుక్త చేతనత్వము, వ్యాపకత్వయుక్త సత్యసంకల్పత్వము గూడ నీశ్వరలక్షణ ములగును.

అయమీశ్వర సూక్ష్మ చిదచిద్విశిష్టవేషణ జగదుపాదానకారణం, సఙ్కల్ప విశిష్టవేషేణ నిమిత్తకారణం, కాలాద్యన్తర్యామివేషేణ సహకారి కారణం, చ. కార్యరూపేణ వికారయోగ్యం వస్తూపాదానకారణం. కార్యతయా పరిణామ యితృనిమిత్తకారణం. కార్యోత్పత్త్యుపకరణం వస్తుసహకారి యద్వా – ఉత్తరోత్తరావస్థా విశిష్టస్వరూపాపేక్షయా తదనుగుణ నియత పూర్వావస్థా విశిష్టం యత్తదుపాదానం. యథా ఘటత్వావస్థావిశిష్టమృద్ద్రవ్యాపేక్షయాపిణ్డ త్వావస్థావిశిష్టం తదేవద్రవ్యం పరిణామ వ్యతిరిక్తాకారేణాపేక్షితం కారణం నిమిత్తం. అస్మిన్ పక్షేసహకారి కారణస్య నిమిత్తేన్తర్భావః త్రివిధ కారణ పక్షేకారణద్వయపక్షే చ కారణలక్షణ లక్షితత్వాదఖిల జగత్కారణత్వం భగవతో నారాయణస్యైవసమ్భవతి ననుకథం నారాయణే కారణత్వ పర్యవసాన మితిచేత్. ఉచ్యతే – న్యాయసహిత వేదాన్తవాక్య విచారేణైవం పర్యవస్యతి తద్యథా.

ఈశ్వరుఁడే జగత్తునకుఁ ద్రివిధకారణమునగును. సూక్ష్మచిద
చిత్తులతోఁ గూడియుండు రూపముతోనుపాదానకారణమగును. సూక్ష్మ
రూపమే స్థూలరూపముగాఁ బరిణమించును. కావున నుపాదానమగును.
కార్యరూపముగా వికారమును బొందునట్టి వస్తువు ఉపాదానమనంబడును.
సూక్ష్మచిదచిద్విశిష్ట భగవత్స్వరూపమే స్థూలచిదచిద్విశిష్టముగా నుండు
చున్నది కనుక ఉపాదానకారణమగును. సత్యసంకల్పుఁడగుచు జగత్సృ
ష్టింగా నియమించుటచే నిమిత్తకారణమునగును. మృత్పిండమునుండి ఘటమును
కులాలుఁడు మార్చునట్లు ఈశ్వరుఁడు సూక్ష్మచిదచిత్తులను స్థూలచిద
చిద్రూపమగు జగత్తుగా తన సత్యసంకల్పముచేఁ బరిణమింపఁజేయును,
గావున నిమిత్తకారణమగుట సంభవించుచున్నది. ఈశ్వరుఁడు కాలమునం
దంతర్యామిగానుండి సృష్టిచేయును గావున సహకారి కారణమునగును.
కులాలుఁడు మృత్తికను ఘటముగాఁ బరిణమింపఁజేయుటకు దండచక్రాదు
లెట్లుపకారణములగునో అట్లే పరమపురుషుఁడు స్థూలజగత్తును సృష్టించు
టకు కాలము సహకారియగును. అనఁగాఁ గాలాంతర్యామిగా నుండి
సహకారి కారణమును అగును (భగవానుఁడు కాలము ననుసరించియే
సృష్టికార్యములు కావించునుగదా.)

కారణలక్షణ మింకొక విధముగను జెప్పవచ్చును. "ఉత్తరోత్తరా
వస్థావిశిష్ట స్వరూపమునకుఁ దదనుగుణమగు పూర్వపూర్వావస్థా విశి
ష్టమగు ద్రవ్యము ఉపాదానము" అని యుపాదానలక్షణము. ఘటత్వా
వస్థా విశిష్టమగు మృద్ద్రవ్యమునకు తదనుగుణమగు పూర్వపూర్వా
వస్థా విశిష్టమగు మృత్తికాదులే ఉపాదానమగును. "పరిణామాస్పదము
కంటె నతిరిక్తకారణమును నపేక్షింపఁబడు నిమిత్తకారణము" అని
నిమిత్తకారణమునకు లక్షణము. అనఁగా నుపాదానేతరకారణము నిమిత్త
కారణమని తాత్పర్యము. ఈ పక్షమున సహకారి కారణమును నిమిత్త
కారణములలోఁ జేరును. ఇట్లు కారణములు మూఁడు విధములన్న
పక్షమునను, రెండేవిధములన్న పక్షమునను గూడ నిఖిల కారణములును
శ్రీమన్నారాయణునియందే వర్తించుటచేత సర్వవిధజగత్కారణమును
నాతఁడేయగును.

అయినను నారాయణునియందు జగత్కారణత్వమెట్లు పర్యవసానమును జెందును? అని శంకింపరాదు న్యాయసహితముగా వేదాంత వాక్యములను విమర్శించినచో నీవిషయము స్పష్టపడును చూడుడు—

ఆదౌ తావత్ప్రకృతేర్జగత్కారణత్వం నోపపద్యతే - ఈక్షత్యాద్యభావాత్.

ముందు ప్రకృతి జగత్కారణమనుటకు వలనుపడదు. "సఐక్షత ప్రజాంను సృజా ఇతి" ఇత్యాది శృతులు జగత్కారణమునకు ఈక్షణము (సంకల్పము) అను చేతనధర్మమును జెప్పుచున్నవి. అచేతనమగు ప్రకృతియందు ఈక్షణము సంభవింపదు కనుక ప్రకృతి జగత్కారణమనుట సరిపడదు.

ఛాన్దోగ్యే తావత్ సదాకాశ ప్రాణశబ్దవాచ్యానాం జగత్కారణత్వం ప్రతీయతే - వాజసనేయకే బ్రహ్మశబ్దవాచ్యస్య కారణత్వం ప్రతీయతే-సర్వశాఖా ప్రత్యయన్యాయేన కారణవాక్యానామేక విషయత్వే ప్రతిపాదయితవ్యే ఛాగపశున్యాయేన సామాన్యవాచకానాం సదాదిశబ్దానాం విశేషే బ్రహ్మణి పర్యవసానం వక్తవ్యం.

ఛాందోగ్యమున "సదేవసోమ్య ఇదమగ్ర ఆసీత్" "సర్వాణి హవా ఇమాని భూతాని ఆకాశాదేవ సముత్పద్యంతే" "సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణమేవాభిసంవిశంతి ప్రాణమభ్యుజ్జిహతే" ఇత్యాది వాక్యములచే సత్తు ఆకాశము ప్రాణము అను శబ్దములతోఁ జెప్పబడునది జగత్కారణముగాఁ దెలియఁబడుచున్నది. వాజసనేయకమున "బ్రహ్మవా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" అని బ్రహ్మశబ్దముచే జగత్కారణము చెప్పఁబడినది. వాజసనేయచ్ఛాందోగ్యముల యందలి కారణత్వమును జెప్పు శబ్దములకు సర్వశాఖా ప్రత్యయ న్యాయముచే ఏకార్థము చెప్పవలయును. సర్వశాఖా ప్రత్యయన్యాయమనఁగా నన్నిశాఖలయందు చెప్పఁబడిన జ్ఞానము ఏకరూపముగా నుండవలయును అనుట. ఈ న్యాయముచే నీశ్రుతి వాక్యములన్నియు నేకార్థమును బ్రతిపాదించునని చెప్పవలసియున్నది. ఏక విషయత్వమునెట్లు ప్రతిపాదించుట యనఁగా ఛాగపశున్యాయము నాశ్రయింపవలెను. సామాన్యవాచక విశేషవాచకము

లగు శబ్దములకే కార్థకత్వమును జెప్పవలసినపుడు సామాన్య వాచక శబ్దములకు విశేషార్థమునందుఁ బర్యవసానము చెప్పుట ఛాగపశున్యాయ మగును. ఛాగ పశుశబ్దములకే కార్థకత్వము చెప్పవలసియుండఁగా తిర్యక్సామాన్య వాచకమగు పశుశబ్దమునకు పశువిశేషమగు ఛాగము నందుఁ బర్యవసానముచెప్పి ఛాగరూప పశువని యర్థము జెప్పుదురు. అట్లే సామాన్యవాచకములయిన సదాదిశబ్దములకు బ్రహ్మరూప విశే షార్థమునందుఁ బర్యవసానముచెప్పి ఛాందోగ్యవాజసనేయములకు ఏకార్థత్వమును సర్వశాఖా ప్రత్యయన్యాయము ననుసరించి చెప్ప వలయును సదాదిశబ్దములు బృహత్త్వగుణము కలదియు లేనిదియు గూడనగు దాని జెప్పుచున్నవి. బ్రహ్మశబ్దము బృహత్త్వగుణము కల దానిని మాత్రమే చెప్పును. కావున సదాదిశబ్దములు సామాన్యవాచక ములు కావున వీనికి విశేషవాచకమగు బ్రహ్మశబ్దార్థమునందే పర్యవ సానము చెప్పవలయును. ప్రాణయతీతిప్రాణః ఆసమన్తాత్కాశతే ఇతి ఆకాశః అను యౌగికార్థములు వివక్షితములయి బ్రహ్మశబ్దార్థమునే బోధించును. ఇట్టి ఛాగ పశున్యాయముచేతనే "అంతః ప్రవిష్టః శాస్తాజనానాగ్ంసర్వాత్మా" అను తైత్తిరీయోక్త ఆత్మశబ్దార్థమునందు బ్రహ్మశబ్దార్థమునకు బర్యవసానము జెప్పవలయును బ్రహ్మశబ్దార్థము చెతనాచేతన సాధారణముగు బృహత్త్వార్థమును జెప్పును కావున యిది సామాన్యవాచకము. ఆత్మశబ్దముచేతన బోధకమగుటచే విశేషవాచకము కావున నాత్మశబ్దార్థమునందు బ్రహ్మశబ్దార్థము పర్యవసానముఁ జెందును

ఏవముక్త న్యాయేన బ్రహ్మశబ్దవాచ్యస్య ఐతరేయోక్త ఆత్మశబ్దవాచ్యే పర్యవసానే ఆత్మశబ్దవాచ్యః ఇత్యాకాంక్షాయాం శ్రుతిప్రసిద్ధబ్రహ్మా వా - తథా ప్రసిద్ధోఽగ్నిర్వా - ఉపాస్యత్వేన ప్రసిద్ధస్సూర్యో వా - కారణత్వేనోక్తస్సోమో వా - అభీష్టప్రదత్వేనోక్తః కుబేరో వా - యమో వా - వరుణో వేతి సంశయే ఏతేషాం కర్మవైశ్యత్వపరిచ్ఛిన్నైశ్వర్యత్వ శ్రీపద్మాన్నైతే జగత్కారణ భూతాః. కిన్తు శ్వేతాశ్వతరే శివస్య కారణత్వం భాసతే - ఏవమథర్వశిఖాయాం శమ్భుశబ్దవాచ్యస్య ధ్యేయత్వం కారణత్వం చ భాసతే - తథైవ అథర్వశిర సి రుద్రశబ్దవాచ్యస్య సర్వాత్మకత్వ ముచ్యతే - తైత్తిరీయో పాఖ్యానగ్రన్థే జగత్కారణత్వం ప్రతీయతే.

పిమ్మట నట్టి జగత్కారణమయిన యాత్మశబ్దవాచ్యము ఏది ? అను ప్రశ్న కలిగెను. అపుడు శ్రుతులలోఁ బ్రసిద్ధుఁడగు నింద్రుఁడా లేక అగ్నియా ? ఉపాస్యుఁడుగా శ్రుతి ప్రసిద్ధుఁడయిన సూర్యుఁడా కారణముగాఁ జెప్పఁబడిన సోముఁడా అభీష్ట ఫలప్రదుఁడుగా జెప్పఁబడిన కుబేరుఁడా యముఁడా వరుణుండా యని సందేహము కలుగుచున్నది. కాని వీరు కర్మవశ్యులుగాను పరిమితమగు నైశ్వర్యము కలవారుగను సంహార్యులుగాను శ్రుతులవలనఁ దెలియఁబడుటచే వీరు జగత్కారణ భూతులగుటకు వలనుపడదు. అయినను "యదాతమస్తన్నదివాన రాత్రిః నసన్నచాసచ్ఛివ ఏవ కేవలః" అను శ్వేతాశ్వతర వాక్యముచే శివునికిఁ గారణత్వముగలదన్నట్లు తోచుచున్నది. అథర్వశిఖోపనిషత్తు నందలి "కారణంతు ధ్యేయః సర్వైశ్వర్య సంపన్న సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే ధ్యేయః" అను వాక్యమువలన శంభుశబ్ద వాచ్యునకుఁ గారణత్వధ్యేయత్వములు కానవచ్చుచున్నవి. అట్లే అథర్వశిఖోపనిషత్తు నందు రుద్రశబ్దవాచ్యునకు (స ఏకో రుద్రః స ఈశానం స భగవాన్ స మహేశ్వరః) సర్వాత్మకత్వము చెప్పఁబడెను అట్లే తైత్తిరీయము నందు "హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే" అని హిరణ్యగర్భునికి జగత్కారణత్వము కానవచ్చుచున్నది ఇచ్చటఁగూడ శివ, శంభు రుద్రాది సామాన్య వాచక శబ్దములకు భాగ పశున్యాయముచే హిరణ్యగర్భ శబ్దార్థమునందుఁ బర్యవసానము చెప్పవలయును. శివ శంభు రుద్ర శబ్దములు సామాన్యవాచకములుగాఁ బ్రసిద్ధములయి యున్నవి. "శివమస్తు సర్వజగతామ్" ఇత్యాదిగా శివశబ్దమునకు మంగళవాచకత్వము ప్రసిద్ధము. ఇట్లే "స్వస్తి శివం కర్మోస్తు. సన్తానస్సంతుతే శివాః" ఇత్యాది వాక్యములును శివ శబ్దమునకు మంగళవాచకత్వమునకుఁ బ్రమాణములు. అట్లె రుద్రశబ్దము "రుద్రోవా ఏషయ దగ్నిః" ఇత్యాది శ్రుతులలో అగ్నివాచకముగాఁ బ్రసిద్ధము ఇట్లే మహేశ్వర శంభ్వాది సామాన్యశబ్దములును అవయవశక్తిచేఁ హిరణ్యగర్భశబ్దవాచ్య విశేషమగు (చతుర్ముఖునియందుఁ బర్యవసన్నమగుచున్నది.

అత్రాపి సామాన్య విశేషన్యాయాత్ శివశమ్భురుద్ర శబ్దానాం హిరణ్య గర్భ శబ్దవాచ్యే విశేషే పర్యవసానం యుజ్యతే. శివశబ్దస్య - శివమస్తు

సర్వజగతాం * శివంకరత్వాత్ * శివాస్తే సన్తు పన్థాన ఇత్యాది ప్రయోగవాచిత్వం రుద్రశబ్దస్యాపి వాచకత్వం - ఏవం మహేశ్వరశబ్దస్యాపి సామాన్యశబ్దా అప్యవయవశక్త్యా పరబ్రహ్మణ్యేవ పర్యవస్యన్తి. కారణవాచిశివాది శబ్దానాం ముఖ్య వృత్త్యా రుద్రపరత్వం కిం న స్యాదితి న శఙ్కనీయం - రుద్రస్య చతుర్ముఖా దుత్పత్తి శ్రవణాదనపహతపాప్మత్వ శ్రవణాచ్చ న రుద్రస్య కారణత్వం - అతో హిరణ్యగర్భ ప్రజాపతి స్వయమ్భ్వాది శబ్దవాచ్యే చతుర్ముఖే శివాదిశబ్దాః పర్యవస్యన్తి. ఏవం మహోపనిషన్నారాయణోపనిషత్సుబాలోపనిషన్మైత్రాయణీయ పురుషసూక్త నారాయణానువాకాన్తర్యామి బ్రాహ్మణాదిషు నారాయణస్యైవ పరమకారణత్వ సర్వశబ్దవాచ్యత్వ మోక్షప్రదత్వ జగచ్ఛరీరకత్వాది ప్రతిపాదనాత్ స్వయమ్భూహిరణ్యగర్భ ప్రజాపతి శబ్దానాం నారాయణే పర్యవసానం యుక్తమితి నారాయణ ఏవాఖిల జగత్కారణం సర్వవిద్యావేద్యశ్చ.

కాని "కారణవాచకములు శివాది శబ్దములకు రూఢి శక్తి చేత రుద్రపరత్వమేల చెప్పరాదు" అని శంకింపరాదు. రుద్రునికిం చతుర్ముఖునినుండి ( ) పుట్టుక శ్రుతులయందుఁ జెప్పఁబడుటచేతను అనపహత పాప్మత్వము వినవచ్చుచుండుటచేతను గారణత్వము చెప్పరాదు. కావున హిరణ్యగర్భ ప్రజాపతి స్వయంభ్వాది శబ్దములచేఁ జెప్పఁబడుచున్న చతుర్ముఖుని యందే శివాదిశబ్దములు పర్యవసించును.

ఇంకను విమర్శింపఁగా స్వయంభూ హిరణ్యగర్భ ప్రజాపతి శబ్దములకుఁ జతుర్ముఖునియందుఁగాక నారాయణునందే పర్యవసానము సిద్ధించుచున్నది. ఏమన - మహోపనిషత్తు (ఏకోహవై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానః) నారాయణోపనిషత్తు, సుబాలోపనిషత్తు, మైత్రావరుణీయము, పురుషసూక్తము, నారాయణానువాకము అంతర్యామి బ్రాహ్మణము మున్నగు శ్రుతులు నారాయణునకే పరమ కారణత్వము సర్వశబ్దవాచ్యత్వము మోక్షప్రదత్వము జగచ్ఛరీరకత్వము మున్నగు వానివి బ్రతిపాదించుటచే హిరణ్యగర్భాది శబ్దములకును యోగశక్తిచే నారాయణునియందే పర్యవసానము యుక్తము. (స్వయంభవతీతి స్వయంభూః = అనన్యాధారః। ప్రజానాంపతిః ప్రజానాంశేషి ।

హిరణ్యాని = (కల్యాణగుణాః) గర్భే యస్యసః) కావున నారాయణుఁడే జగత్కారణమును సర్వవిద్యా వేద్యుఁడు నగును.

నను ఆన్తరాదిత్య విద్యారుద్ర పరేతిశఙ్కానకర్తవ్యా – తస్యాః విష్ణుపరత్వస్యైవబహుప్రమాణసిద్ధత్వాత్, భరశబ్దస్యాకారాన్తత్వా ప్రతిపాదనా, చ్చ. తర్హి దహరవిద్యాయామాకాశ శబ్దవాచ్య నారాయణాన్తర్యామితయా రుద్రస్య ప్రతిపాదనాద్దహర విద్యారుద్రపరేతి నశఙ్కనీయా – నారాయణాన్తర్వర్తిగుణజాతస్యైవోపాస్యత్వే నతత్రాభిధానాత్. ఏవం సర్వవిద్యాస్వప్యూహ్యం.

అంతరాదిత్యవిద్య రుద్రపరమని శంకింపరాదు ఆనేక ప్రమాణములచేత నది నారాయణపరమని నిరూపింపఁబడియున్నది అందలి భర్గశబ్దము అకారాంతమయినచో రుద్రబోధకమను శంకకున్నైన నవకాశముండునేమోకాని యది సకారాంతమని నిరూపింపఁబడుటచే నారాయణపరమేయని నిశ్చితము. అట్లే దహరవిద్యయు (దహరోస్మిన్నంతర ఆకాశః తస్మిన్యదంతః తిదన్వేష్టవ్యమ్) శివపరముకాదు. అందలి యాకాశశబ్దవాచ్యుఁడగు నారాయణునికి అంతర్యామిగా రుద్రుని ప్రతిపాదించుటకు వలనుపడదు నారాయణునిలో నున్న గుణసమూహమే ఉపాస్యముగా నచటఁ జెప్పఁబడియున్నది. ఇట్లే సర్వవిద్యలును నారాయణపరములే యని యూహింపనగును.

అతస్సమస్త కల్యాణగుణాత్మకః ప్రకృతిపురుషాభ్యాం భిన్నస్తద్విశిష్టః పరంబ్రహ్మనారాయణో జగత్కారణం.

కావున సమస్తకల్యాణగుణాత్మకుఁడును ప్రకృతి పురుషులకంటె భిన్నుఁడును వానితోఁ గూడియున్నవాఁడును పరబ్రహ్మయు నగు శ్రీమన్నారాయణుఁడే జగత్కారణము

నను అద్వైత శ్రుత్యాబ్రహ్మైకమేవసత్యం నిర్గుణం చ, తదన్యద్జ్ఞాతృత్వజ్ఞేయత్వాదికం తస్మిన్నేవపరికల్పితం సర్వంమిథ్యా, బ్రహ్మాఅవిద్యయానం

నరతి, * తత్త్వమసీత్యాద్యభేదజ్ఞానం తన్నివర్తకం,- తస్మాన్నిర్విశేషచిన్మాత్రే బ్రహ్మణి వేదాన్తానాం తాత్పర్యమితి మతాన్తరస్థైః ప్రతిపాదనాత్ కథం నారాయణే తాత్పర్యం, తస్యసమస్తకల్యాణగుణాత్మకత్వాదికథనం, చేతిచేత్. ఉచ్యతే - కారణత్వ ప్రతిపాదక శ్రుతిభిర్నారాయణస్య కారణత్వేసిద్ధే, భేదాభేద శ్రుత్యోర్ఘటక శ్రుత్యావిషయభేదేన విరోధేపరిహృతే, నిర్గుణప్రతిపాదక శ్రుతీనాం హేయగుణనిషేధకత్వాత్, జ్ఞాతృజ్ఞేయాదికల్పకావిద్యయా ఏవాప్రామాణ్యాద్బ్రహ్మకార్యస్య సత్యత్వాత్, అవిద్యయా సంసారేజీవగతదోషాణాం బ్రహ్మణ్యపి సమ్భవాత్, తన్నివర్తకాన్తరస్య వక్తుమశక్యత్వాత్, అతో ఽద్వైతవాదస్యాసమ్భవాన్న నిర్విశేషచిన్మాత్ర బ్రహ్మసిద్ధిః.

"తత్త్వమసీ"త్యాదిశ్రుతులచే బ్రహ్మైక్యమే ప్రతిపాదితమగుచున్నది. బ్రహ్మమొక్కటియే సత్యము. అది నిర్గుణము దానికంటె భిన్నమగు జ్ఞాత, జ్ఞేయము, మున్నగునవి యా బ్రహ్మమునందే పరికల్పితములు. అవియన్నియును మిథ్యయే. అవిద్యచే బ్రహ్మమే సంసారమును బొందును తత్త్వమసీత్యాదులవలన నభేదజ్ఞానము కలిగినచో సంసారము నివర్తించును కావున నిర్విశేషమగు చిన్మాత్ర బ్రహ్మమునందే వేదాంతవాక్యములకు దాత్పర్యము" అని మాయావాదులు ప్రతిపాదించియుండగా నారాయణునియందు వేదాంతవాక్యములకు దాత్పర్యమనియు నాతఁడు సమస్త కల్యాణగుణాకరుఁడనియుఁ జెప్పుట యెట్లుపొసగును అని శంకింపరాదు. కారణత్వమునుజెప్పుచున్న శ్రుతులు నారాయణునికే కారణత్వమును జెప్పుట వెనుక నిరూపింపఁబడెను భేదశ్రుతులకును అభేదశ్రుతులకును విరోధమునులేదు. వానికి ఘటకశ్రుతులు విషయభేదమును నిరూపించి అవిరోధమును జెప్పుచున్నవి (అనఁగా "యస్యాత్మాశరీరం, యస్యపృథివీశరీరమ్" మున్నగు శ్రుతులు జగద్బ్రహ్మలకు శరీర శరీరిభావమును శరీరము శరీరి యను రెండు వస్తువులు కనుక భేదశ్రుతులకు విరోధములేదనియు, జీవబ్రహ్మలు అపృథక్సిద్ధి సంబంధముచే నవినాభూతములు కనుక నైక్యవ్యవహారము ను ఉపపన్నమేయనియు ననఁగా శరీరాత్మభావకృతమే యభేదవ్యవహారమనియు సూచించుటచే నభేదశ్రుతులకును విరోధములేదనియు దెలియఁబడుచున్నది ) అట్లే సగుణ నిర్గుణ శ్రుతులకు విషయభేదము

చేతనే విరోధము పరిహృతమయ్యెను. సగుణశ్రుతులు పరమాత్మ కల్యాణగుణ విశిష్టుఁడనియు, నిర్గుణశ్రుతులు హేయగుణరహితుఁడనియు బ్రతిపాదించుచున్నవి. జ్ఞాతృజ్ఞేయాదిభేదను గల్పించు నవిద్యయుఁ బ్రమాణసిద్ధముకాదు బ్రహ్మమే జగద్రూపకార్యముగఁ బరిణమించుట ప్రమాణసిద్ధము కావున జగత్తు సత్యమేయగును అవిద్యచే సంసారము కల్గినదన్నచో జీవునియందుఁడు దోషములన్నియు బ్రహ్మమునందు సంభవింపవలసివచ్చును. అవిద్యను నివర్తింపఁజేయునది వేరొక్కటి కలదని చెప్పుటయు అసాధ్యమగును — కావున అద్వైతవాదము సంభ వింపదు. కావుననే నిర్విశేషచిన్మాత్ర బ్రహ్మము సిద్ధింపదు.

అతో నారాయణస్యైవ జగత్కారణత్వ మోక్షప్రదత్వాదిగుణ యోగ స్సమ్భవతీతి సవిశేషం బ్రహ్మ. సూక్ష్మచిదచిద్విశిష్టమేవ బ్రహ్మకారణం-స్థూల చిదచిద్విశిష్టమేవ కార్యమితి విశిష్టాద్వైత వేదాన్తినాంకార్యాదనన్యత్కా-రణమితి సమ్ప్రదాయః.

నారాయణునికే జగత్కారణత్వము, మోక్షప్రదత్వము మున్నగు గుణములు సంభవించుచున్నవి కనుక బ్రహ్మము సవిశేషమే యగును. కారణమునకును, కార్యమునకును అభేదమును విశిష్టాద్వైతమున సిద్ధించుచున్నది. సూక్ష్మచిదచిద్విశిష్ట బ్రహ్మకారణమను స్థూలచిద చిద్విశిష్ట బ్రహ్మకార్యమునకుఁ బేదమ సిద్ధించుచున్నది. ఇది విశిష్టాద్వైత వేదాంతుల సంప్రదాయము,

ఏవమీశ్వరాఙ్గీకారాత్ నిరీశ్వరసాఙ్ఖ్య మీమాంసకాది మతనిరాసః. ఏతస్యైవోపాదానత్వ స్వీకారాత్ యోగపాశుపత నైయాయిక మతనిరాసః - తైర్నిమిత్తకారణమాత్రేశ్వరాఙ్గీకారాత్. ఈశ్వరస్యకార్యం ప్రత్యుపాదానత్వ నిమిత్తత్వవత్ కర్తృత్వ ప్రేరకత్వ నియన్తృత్వ ప్రకాశయితృత్వానుమన్తృత్వ సహకారిత్వోదాసీనత్వాదిక ముపపద్యతే. బాల్యయౌవనావస్థాదయో దోషాయథా శరీరగతానతు శరీరిణిజీవే- ఏవం చిదచిచ్ఛరీరిణః పరమాత్మనోపీతిననిర్వికార శ్రుతివిరోధః నియమేనతదాధేయత్వ విధేయత్వ శేషత్వాదేశ్శరీర లక్షణస్య జగతివిద్యమానత్వాజ్జగచ్ఛరీర ఈశ్వరస్తద్గతదోషైర సంస్పృష్టశ్చ.

ఈమతమున నిరీశ్వరు నంగీకరించుటచే నిరీశ్వర సాంఖ్యమును మీమాంసక మతమును నిరాకృతములు. ఈశ్వరుఁడే జగదుపాదాన మనుటచే నీశ్వరుఁడు నిమిత్తకారణము మాత్రమేయని తలంచుచున్న యోగ, పాశుపత, నైయాయిక మతములు ఖండింపఁబడినవి. ఈశ్వరునికి ఉపాదానత్వము నిమిత్తకారణత్వము కూడ నున్నట్లైన జగత్తునకు కర్తృత్వము ప్రేరకత్వము నియంతృత్వము ప్రశాసకత్వము సహకారిత్వము ఉదాసీనత్వము మున్నగునవియు నుపపన్నములేయగును. బాల్యము యౌవనము కౌమారము మున్నగు నవస్థలు మొదలగు దోషములు శరీరగతములే కాని జీవునియందుండవు కదా! అట్లే చిద చిత్తులయందలి వికారములు తచ్ఛరీరియగు పరమాత్మకును సంభవింపవు. కావున బ్రహ్మము నిర్వికారమనెడి శ్రుతులకు విరోధములేదు. నియమముగా నాధేయము విధేయము శేషభూతము అగునది శరీరము అని చెప్పిన శరీరలక్షణము జగత్తునకును సంభవించును. కావున నది ఈశ్వరునికి శరీరమగును. దానియందున్న దోషములను ఈశ్వరుని స్పృశింపవు.

స చేశ్వరో విభుస్వరూపశ్చ. విభుత్వం నామ వ్యాపకత్వం. తత్త్రిధా- స్వరూపతో ధర్మభూతజ్ఞానతో విగ్రహతశ్చ. స చానన్త ఇత్యుచ్యతే. అనన్తో నామ త్రివిధ పరిచ్ఛేదరహితః. త్రివిధపరిచ్ఛేదస్తు దేశతః కాలతో వస్తుతః.

అట్టి యీశ్వరుఁడు విభుస్వరూపుఁడు. విభువనఁగా వ్యాపకము. అట్టి వ్యాపకత్వము ఈశ్వరునియందు స్వరూపముచేతను శరీరముచేతను జ్ఞానముచేతను ముువ్విధములగను వర్తించును. అతఁడనంతుఁడనియుఁ జెప్పఁబడును. మూఁడు విధములగు పరిచ్ఛేదమును లేనివాఁడనియర్థము దేశముచే పరిచ్ఛేదములేకయుండుట యనఁగా నిక్కడనున్నాడు అక్కడ లేడు అని చెప్పుటకు వీలులేకుండ నంతటనుండుట. కాలపరిచ్ఛేదము లేకుండుట యనఁగా నీకాలముననున్నాడు ఆకాలమునలేడు అనిచెప్పుటకు వీలులేకుండ నన్నికాలములయందు నుండుట. వస్తుపరిచ్ఛేద రాహిత్యమనఁగా నీవస్తువుననున్నాడు ఆవస్తువునలేడు అనుటకు వీలు లేనట్లు అన్నివస్తువులందును నంతర్యామిగానుండుట.

సత్యత్వామలత్వానన్తత్వాదయ ఈశ్వరస్య స్వరూప నిరూపకధర్మాః. జ్ఞానశక్త్యాదయస్తన్నిరూపిత స్వరూపధర్మాః. సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదయః సృష్ట్యుపయుక్తధర్మాః. వాత్సల్య సౌశీల్యసౌలభ్యాదయః ఆశ్రయణోపయుక్త ధర్మాః. కారుణ్యాదయో రక్షణోపయుక్త ధర్మాః. ఏతేషాం స్వరూపం బుద్ధిపరిచ్ఛేదే నిరూపితమితి నేహ ప్రపఞ్చ్యతే.

సత్యత్వము జ్ఞానత్వము ఆనందత్వము అనంతత్వము అమలత్వము మున్నగునవి ఈశ్వరుని స్వరూపమును నిరూపించు ధర్మములు. జ్ఞానము శక్తి మున్నగునవి నిరూపితమగు స్వరూపముయొక్క ధర్మములు. సర్వజ్ఞత్వము సర్వశక్తిత్వము మున్నగునవి సృష్టికి ఉపయోగించు గుణములు. వాత్సల్య సౌలభ్య సౌశీల్యాదులు భక్తులాశ్రయించుట కుపయోగించు ధర్మములు. కారుణ్యము మున్నగునవి భక్తులను రక్షించుట కుపయోగించు ధర్మములు. ఈ గుణముల స్వరూపము బుద్ధి పరిచ్ఛేదమున నిరూపించితిమి

అయమీశ్వరః అణ్డసృష్ట్యనన్తరం చతుర్ముఖదక్ష కాలాదిష్వన్తర్యామితయాస్థిత్వా సృష్టింకరోతి - విష్ణ్వవతార రూపేణమను కాలాద్యన్తర్యామితయాస్వరూపేణ చస్థిత్వారక్షకోభవతి - రుద్రకాలాన్తకాదీనామన్తర్యామితయా సంహారమపికరోతి - అతస్సృష్టిస్థితి సంహారకర్తాచేతి.

ఈశ్వరుఁడు ముందుఁగా నండమును సృజించి పిమ్మట చతుర్ముఖ దక్షాదులందును కాలమునందును నంతర్యామిగానుండి సృష్టిచేయును. విష్ణ్వవతారరూపముగను మనుకాలాదులందంతర్యామిగను నుండి రక్షణము చేయుచుండును. రుద్రకాలాంతకాదుల యందంతర్యామిగనుండి సంహారము చేయును. అందువలన సృష్టి స్థితి సంహారకర్త యగుచున్నాఁడు.

ఏవం ప్రకార ఈశ్వరః పరవ్యూహ విభవాన్తర్యామ్యర్చావతారరూపేణ పఞ్చప్రకారః. తత్రపరోనామ· త్రిపాద్విభూతౌ కుముదకుముదాక్ష పుణ్డరీక వామనశఙ్కుకర్ణసర్పనేత్రసుముఖ సుప్రతిష్ఠాదిభిః దివ్యాయుధభూషణపరిజన

పరిచ్ఛదాన్వితై శ్రీవ్యనగరపాలకై: పరిరక్షితే శ్రీమ ద్వైకుణ్ఠాఖ్యపురే చణ్డ ప్రచణ్డ భద్రసుభద్ర జయవిజయ ధాతృవిధాతృ ప్రభృతిభిర్ద్వారపాలకై రుపేతే శ్రీమద్దివ్యాలయే శ్రీ మహామణిమణ్డ పేధర్మాద్యష్టపాద విరచిత సిహ్మాసనే శేషపర్యఙ్కే చతుర్భుజ దివ్యమఙ్గళవిగ్రహ విశిష్టః, శ్రీ భూనీళాది సహిత, శఙ్ఖచక్రాది దివ్యాయుధోపేతః, కిరీటాది దివ్యభూషణభూషితో, వన్త గరుడ విష్వక్సేనాదిభిర్నిత్యై స్సామగానపరై ర స్యైర్ముక్తై శ్చానుభూయమానో, జ్ఞాన శక్త్యాద్యనన్త కల్యాణగుణ విశిష్టః, పరబ్రహ్మాది వాసుదేవాది శబ్దవాచ్యో, నారాయణః.

ఇట్టి యీశ్వరుఁడు పర వ్యూహ విభవ అంతర్యామి అర్చారూప ముగా నయిదు విధములయి యుండును. త్రిపాద్విభూతి యందు వైకుంఠమను పురమందు దివ్యాలయమున దివ్యమహామణిమండపమున సింహాసనమున శేషపర్యంకమున వసించు నారాయణుఁడు పరుఁడనం బడును. త్రిపాద్విభూతియందు కుముద కుముదాక్ష పుండరీక వామన శంకుకర్ణ సర్పనేత్ర సుముఖ సుప్రతిష్ఠితాదులు, దివ్యాయుధ దివ్య భూషణ దివ్యపరిజన దివ్యపరిచ్ఛేదములతోఁగూడిన నగరపాలకులచే రక్షితమగుచు నావైకుంఠపురముండును. అందలి దివ్యాలయము చండ, ప్రచండ, భద్ర, సుభద్ర, జయవిజయ, ధాతృ విధాత్రాదులగు ద్వార పాలకులచే రక్షితమగుచుండును అందలి సింహాసనమునకు ధర్మా ద్యష్ట పాదములుండును అందలి నారాయణుఁడు దివ్యమంగళవిగ్రహ విశిష్టుఁడును చతుర్భుజుఁడును శ్రీ భూనీళాసమేతుఁడును శంఖచక్రాది దివ్యాయుధములతో గూడియున్నవాఁడును శ్రీ మత్కిరీటాది దివ్య భూషణములతో నలంకరింపఁబడిన వాఁడును నిత్యులగు ననంత గరుడ విష్వక్సేనాదులచేతను సామగానముచేయుచున్న ముక్తులచేతను అనుభ వింపఁబడుచున్నవాఁడును జ్ఞానము శక్తి మున్నగు ననంత కల్యాణ గుణములతోఁగూడియున్న వాఁడును పరబ్రహ్మము, పరవాసుదేవుండు మున్నగు శబ్దములతోఁ జెప్పఁబడువాఁడును అయియుండును

వ్యూహోనామ - ఏవమేవ ఉపాసనార్థం జగత్సృష్ట్యాద్యర్థం చ వాసుదేవ సఙ్కర్షణ ప్రద్యుమ్నానిరుద్ధభేదేన చతుర్ధాఽవస్థితః, తత్ర షాడ్గుణ్యపరిపూర్ణో

వాసుదేవః – జ్ఞానబలాభ్యాం సఙ్కర్షణః – ఐశ్వర్యవీర్యాభ్యాం ప్రద్యుమ్నః- శక్తితేజోభ్యామనిరుద్ధ ఇతి గుణవిభాగః,

పరుఁడే వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ భేదములతో జగత్సృష్టి చేయుటకును ఉపాసనోపయోగమునకును నాల్గు విధములుగా నుండువాఁడు వ్యూహమవంబడును. వారిలో వాసుదేవునియందు జ్ఞాన శక్త్యాది షడ్గుణములుండును. సంకర్షణునియందు జ్ఞానబలములును ప్రద్యుమ్నునియంఁదు ఐశ్వర్యవీర్యములును అనిరుద్ధునియంఁదు శక్తి తేజస్సులును అను రెండేసి గుణములుండును. అన్ని వ్యూహరూపము లందును ఆరు గుణములున్నను రెండేసి గుణములు మాత్రము ప్రకాశి తము లగునని గ్రహింపఁదగును.

ఏతేషు చతుర్షు ప్రత్యేకం యతయస్త్రయోవర్గాః. కేశవాదయో వ్యూహాన్తరాణి ద్వాదశ – ద్వాదశమాసానాం ద్వాదశాదిత్యానామధి దైవతాని. ఊర్ధ్వపుణ్డ్రేషు చ తేషామవస్థాపనం విధీయతె.

(జ్ఞానమనఁగా సర్వదా సర్వవిషయ ప్రకాశకమును స్వప్రకాశము నగు గుణము. శక్తియనఁగా జగత్ప్రకృతిత్వము లేదా అఘటిత ఘటనా సామర్థ్యము. బలమనఁగా జగత్కారణత్వ ప్రయుక్త శ్రమము లేకుండుట. లేదా సమస్త వస్తుధారణ సామర్థ్యము, ఐశ్వర్యమనఁగాఁ గర్తృత్వలక్షణ స్వాతంత్ర్యము. లేదా సమస్త వస్తునియమన సామర్థ్యము. వీర్యమనఁగా జగదుపాదానమయినను స్వరూపవికారము లేకుండుట. తేజస్సనఁగా సహకారి నపేక్షింపకుండుట లేదా పరాభిభవన సామర్థ్యము.)

వారిలో సంకర్షణుఁడు శాస్త్రప్రవర్తనము, సంహారమును జేయును. ప్రద్యుమ్నుఁడు ధర్మోపదేశమును సృష్టిని జేయును. అనిరుద్ధుఁడు తత్త్వజ్ఞానమును రక్షణమును గావించును )

ఈ నాల్గు వ్యూహరూపములలో నొక్కొక్కరినుండి మూఁడేసి వ్యూహాంతరము లవతరించినవి. అవియే కేశవాది ద్వాదశరూపములు. వాసుదేవ రూపమునుండి కేశవ నారాయణ మాధవ రూపములను,

సంకర్షణ రూపమునుండి గోవింద విష్ణు మధుసూదన రూపములును. ప్రద్యుమ్న రూపమునుండి త్రివిక్రమ వామన శ్రీధర రూపములును. అనిరుద్ధ రూపమునుండి హృషీకేశ పద్మనాభ దామోదర రూపములను వ్యూహాంతరములు అవతరించెను. ఇవి పండ్రెండు మాసములకు పన్నిద్దరు సూర్యులకును వరుసగా నధిదైవములు. ద్వాదశోర్ధ్వపుండ్రము లందును ఈ కేశవాదులకు స్థానము విధింపఁబడెను.)

తత్ర కనకప్రభశ్చతుశ్చక్రధరః కేశవః. శ్యామో నారాయణశ్చతు-శ్శఙ్ఖధరః. మణిభృఙ్గాభో మాధవశ్చతుర్గదః. చన్ద్రాభో గోవిన్దశ్చతుశ్శార్ఙ్గః. పద్మకిఞ్జల్కసన్నిభో విష్ణుశ్చతుర్హలః. అబ్జాభో మధుసూదనశ్చతుర్ముసలః. అగ్నివర్ణస్త్రివిక్రమశ్చతుః ఖడ్గః బాలసూర్యాభో వామనశ్చతుర్వజ్రధరః, పుణ్డరీకాభశ్శ్రీధరశ్చతుష్పట్టస ధరః. తటిత్ప్రభో హృషీకేశశ్చతుర్ముద్గర ధరః. సూర్యాభః పద్మనాభః పఞ్చాయుధధరః. ఇన్ద్రగోపనిభో దామోదర శ్చతుష్పాశధరః.

వారిలోఁ గేశమూర్తి బంగారురంగుగలదియు నాల్గుచక్రాయుధములను ధరించునదియు, నారాయణుఁడు నల్లనివాఁడును నాల్గు శంఖములు ధరించువాఁడును మాధవుఁడింద్రనీలమణి వంటి కాంతి గల వాఁడును, నాల్గు గదలను ధరించువాఁడును, గోవిందుఁడు చంద్రుని వంటి కాంతిగలవాఁడును, నాల్గు శార్ఙ్గములను ధరించువాఁడును, విష్ణువు పద్మకింజల్కములవంటి కాంతి గలవాఁడును. నాల్గు హలములను (నాగళ్ళను) ధరించువాఁడును, మధుసూదనుండు తామరపూవువంటి కాంతికలిగి నాల్గు ముసలములను (రోకళ్ళను) ధరించువాఁడును. త్రివిక్రముఁడు అగ్నివంటి రంగుగలిగి నాల్గు ఖడ్గములను ధరించు వాఁడును. వామనుఁడు బాలసూర్యకాంతికలిగి నాల్గు వజ్రాయుధములను ధరించువాఁడును, శ్రీధరుఁడు పుండరీకమువంటి కాంతిగల్గి నాల్గు పట్టిశములను ధరించువాఁడును, హృషీకేశుఁడు మెరుపువంటి కాంతి కలిగి నాల్గు ముద్గరాయుధములను ధరించువాఁడును, పద్మనాభుఁడు సూర్యునివంటి కాంతి కలిగి పంచాయుధములు ధరించు వాఁడును,

దామోదరుఁడార్ద్రపురుగువంటి కాంతికలిగి నాల్గు పాశములను ధరించు వాఁడుగను నుందురు.

: భవోనామతత్తత్సజాతీయరూపేణావిర్భావః. స(ప్రసిద్ధి)ప్రాధాన్యేన దశధా - తేచమత్స్యకూర్మాదయోఽవతార విశేషాః తత్రవేదాపహారిదైత్య నిరాసపూర్వకం బ్రహ్మణే ప్రమాణ ప్రదానార్థమవతీర్ణో మత్స్యావతారః. జీవానా మజరామరణ హేతుభూతామృతోత్పాదన మన్దరాధారత్వేనావతీర్ణః కూర్మావతారః. సంసారనిమగ్న జనోద్ధరణకామః స్వమహిషీముద్ధర్తు మవతీర్ణో వరాహావతారః. ఆశ్రితరక్షణార్థం మహాసురం హన్తుం స్తమ్భాదుద్భూతో నారసింహావతారః. త్రివిక్రమోభూత్వా స్వపాదారవిన్దోద్భవేన జలేనజగద్రక్షణార్థమవతీర్ణో వామనావతారః దుష్టక్షత్రియనిరసనార్థమవతీర్ణః పరశురామావతారః, ధర్మసంస్థాపనార్థ మవతీర్ణో రామావతారః. ప్రలమ్బాది నిరసనార్థ మవతీర్ణో బలభద్రరామావతారః. చరమోపాయ ప్రదానార్థ మవతీర్ణః కృష్ణావతారః. అధర్మిష్ఠాన్నిరస్య పూర్ణధర్మప్రవర్తనార్థః కల్క్యవతారః. ఏవం దశావతారేష్వప్యేకైకావతారోఽనన్త ప్రకారః. పద్మనాభాదయోపిషట్త్రింశదవతారాస్సన్తి.

విభవరూపమనఁగా మనుజాదులతో సమానరూపమున నావిర్భవించిన రామాదిరూపములు. అవి పది విధములుగా మత్స్యకూర్మాది రూపములనను డును అందు వేదములనపహరించిన సోమకాసురునింజంపి బ్రహ్మదేవునికిఁ బ్రమాణములగు నా వేదముల నిచ్చుటకు ధరించిన మత్స్యరూపము ఒక అవతారము. దేవతలకు జరామరణములు లేకుండఁ జేయు నమృతమును జనింపఁజేయుటకు మందరపర్వతమును ధరించుటకు ధరించిన రూపము కూర్మావతారము సంసారసాగరమున మునిఁగిన జనులనుద్ధరించుటకై తనభార్యయగు భూదేవిని సముద్రము నుండి యుద్ధరించుటకు ధరించిన రూపము వరాహావతారము. ఆశ్రిత రక్షణార్థము హిరణ్యకశిపుని యింట స్తంభమున నవతరించిన రూపము నరసింహావతారము త్రివిక్రముండై జగత్స్వపమును తన పాదారవింద జలముతోఁబోగొట్టి జగద్రక్షణమునకై యవతరించినరూపము వామనావతారము. దుష్టక్షత్రియులను సంహరించుటకు ధరించిన రూపము.

పరశురామావతారము. శరణాగతరక్షణార్ధమును ధర్మస్థాపనార్ధమును నవతరించినరూపము శ్రీ రామావతారము ప్రలంబాది దుష్టసంహారార్ధమవతరించిన రూపము బలభద్రావతారము. మోక్షోపాయము ననుగ్రహించుటకు ధరించినరూపము శ్రీ కృష్ణావతారము. అధార్మికులను సంహరించి పూర్ణధర్మమును జనింపఁజేయుటకును కలివిరోధ్యాచవము నకు నవతరించిన రూపము కల్క్యవతారము. ఇట్లొక్కొక్క యవతారమున ననేకవిధములుగానుండెను. ముప్పదియారు విధములయిన పద్మనాభాదులును నవతారభేదములే.

(ఈ యవతారములు ముఖ్యములు గౌణములు నని రెండు విధములు సాక్షాదవతారములు ముఖ్యములు. ఆవేశావతారములు గౌణములు. ఆవేశావతారములుకూడ స్వరూపావేశము శక్త్యావేశము వలన ద్వివిధములు. పరశురామావతారాదులు స్వరూపావేశములు గలవి. విధిశివాదులందుఁ గార్యకాలమున నావేశము శక్త్యావేశమగును )

పునర్దధిభక్త హయగ్రీవ నరనారాయణాదయోపి, ఏవమేతే ముఖ్యగౌణ పూర్ణాంశావేశాఖ్యావాన్తరభేదేన చ బహుప్రకారాః-తేషూపాస్యానుపాస్య విభాగో ద్రష్టవ్యః.

ఇట్లే దధిభక్త, హయగ్రీవ నరనారాయణాదులును నవతార విశేషములే ఇవి ముఖ్యములు గౌణములు పూర్ణములు అంశావేశము మున్నగు తీరుల బహువిధములు. వీనిలోఁగొన్ని యుపాసనార్హములు. కొన్ని యుపాసనానర్హములు. ముఖ్యావతారములగు రామకృష్ణాదులుపాస్యులు. విధి శివ పావక వ్యాసాదులు గౌణములు. అహంకార యుక్త జీవునియందధిష్ఠించినవి కావున వివి ముముక్షువుల కనుపాస్యములు.

అవతారాణామిచ్ఛైవ హేతుః - నతుకర్మ. ప్రయోజనంతు దుష్టవినాశ పూర్వక సాధు పరిత్రాణమేవ.

**అవతారములకు భగవదిచ్ఛయే కారణము కాని కర్మకాదు. వీనికిఁ బ్రయోజనము దుష్టజన సంహార పూర్వకముగా సాధుజన సంరక్షణము.**

అన్తర్యామిత్వం నామ స్వర్గ నరకాద్యనుభవ దశాయామపి జీవాత్మనస్సుహృత్త్వేన, యోగిభిర్ద్రష్టవ్యతయా, హృదయప్రదేశావస్థిత రూపం. జీవేనసాకం విద్యమానోపితద్గత దోషైరసంస్పృష్టోవర్తతే.

జీవునియందు స్వర్గ నరకాదులందుఁ గర్మానుభవమును బొందు చున్నపుడు గూడ సుహృద్ధర్మముతో యోగులకు మాత్రము చూడఁదగి యుండు రూపముతో హృదయదేశమున వసియించియుండు రూపము అంతర్యామి యనంబడును. జీవునితోఁగూడియున్నను జీవగత దోషములు మాత్రము అంతర్యామిరూపుని స్పృశింపవు.

అర్చావతారోనామ దేశకాలవిప్రకర్షరహితః ఆశ్రితాభిమత ద్రవ్యం శరీరతయాస్వీకృత్యతస్మిన్న ప్రాకృతశరీర విశిష్టస్సన్నర్చక పరాధీన స్నాన భోజనాసనశయనస్థితిస్సర్వసహిష్ణుః పరిపూర్ణోగృహ గ్రామ నగర ప్రశస్త శైలాదిషు వర్తమానోమూర్తి విశేషః. సచస్వయం వ్యక్త దైవ సైద్ధమానుష భేదాచ్చతుర్విధః. ఏవముక్త పఞ్చావస్థాస్వపి శ్రీ విశిష్ట ఏవ భగవాన్వర్తత ఇతి శ్రుత్యాది ప్రమాణసిద్ధోఽర్థః. ఏతేనైకాయనోక్త విశ్లేషికవాద నిరాసః. ఏవమీశ్వరో నిరూపితః.

ఆశ్రితుల కిష్టమయిన ద్రవ్యమును (లోహము, శిల. దారువు ఇత్యాదులను) శరీరముగా స్వీకరించి యా ప్రతిమయందు అప్రాకృతము దివ్యము నగు శరీరముతోఁ గూడియుండి యర్చకునకధీనుఁడై యాతని యిచ్ఛానుసారముగా స్నానము భోజనము ఆసనము శయనము స్థితియు గలవాఁడగుచు సర్వమును సహించుచు గృహ గ్రామ నగర శైలాది ప్రదేశములందుండి పరిపూర్ణుఁడగు వాని రూపము అర్చారూపమనం బడును. ఈ రూపమునకు దేశకాలనియమములు లేక సర్వదేశముల యందును. స్థితి సంభవించును, పరవ్యూహములు దేశవిప్రకృష్టములు.

విభవములు కాల విప్రకృష్టములు అనఁగా సన్నికాలములయందు నుండునవి కావు. అంతర్యామి సామాన్యుల కగోచరము. అర్చారూప మట్లుకాక యన్నికాలములందును అన్నిప్రదేశములయందును, అందఱ కును సులభము.

అది స్వయంవ్యక్తము దైవము సైద్ధము మానుషము అని నాల్గువిధములు. ఈ యర్చావతారము షడ్గుణపూర్ణము.

ఈ విధమయిన పరవ్యూహాది పంచరూపముల యందును లక్ష్మీదేవితోఁగూడియే భగవంతుఁడు ఉండును. ఈవిషయము ప్రమాణ సిద్ధము. "నిత్యైవైషాజగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ" ఇత్యాదులు ప్రమాణములు. ఇట్లనుటచేత నేకాయనులు చెప్పిన విశ్శ్రీక వాదము అప్రమాణమని తేలినది. (ఉపాసకునికి ముందుగా నర్చావతారము నుపాసించుట కధికారము గలదు. తర్వాతఁ గ్రమముగా విభవ, వ్యూహ, పర, అంతర్యాముల నర్చించు నధికారము కల్గునట.) ఇట్లీశ్వర నిరూపణము గావింపఁబడెను.

ఇతి యతీన్ద్రమతదీపికాయాం
ఈశ్వర నిరూపణం నామ నవమోవతారః.

ఇది యీశ్వర నిరూపణమనఁబడు నవమావతారము.



## దశమోవతారః

ఏవం ద్రవ్యనిరూపణానన్తర మద్రవ్యం నిరూప్యతే - అద్రవ్యం సత్త్వరజస్తమాంసి శబ్దస్పర్శరూప రసగన్ధాస్సంయోగశ్శక్తిరితి దశప్రకార మేవ. ప్రకాశసుఖలాఘవాదినిదాన మతీన్ద్రియం శక్త్యాద్యతిరిక్త మద్రవ్యం సత్త్వం.

ఇట్లు ద్రవ్యములను నిరూపించిన పిమ్మట నావరుసలో వివరింప వలసివచ్చిన యద్రవ్యములను నిరూపించుచున్నాము. సంయోగము ద్రవ్యములకేకాని యితరములకు ఉండదు కావున "సంయోగరహితమగు వది యద్రవ్యము" అని యద్రవ్యలక్షణము

ఆ యద్రవ్యములు "సత్త్వరజస్తమస్సులు శబ్దము స్పర్శము రూపము రసము గంధము సంయోగము శక్తి" యని పది విధములుగా నుండును సత్త్వరజస్తమస్సులు ద్రవ్యములుకావు. ఇవి గుణములనియే వ్యవహారమున్నది. అనఁగా ద్రవ్యధర్మములు. అటులనే శ్రీభాష్యాదు లందు నిరూపితము.

సత్త్వమనఁగా "ప్రకాశము సుఖము లాఘవము మున్నగు వానికి మూలకారణమును అతీంద్రియమును శక్త్యాద్యతిరిక్తమును అగు నద్రవ్యము" ప్రకాశసుఖాదులు రజస్తమోగుణమూలకములు కావు కనుక నా రెండు గుణములకును ప్రథమ విశేషణముచే వ్యావృత్తికలుగును. అతీంద్రియమనుటచే శబ్దస్పర్శాదులును శక్త్యాద్యతిరిక్తములనుటచే శక్త్యాదులును వ్యావృత్తములగును ప్రకాశమనఁగా వస్తుయాథాత్మ్య జ్ఞానము

తద్ద్వివిధం - శుద్ధసత్త్వం మిశ్రసత్త్వం చేతి. రజస్తమోశూన్య ద్రవ్య వృత్తిసత్త్వం శుద్ధసత్త్వం. తన్నిత్యవిభూతౌ, ఉపచారాత్తత్ప్రవర్తకేశ్వరే, చ, రజస్తమస్సహవృత్తిసత్త్వం మిశ్రసత్త్వం త్రిగుణే, తత్సమ్బన్ధిజీవేచోప- చారాత్.

ఆ సత్త్వము శుద్ధసత్త్వము మిశ్రసత్త్వము అని ద్వివిధము. రజస్తమస్సులులేని ద్రవ్యమునందుండునది శుద్ధసత్త్వము. అట్టిది నిత్యవిభూతియందును, దానిని బ్రవర్తింపఁజేయు నీశ్వరునియందు నౌపచారికముగను నుండును, రజస్తమస్సులతోఁ గూడి యుండునది మిశ్రసత్త్వము, అది త్రిగుణద్రవ్యమగు ప్రకృతియందును దానితో సంబంధించిన జీవునియందును నుండును. (జీవునియందౌపచారికము) దీనినే యశుద్ధసత్త్వమనియు నందురు.

రాగతృష్ణాలోభ ప్రవృత్త్యాదినిదాన మతీన్ద్రియంశక్త్యాద్యతిరిక్త మద్రవ్యం రజః

" లోభము, ప్రవృత్తి, మున్నగువానికి మూలకారణమును అతీంద్రియమును శక్త్యాద్యతిరిక్తమునగు నద్రవ్యము రజస్సు " లోభము = తనద్రవ్యము నొరులకీయకుండు స్వభావము, పిసినిగొట్టుతనము. ఇది యారంభము, అశాంతి. స్పృహ, మున్నగువానిని గల్గించును.

మోహప్రమాదా ప్రివృత్త్యాదినిదాన మతీన్ద్రియం శక్త్యాద్యతిరిక్త మద్రవ్యంతమః.

ప్రమాదము మోహము మున్నగువానికి మూలకారణమును అతీంద్రియమును శక్త్యాద్యతిరిక్తమునగు నద్రవ్యము తమస్సు " ఇది యప్రకాశము అప్రవృత్తి యనఁగా స్తబ్ధత మున్నగువానింగూడ జనింపఁజేయును.

త్రీణ్యప్యేతానియావత్ప్రకృతివ్యాప్తాని, ప్రకృతివశ్యపురుష సమ్బద్ధా, న్యనిత్యాని, నిత్యసన్తానాని, ప్రళయ దశాయాం సమాని, సృష్టి దశాయాం విషమాణి, సృష్టి స్థితి సంహారోపయుక్తా నీశ్వరసఙ్కల్ప భేదాత్పరస్పరాభిభవోద్భవకారణానీ, త్యేతాని సాధారణాని.

ఈగుణములు ప్రకృతియంతటను వ్యాపించియుండును, ప్రకృతి వశుఁడగు పురుషునియందును సంబంధించియుండును. అనిత్యములు ప్రవాహతో నిత్యములు. ప్రలయకాలమున సమముగానుండి సృష్టికాలమున విషమముగానుండునవి. అనఁగా నీమూడుగుణములును హెచ్చు తగ్గులుగానుండి సృష్టి స్థితి సంహారముల కుపయుక్తములగును. ఈశ్వర సంకల్పము మున్నగు సహకారులవలన నొక గుణమున కొకగుణము తిరస్కారమును ఉద్భవమును జేయుచుండును. ఈ గుణములు దీనికి సమానములు.

సత్త్వగుణస్తు సమ్యగ్జ్ఞానరూప సుఖాదిహేతుర్మోక్షప్రదశ్చ. రజోగుణస్తు రాగాద్యాత్మక కర్మసఙ్గ దుఃఖాది హేతుస్స్వర్గ నరకాద్యాముష్మిక ప్రదశ్చ తమోగుణస్త్వ జ్ఞానాలస్యాది హేతుర్నరక ప్రదశ్చ. అతస్సత్త్వాదయోగుణాః నద్రవ్యరూపాః.

సత్త్వగుణము సమ్యక్జ్ఞానరూపము సుఖమును మోక్షమును గలిగించును. రజోగుణము రాగాద్యాత్మకము కర్మసంగమును దుఃఖాదులను గలిగించును స్వర్గాద్యాముష్మిక ఫలములనిచ్చును. తమోగుణము అజ్ఞానరూపము. ఆలస్యాదులను కలిగించును. నరకమునకు హేతువు. కావున సత్త్వాదులు ద్రవ్యరూపములు కావు

అస్మదాది శ్రోత్రగ్రాహ్యః పఞ్చభూతవర్తీ శబ్దః. సచ ద్వివిధః - వర్ణాత్మకోఽవర్ణాత్మకశ్చేతి. అకచటతపయాది పఞ్చాశదక్షరాత్మకో వర్ణాత్మకః. సఃదేవమనుష్యాది తాల్వాదివ్యఙ్గ్యః. నభేర్యాదిజన్యోఽవర్ణాత్మకః. ఏవమ్భూత శ్శబ్దశ్శ్రోత్రేన్ద్రియేణ గృహ్యతే. శ్రోత్రేన్ద్రియగమనాద్వా - వ్యఞ్జకవాయు గమనాద్వాశబ్దగ్రహః

"అస్మదాదులకు శ్రోత్రగ్రాహ్యమును పంచభూతములయందుండునదియు శబ్దము" "మేఘము గర్జించుచున్నది. శంఖము ధ్వనించుచున్నది. ఇత్యాది వ్యవహారమువలన నిది పంచభూతవర్తియని గమ్యమానమగుచున్నది. వాయువునకే తాల్వాదిస్థానసంబంధమువలన

శబ్దరూపముగాఁ బరిణామము సంభవించుట ప్రసిద్ధము. కావున శబ్దము ఆకాశమునందేకాక యితర భూతములందును నుండునని తెలియఁ బడును

శబ్దము వర్ణాత్మకము అవర్ణాత్మకము అని రెండు విధములు. అ, క, చ, ట, త, ప, య, మున్నగు పంచాశ (50) దక్షర రూపమగు శబ్దము వర్ణాత్మకము. (అకారాద్యచ్చులు పదునారు కకారాదిస్పర్శలు ఇరువది యైదు. అంతస్థములు నాలుగు, ఊష్మములు నాలుగు ఏబది యవ యక్షరము క్షకారమని చెప్పుదురు, అది మాతృకాపాఠమున పఠితము. కొందరు ళకారమనియుఁ జెప్పుదురు) ఈవర్ణాత్మక శబ్దము దేవమనుష్యాదుల తాల్వాద్యవయవములచె వ్యక్తమగు చుండును. భేర్యాదులవలన జనించిన శబ్దమువర్ణాత్మకము ఇట్టిశబ్దము శ్రోత్రేంద్రియముచే గ్రాహ్యము "శబ్దము శ్రోత్రేంద్రియమున్న స్థలమున కతి దూరమునఁబుట్టుచున్నను గ్రాహ్యమగుచున్నదే. శబ్దమునకు శ్రోత్రేంద్రియముతో సన్నికర్షమెట్లు సంభవించును" అని శంకింపరాదు. "శబ్దము దూరమునుండి వచ్చుచున్నది. సమీపమునుండి వచ్చుచున్నది. తూర్పుదిక్కునుండి వచ్చుచున్నది - మున్నగు ప్రతీతులు కలుగుచున్నవి. కావున శ్రోత్రేంద్రియమేశబ్దోత్పత్తి స్థానమునకుఁబోయి శబ్దముతోఁ గలియుచున్నది" అని కొందరు చెప్పుదురు. శ్రోత్రేంద్రియము శబ్దోత్పత్తి స్థానమునకుఁ బోవుటచేతనే ఆస్థానము తెలియఁబడుచున్నది. కావున శ్రోత్రేంద్రియముపోయి శబ్దమును గ్రహించును. లేదా శబ్దమును వ్యక్తముచేయు తదాధారవాయువు శ్రోత్రేంద్రియమునొద్దకు వచ్చుట వలనఁగాని విషయేంద్రియముల సంనికర్షము సిద్ధించును.

నను శ్రుత్యా శబ్దస్య ద్రవ్యత్వం ప్రతీయతే-అద్రవ్యత్వం కథ మితిచేన్న అకారాదేః ప్రణవోత్పాదకత్వం వాచ్యద్వారా సమ్భవతీతి పరిహారాద ద్రవ్యత్వ ముపపద్యతే.

"శబ్దము అద్రవ్య మను కుదురదు - అద్రవ్యమయినచో దేనికిని ఉపాదానకారణము కారాదు, అకారోకారమకారములు అను వర్ణాత్మక శబ్దములు ప్రణవమునకు ఉపాదానకారణమగుట వేదసిద్ధము.

అకారోకారమకారములే ఓంకారమయ్యెనని "తేభ్యోభితప్తేభ్యస్త్రయోవర్ణా అజాయన్త అకారఉకారోమకారఇతి. తానేకధాసమభరత్ తదేతదోమితి" ఈశ్రుతివలన నూహ్యము. కావున శబ్దమద్రవ్యమగుటయెట్లు అని శంక కలుగుచున్నది ఇచ్చట అకారాది శబ్దములు ప్రణవమునకుఁ గారణము లని యాశ్రుతికిఁ దాత్పర్యముకాదు. అకారాది శబ్దములకు వాచ్యము లయిన ద్రవ్యములచే బ్రణవముత్పన్నమయ్యెనని తాత్పర్యము శబ్దము వేరు అర్థమువేరు కదా. ఇచట శబ్దము కాక దాని యర్థములే యుపాదానములయ్యెనని భావము. కావున శబ్దమునకు ఉపాదానత్వమును దన్మూలమయిన ద్రవ్యత్వమును సంభవింపవు. కాన శబ్దము అద్రవ్య మనుటకు విరోధములేదు. ఇట్లు శబ్దము నిరూపితము

అస్మదాది స్పర్శనేన్ద్రియ గ్రాహ్యవిజాతీయవ్యావృత్తోఽద్రవ్యం స్పర్శః. సచ త్రివిధః - శీతోష్ణానుభయాత్మకభేదాత్. అప్సుశీతస్పర్శః. తేజస్యుష్ణస్పర్శః క్షితిపవనయోరనుష్ణాశీతస్పర్శః. పునర్ద్వివిధః-పాకజోఽ పాకజశ్చేతి. పృథివ్యాం పూర్వః. ఇతరేషు త్రిషుపరః తత్రామృతగరళ ముక్తాఫలదుకూలోపల గోబ్రాహ్మణ చణ్డాలాదిస్పర్శ విశేషాఃపాకజభేదాః.

అస్మదాది స్పర్శనేంద్రియగ్రాహ్య విజాతీయ వ్యావృత్తమగు నద్రవ్యము స్పర్శము. అవి స్పర్శలక్షణము. స్పర్శనేంద్రియమునకు మాత్రమే గ్రాహ్యమగు వస్తువునకు విజాతియముకావి యద్రవ్యమని భావము. స్పర్శనేంద్రియమునకు మాత్రమే గ్రాహ్యమగు నద్రవ్యము ఘటఘటాదుల స్పర్శము. దీనికి విజాతీయములగునవి శబ్దరూపాదులు. సజాతీయములగునవి యఖిలవస్తునిష్ఠస్పర్శములేయగును సూక్ష్మావస్థలో నున్న స్పర్శము అనుద్భూతస్పర్శ మనఁబడును ఇట్టి సూక్ష్మరూపము లును అనుద్భూతరూపాదులగును. అవి యింద్రియగ్రాహ్యములుకావు స్పర్శనేంద్రియగ్రాహ్యము స్పర్శమన్నచో అనుద్భూత స్పర్శము స్పర్శ నేంద్రియగ్రాహ్యము కాదు కనుక దానియందు స్పర్శలక్షణ మవ్యాప్త మగును. కావున విజాతీయ వ్యావృత్తమను దళము చేర్పఁబడెను. అనుద్భూతస్పర్శము స్పర్శనేంద్రియగ్రాహ్యము కాకున్నను దత్సజాతీ యమేయగును కావున లక్షణము సరిపడును. అద్రవ్యమనుటవలన ఘటాదులు వ్యావృత్తములయ్యెను.

అది శీతస్పర్శము ఉష్ణస్పర్శము అనుభయస్పర్శము అని మువ్విధము. జలమునందు శీతస్పర్శము. తేజమునందుష్ణస్పర్శము పృథివీవాయువులందనుష్ణాశీతస్పర్శము ఆస్పర్శము మరల పాకజము అపాకజము అని ద్వివిధము. పృథివియందు పాకజము. జలతేజోవాయువులయందపాకజస్పర్శము. అమృత, గరలముల యొక్కయు తూలోపలముల యొక్కయు గోబ్రాహ్మణ చండాలాదుల యొక్కయు భిన్న భిన్న స్పర్శ విశేషములు పాకజములే యగును (అమృత గరలముల స్పర్శము సుఖ దుఃఖ హేతువు, తూలోపలముల స్పర్శము మృదు కఠినరూపము. బ్రాహ్మణచండాలుల స్పర్శము శుద్ధ్యశుద్ధి భేదభిన్నము. అవి గ్రాహ్యము మృదుత్వ కఠినత్వాదులను స్పర్శనేంద్రియగ్రాహ్యములే కావున స్పర్శవిశేషములే చక్షురింద్రియముచే నవి గ్రహింపఁబడవు. కాని మృదుత్వవ్యాప్తమగు రూపవిశేషముచే ననుమితములగును.

అస్మదాది చక్షురింద్రియైక గ్రాహ్యవిజాతీయ వ్యావృత్త మద్రవ్యం రూపం.

"అస్మదాది చక్షురింద్రియైక గ్రాహ్యవిజాతీయ వ్యావృత్తమగు నద్రవ్యము రూపము" అని రూపలక్షణము. చక్షురింద్రియమునకు మాత్రమే గ్రాహ్యమగు వస్తువునకు విజాతీయముకాని యద్రవ్యము అని భావము. చక్షురింద్రియమునకు మాత్రమే గ్రాహ్యమగు వస్తువు ఘటపటాదుల యందలి రూపము. దీనికి విజాతీయములగునవి శబ్ద స్పర్శాదులు సజాతీయములు అఖిలవస్తు నిష్ఠములగు రూపములే యగును. సూక్ష్మవస్తులోనున్న రూపాదులను అనుద్భూతరూపము, అనుద్భూతశబ్దము మున్నగు రీతిని వ్యవహరింతురు. అవి సూక్ష్మము లగుటచే చక్షురాదీంద్రియములకు గ్రాహ్యములు కావు. "చక్షురింద్రియ గ్రాహ్యమురూపము" అన్నచో అనుద్భూతరూపమును చక్షురింద్రియము గ్రహింపలేదు కనుక దానియందు రూపలక్షణము అవ్యాప్తమగును. కావున "విజాతీయవ్యావృత్తము" అను దళము వేయఁబడెను. అనుద్భూతరూపము చక్షుర్గ్రాహ్యము కాకున్నను తత్సజాతీయమే యగును కావున లక్షణము సరిగానుండును. అద్రవ్యమనుటవలన ఘటములు

వ్యావృత్తములు. ఇట్లే ఇతర గుణ లక్షణముల దళసార్థక్యమును ఊహించునది. వెనుక చెప్పఁబడిన శబ్దలక్షణమును ఇట్లే ఊహ్యము అనఁగా శ్రవణైకగ్రాహ్యవిజాతీయ వ్యావృత్తమగు నద్రవ్యము అని భావము.

తచ్చతుర్ధా—సితరక్తపీత కృష్ణభేదాత్. రజతకలధౌత శఙ్ఖశుక్తి శశాఙ్కాదీనాం రూపవిశేషాస్సితభేదాః, హుతవహజపాదాడిమబన్ధు జీవవిద్రుమ పద్మరాగాదీనాం రూపవిశేషాః రక్తభేదాః. కాఞ్చనహరి తాళహరిద్రాణాం రూప విశేషాః పీతభేదాః. మరకత మధుకర జలధర తిమిరతమాలదూర్వాదీనాం రూపవిశేషాః కృష్ణభేదాః. పీతిమానమపి రక్తావాన్తరభేదం కేచిదిచ్ఛన్తి—శ్రుత్యనుసారాత్. ప్రకారాన్తరేణ రూపం ద్వివిధం – భాస్వరాభాస్వరభేదాత్. తేజోగతం భాస్వరం. క్షితిసలిలాదిగతమభాస్వరం. ఏవం చత్వార్యేవ రూపాణి. ఏతేన చిత్రంనామ పఞ్చమం రూపమితి మతనిరాసః అత ఏవ చిత్రగన్ధస్పర్శరసానామపి నిరాసః,

ఆ రూపము నాల్గు విధములు. తెలుపు, ఎరుపు, పచ్చరంగు, నలుపు అని భేదములు. వెండి, రజతము, శంఖము, ముత్తెపుచిప్ప, చంద్రుఁడు మున్నగువాని రూపములు శ్వేతరూపములు అగ్ని, దాసన పూవు, దానిమ్మగింజ, మంకెనపూవు, పగడము, పద్మరాగము, మున్నగువానివి రక్తరూపములు బంగారము, హరితాలము (అరిదళము) పసుపు – మున్నగువానివి పీతరూపములు. "యదగ్నేరోహితం రూపం తేజసస్తద్రూపం యచ్ఛుక్లంతదపాం యత్కృష్ణంతదన్నస్య" అను శ్రుతివలన మూఁడే రూపములనియుఁ పీతవర్ణము కూడ రక్తావాంతర భేదమేయనియుఁ గొందరు తలంతురు. మరియొక విధముగా రూపము రెండువిధములు. భాస్వరరూపము, అభాస్వరరూపము అని యాభేదములు తేజస్సునందు భాస్వరము, పృథివీ సలిలములందు అభాస్వరమును నుండును ఇట్లు రూపములు నాల్గేయనుటచేఁ జిత్రరూపమను పంచమ విధమును నిరసించినట్లే– చిత్రరూపము ప్రత్యేకరూపముకాదని భావము కనుక చిత్రగంధము, చిత్రరసము, చిత్రస్పర్శము అను గుణములును నిరస్తములు. ఇది రూపనిరూపణము.

(మంత్రశాస్త్రమునందు పంచభూతములకు పీత శ్వేత రక్త ధూమ్రములు అను నయిదు వర్ణములు చెప్పఁబడినవి అట్లయినచో "యదగ్నే రోహితం" ఇత్యాది శ్రుతివిరోధము సంభవించును. కావున ధ్యానమునకైయందు వర్ణములు ప్రోక్తములే కాని వాని భేదములను జెప్పుటకాదని తలంపవలయును)

అస్మదాది రసనేన్ద్రియ గ్రాహ్యావిజాతిమేతరోరసః. సషోఢా – మధురామ్లలవణతిక్తకటుకషాయభేదాత్. తత్రేక్షుక్షీరగుడాదిరసాః మధుర భేదాః. చూతచిఞ్చామలకాదిరసా అమ్లభేదాః. సైన్ధవోషరవికారాదిరసాః లవణ భేదాః. కిమ్పాకనిమ్బాదిరసా స్తిక్తభేదాః. శుణ్ఠీమరీచసర్షపాదిరసాఃకటు భేదాః. హరీతకీవిభీతకీచూతాఙ్కురాదిరసాః కషాయభేదాః,

"అస్మదాది జిహ్వైకగ్రాహ్య విజాతియేతరమురసము" అనునది రసలక్షణము – దీని వివరణము వెనుకటి లక్షణములవలె నూహ్యము. అది–మధురము (తీయన) అమ్లము (పులుపు) లవణము (ఉప్పఁదనము) కటు (కారము) కషాయము (ఒగరు) తిక్తము (చేదు) అని ఆరు విధములు. వానిలో చెరుకు, పాలు. బెల్లము మున్నగువాని రసములు మధుర భేదములు. మామిడికాయ, చింతపండు, (ఆమలకము – ఉసిరికాయ) మున్నగునవి యామ్లరసభేదములు. ఉప్పు చవిటిమన్ను – మున్నగునవి లవణరసభేదములు కిం పాకము (కాంజీరమను వృక్షము ఫలము) వేపరసము మున్నగునవి తిక్తరసభేదములు. హరీతకీ (కరకకాయ) విభీతకము (తాండ్రకాయ) మామిడిచిగురు) మున్నగునవి కషాయభేదములు. సొంఠి, మిరియాలు, ఆవగింజ, మున్నగునవి కటుభేదములు. ఇది రసనిరూపణము.

అస్మదాది ఘ్రాణగ్రాహ్య విజాతిమేతరోగన్ధః. సద్వివిధః. సురభి రసురభిశ్చ. పాటీరమృగమదఘుసృణచమ్పకాదిగన్ధాస్సురభి భేదాః. తదన్యే వ్యసురభిగన్ధాః. అయంచగన్ధః పృథివ్యేకవర్తీ పాక భేదాద్భిన్నః పవన సలిలాదిషగన్ధోపలబ్ధిః పార్థివసంసర్గాత్ ఆమోదహతీతిపదొపఞ్ఞేకీ. పటీచ

కరణ ప్రక్రియయా సర్వభూతేషు సర్వగుణానాం విద్యమానత్వేపి ప్రాధాన్యాభి ప్రాయేణోక్తమితిన విరోధః. పాకాద్గుణాన్తరోత్పత్తి స్స్వాశ్రయే. స్వాశ్రయ నాశాభావాదేవోపపత్తేః పీలుపాకాదిమతనిరాసః.

అస్మదాది ఘ్రాణగ్రాహ్యా విజాతీయేతరమగు నద్రవ్యము గంధము అది సురభి గంధము, అసురభిగంధము నని ద్వివిధము. చందనము, కస్తూరి, కుంకుమపూవు, సంపంగిపూవు మున్నగువాని గంధములు సురభిగంధములు. ఈగంధము పృధివియందు మాత్రమే యుండును పాకభేదమువలన వివిధము. గాలియందు నీటియందును గంధము కానవచ్చుట పృధివీసంయోగమువలననే కాని సహజముకాదు. "అయోదహతి" ఇనుము కాలుచున్నది అను వ్యవహారమున అయస్సు నకు (ఇనుముకు) దాహకత్వము అగ్నిసంబంధమువలననేకదా కలిగెను. అట్లే పార్థివసంయోగము వలననే వాయుజలాదులకు గంధవత్త్వము కల్గును పంచీకరణ ప్రక్రియచేత నన్నిభూతములును బరస్పరమిశ్రిత ములే యయియుండుటచే నన్నిభూతములయందును అన్ని భూతముల గుణములు ఉన్నను ప్రధానభూతమునుబట్టి యాయా గుణములు చెప్పఁ బడినవి కావున విరోధములేదు పాకమువలన గుణములు మారు చున్నవి అట్టి మార్పు ఆగుణమున కాశ్రయభూతమగు ద్రవ్యము నశింపకయే జరుగును. ఘటాదులయందుఁ బావము వలన గుణములు మార్చుటకు అవి పరమాణు పర్యంతము నశించు పరమాణువులయందు గుణములుమారి అవయవియందు భాసించునని వైశేషికుల మతము. పీలువు = పరమాణువు. దానియందే పాకము సంభవించునను వైశేషి కులు పీలుపాకవాదులు అవయవి నశింపకయే పాకమువలన గుణము మారునని మనమంగీకరించుటవలనను పరమాణుకారణత్వము నిరస్త మగుటచేతను వైశేషిక మతము నిరస్తమయ్యెను నైయాయికులు పిఠరపాకవాదులు పిఠరమనఁగా ఘటము. అనగా నవయవియందును పాకము సంభవించుననువారు నైయాయికులు. అవయవములకంటెస్ నతిరిక్తముగా నవయవిని మన మంగీకరింపము కావున నవయవియందు బాకము నంగీకరించునైయాయికులును నిరస్తులే. మనము విభక్తావయవ

ములందును సంయుక్తావయవములందును గూడ యథా సంభవముగాఁ బాకముసంగీకరింతుము. ఇది గంధనిరూపణము

సంయుక్త ప్రత్యయ నిమిత్తం సంయోగః. సచ సామాన్యగుణః షడ్వృత్తిః. అస్య చ స్వాభావసాదేశ్యమువలభ్యమానమంశభేద ప్రయుక్త తయా నవిరోధావహం.

"ఇవిరెండును గలసియున్నవి" అను జ్ఞానము దేనివలనఁ గలుగునో యది సంయోగము. అది సామాన్యగుణము. అనఁగా గంధాదులవలె నొక్కదానియందే నియమితముగా నుండునది కాదు. అనఁగా నది ఆరుద్రవ్యములయందునుండును ఇది దానియభావముతోఁ గూడ నొక యధికరణముననే యుండును అనఁగా నొక వస్తువునందే సంయోగము, నంయోగాభావముకూడ నుండును. అట్లు రెండునుగలపి యుండుట అంశభేదముచే సంభవించును. అనఁగా నొక భాగమున సంయోగమును మరియొక భాగమున సంయోగాభావమును నుండును. కనుకనే వాని సామానాధికరణ్యము విరుద్ధముకాదు. ఒక వృక్షమునఁ గోతియున్నపుడు ఆచెట్టునకు కపి సంయోగము కలదందుము కాని ఆచెట్టుననే మరియొక భాగమున కపిసంయోగము లేకుండుటయుగల్గును. కావున సంయోగా సంయోగములు సమానాధికరణములగుట విరుద్ధముకాదు.

సచ కార్యాకార్యభేదాద్ద్వివిధః - పూర్వః పరిమితానాం ఉభయప్రేరణా న్వేషయోః - క్వచిదన్యతర ప్రేరణాత్ స్థాణు శ్యేనయోస్సంయోగః. కేచిత్సం యోగజ సంయోగమపి వదన్తి. హస్తపుస్తక సంయోగఇతి తన్న - హస్త పుస్తక సంయోగేనైవోపపత్తేః ఏతేన విభాగజ విభాగోపి నిరస్తః. విభాగః పిణ్ణసంయోగాభావఏవ. నపృథగ్గుణః.

ఆ సంయోగము కార్యము అకార్యము అని ద్వివిధము. కార్య సంయోగము కొన్ని వస్తువులలో రెండిటియొక్క ప్రయత్నమువలనను జరుగును రెండు గొఱ్ఱెలును, ఇద్దరు మల్లురును యుద్ధమునకుగలియుట

యట్టిదే. కొన్నిచోట్ల రెండిటిలో నొకదాని ప్రేరణమువలన జరుగును ఒక కొయ్యమీద డేగవాలుట యిట్టిదే. ఇట డేగ ప్రయత్నమేకాని కొయ్యప్రయత్నమేమియును లేదు. కార్యసంయోగ మనిత్యమనియు అకార్యసంయోగమునిత్యమనియుఁ దెలియునది. కొందరు సంయోగజ సంయోగమని యొక భేదము కలదందురు అదెట్లన హస్తపుస్తక సంయోగమువలన కాయపుస్తక సంయోగము కల్గుట కాని యదికాదు. అవయవముకంటె నవయవి వేఱుగాలేదు కనుక హస్తసంయోగము వలననే కాయసంయోగమును సిద్ధించుచున్నది కనుక అదిభిన్నముకాదు.

అవయవములకంటె నవయవి భిన్నమని యంగీకరించినను హస్తసంయోగముకంటె కాయసంయోగము భిన్నముకాదు. హస్తపుస్తక సంయోగమునకును దేవదత్తపుస్తక సంయోగమునకును ఆనంతర్యము అనఁగా క్రమముభాసింపలేదు కావున నవి రెండును నొక్కటియే యగును. ఇట్లనుటవలన విభాగజ విభాగముకూడ నిరస్తమయ్యెను. విభాగమనునది సంయోగాభావమే కాని వేరొక గుణముకాదు

అకార్యసంయోగస్తు విభుద్రవ్యయోః. అజద్రవ్యసంయోగః శ్రుత్యాఙ్గీక్రియతే. అనుమానాదప్యజ ద్రవ్యసంయోగసిద్ధిః యథా-విభుద్రవ్యం విభుద్రవ్యసంయోగవత్ - ద్రవ్యత్వాత్ - ఘటవత్ తథా - విగీతమీశ్వర సంయుక్తం - ద్రవ్యత్వాత్ - ఘటవత్. ఈశ్వరః కాలాదిసంయుక్తః - ద్రవ్యత్వాత్ - ఘటవత్. ఇత్యాదిభిర్విభుసంయోగస్సిద్ధః.

విభుద్రవ్యముల సంయోగము అకార్యసంయోగము అజ (నిత్య) ద్రవ్యముల సంయోగము "సర్వవ్యాపీచ భగవాన్" "అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణః స్థితః" ఇత్యాదిశ్రుతులవలన సిద్ధించుచున్నది. అనుమాన ప్రమాణము వలనను ఈ సంయోగము సిద్ధించుచున్నది. ఎట్లన - విభుద్రవ్యము ద్రవ్యమే కావున ఘటాదుల వలె విభుద్రవ్యసంయోగముకలది. ఇట్లే విభుద్రవ్యము ద్రవ్యము కావున ఘటాదులవలె నీశ్వరసంయుక్తము - ఇట్లే - ఈశ్వరుఁడు ద్రవ్యముకావున ఘటాదులవలె కాలాది సంయుక్తుఁడు ఇత్యాది రీతిగా విభుద్రవ్యసంయోగ మనుమానసిద్ధము.

అథశక్తిస్సర్వకారణానాం కారణత్వనిర్వాహకః కశ్చిదదృష్ట విశేషః. తర్కాగమాభ్యాంతత్సిద్ధిః – ప్రతిబంధకమణిమన్త్రాదిసన్నిధౌ స్వరూపసహకారి వైకల్యాభావేఽపియదుపరోధాద్దహనోనదహతి – సాఽత్యతీన్ద్రియాశక్తిః. అయస్కాన్తాదిషు తత్ప్రసిద్ధిః సాశక్తిష్షడ్ద్రవ్యవర్తినీ. భగవన్నిష్ఠత్వంచపురాణ రత్నాదిషు ప్రసిద్ధం. ఏవం సప్తతాత్రపి శక్తినామక ధర్మవిశేషసిద్ధిః.

సర్వకారణములకును గారణత్వమును నిర్వహించునట్టి యొక యదృష్టవిశేషమే శక్తియనంబడును శక్తికలదనుటకు తర్కమును ఆగమమును బ్రమాణములు అగ్నికి దాహకత్వము అనఁగా దహన కారణత్వముకలదు; అట్టి దాహకత్వము ప్రతిబంధకములగు మణి మంత్రము, మున్నగువాని సన్నిధిలో కానరాదు అపుడు అగ్నియొక్క స్వరూపమునకుఁగాని సహకారులకుగాని లోపము లేదు, అయినను దాహకత్వము కలుగకుండుటకొక కారణము ఉండి యుండవలయును. అది యేదనఁగా శక్త్యభావము కావున శక్తియున్ననే దాహకత్వము కల్గును. అదిలేనిచోఁగలుగదు. కావున శక్తియను నొకగుణము (అదృష్టము) కలదని నిశ్చితమగుచున్నది "మణ్యాదులచే శక్తి నిరోధింపఁబడియుండనిచో నగ్నికి దాహకత్వమే యుండును" అను తర్కము దాహకత్వ కారణమగు శక్తికిఁ బ్రమాణమగుచున్నది. "శక్తయస్సర్వభూతానామచింత్యా అపృథక్ స్థితాః" అను శాస్త్రమును ఈ విషయమునం బ్రమాణము. ఆశక్తి అతీంద్రియము, అయస్కాన్తాదు లందు ఆశక్తి సుప్రసిద్ధముగానున్నది. శక్తి ఆరు ద్రవ్యములందును ఉండును. శక్తి భగవంతునియందును ఉండుననుట విష్ణుపురాణాదు లందుఁ బ్రసిద్ధము –

శక్తయస్సర్వభావానామచింత్య జ్ఞానగోచరాః ॥
యతోఽతో బ్రహ్మణస్తాస్తు సర్గాద్యాభావశక్తయః ।
భవంతి తపతాంశ్రేష్ఠ ! పావకస్యవథోష్ణతా ॥

అని విష్ణుపురాణము – ఇట్లే యంతటను శక్తియను ధర్మ విశేషము సిద్ధించెను.

